


పూర్వం అవంతీనగరంలో, ఒక ముసలి వర్తకు డుండేవాడు. అతడు వయసులో వుండగా, ఖండాంతరాల్లోని అనేకదేశాలు తిరిగి, ఓడవర్తకంవల్ల చాలా ధనం గడించాడు. కాలక్రమాన వయసు ముదిరి, వృద్ధాప్యం మీదపడుతూండగా, అతడు తన వ్యాపారాన్ని కొడుకులకు అప్పగించాలని ప్రయత్నించాడు. కాని, అతడి ముగ్గురు కొడుకుల్లో పెద్దవాళ్లయిన జీవదత్తుడూ, లకీదత్తుడూ ఎందుకూ పనికిరాని వాళ్లుగా తయారయారు.

వాళ్లు దురలవాట్లకు లోనై, యింటి పట్టునే వుండేవాళ్లుకాదు. మూడవవాడైన పింగళుడుకి యింకా యిరవై ఏళ్లయినా నిండలేదు. ముసలివర్తకుడు దిగులుతో మంచం పట్టి, మరణించేముందు, తన యావదాస్తినీ ముగ్గురు కొడుకులకూ, భార్యకూ సమంగా పంచియిచ్చాడు తండ్రి మరణించగానే, పెద్దవాళ్లయిన జీవదత్తుడూ, లకీదత్తుడూ తమకు సంక్రమించిన ఆస్తిని, విచ్చలవిడిగా ఖర్చుపెట్ట సాగారు. తన పెద్దకొడుకులు యిద్దరూ నిష్ప్రయోజకులని గ్రహించిన తల్లి, తన వాటాకు వచ్చిన ఆస్తితో చిన్నవాడైన పింగళుడి యింటికి వెళ్లి, అక్కడే వుండసాగింది.

జీవదత్తుడూ, లకీదత్తుడూ తమ చేజిక్కిన డబ్బు అయిపోగానే, తల్లిని వెతుక్కుంటూ, పింగళుడి యింటికి వచ్చారు. పింగళుడు అన్నలను చాలా ఆదరంతో ఆహ్వానించాడు. కాని, వాళ్లిద్దరూ







వస్తూనే పింగళుడిని కసిరికొట్టి, తల్లిదగ్గరకు వెళ్ళి, ఆమెను తమ యింటికి రావలసిందిగా అడిగారు.

తనంటే, ఏమాత్రం గౌరవంగాని, ప్రేమగాని లేని పెద్దకొడుకు లిద్దరూ, తనను వాళ్ళ ఇంటికి రమ్మని అడగటంలో వున్న రహస్యం ఏమిటో ఆమె గ్రహించింది. భర్త యిచ్చిపోయిన ధనంకోసం, వాళ్ళు తనమీద లేని ప్రేమ నటిస్తున్నారు. అందుకని ఆమె కొడుకు లిద్దరితో కొంచెంసేపు మంచిగా మాట్లాడి, 'మీరిద్దరూ పెద్దవాళ్ళు, మీ బ్రతుకు మీరు బ్రతగ్గలరు. పింగళుడు అలా కాదు. వాడికింకా పసితనమే వదలలేదు. కనుక, నేను వాడిదగ్గరే వుండటం, అన్నివిధాలా బావుంటుంది," అన్నది.

దానికి పెద్దవాళ్ళిద్దరూ మండిపడి, "సరే, నువ్వు వాడిదగ్గిరే వుండు, మా అభ్యంతరం ఏమీ లేదు. కాని, మా తండ్రి నీపేర పెట్టిపోయిన ఆస్తిలో మా భాగం మాకు యిచ్చెయ్యి," అన్నారు.

"నే బ్రతికుండగానే, దాంట్లో మీకు భాగం ఎలా వస్తుంది?" అన్నది తల్లి.

"ఆ భాగం యిప్పుడు రాకపోతే, తరవాత మాకు దక్కుతుందన్న ఆశలేదు. ఆ డబ్బు కాస్తా కాజేసి, పింగళుడు నిన్ను అయిపూ అజా లేకుండా చేస్తే, మేము ఏం కావాలి?" అన్నారు పెద్దకొడుకులు.

అన్నలు యీ విధంగా మాట్లాడటం, పింగళుడికి చాలా అవమానకరంగా తోచింది. అతడు తల్లిదగ్గరకు వెళ్ళి, "అమ్మా, నువ్వు కావాలంటే, అన్నయ్యల దగ్గిరికే వెళ్ళు. నీ ఆస్తిలో ఒక్క దమ్మిడీకూడా నా కవసరం లేదు," అన్నాడు.

తల్లి అందుకు అంగీకరించలేదు. దానితో పెద్దకొడుకు లిద్దరూ పట్టరాని కోపంతో తల్లిని కర్రలతో మోదసాగారు. చిన్నవాడైన పింగళుడు అడ్డుపడ్డాడు. దానితో వాళ్ళు మరింత రెచ్చిపోయి, వాణ్ని చావ చితకబాదారు.









తల్లి ఎట్లాగో యింటినుంచి బయటపడి, యిరుగు పొరుగువాళ్లను పిలుచుకు వచ్చింది. వాళ్లు పెద్దకొడుకు లిద్దర్నీ గట్టిగా చివాట్లుపెట్టారు. దానితో జీవదత్తుడూ, లకీదత్తుడూ యింటినుంచి బయటికి పోతూ, "మేం లోకజ్ఞానం లేని అర్భకులంకాదు. మీ యిద్దర్నీ న్యాయస్థానానికి పిలిపిస్తాం. ఆస్తి ఎక్కడికి పోతుందో చూస్తాం," అన్నారు.

వారం తిరక్కుండానే, జీవదత్తుడూ, లకీదత్తుడూ అన్నంత పనీ చేశారు. వాళ్లు న్యాయస్థానంలో తల్లిమీదా, తమ్ముడిమీదా వ్యాజ్యం వేశారు. దానితో తల్లికీ, పింగళుడికీ న్యాయస్థానం నుంచి పిలుపు వచ్చింది. వాళ్లు న్యాయస్థానానికి వెళ్లారు. న్యాయాధిపతి పెద్దవాళ్లిద్దరిదగ్గిరా లంచం తీసుకుని వున్నవాడవటంచేత, తల్లికీ పింగళుడికీ వ్యతిరేకంగా తీర్పు చెప్పాడు.

పింగళుడు తనకూ, తల్లికీ అన్యాయం జరిగిందని పై న్యాయస్థానానికి అర్జీపెట్టుకున్నాడు. నెలరోజులు న్యాయస్థానం చుట్టూ తిప్పి, న్యాయాధిపతి చివరకు తల్లికీ, పింగళుడికీ అనుకూలంగా తీర్పు యిచ్చాడు.

తీర్పు తమకు అనుకూలంగా జరిగినా, మధ్యవర్తులమంటూ వచ్చి రాజీ రాయబారాలు జరిపిన వారికీ, న్యాయవాదులకూ పెద్ద మొత్తాలు యివ్వటంద్వారా పింగళుడూ, తల్లీ ఆస్తిఅంతా పోగొట్టుకున్నారు. జీవదత్తుడూ, లకీదత్తుడూ కూడా కటిక దరిద్రులై పోయారు. వాళ్లిద్దరూ యిక పొట్ట గడిచే మార్గం లేక, వీధులవెంట తిరుగుతూ బిచ్చం ఎత్తసాగారు.

పింగళుడు తమకు కలిగిన దురదృష్టానికి చింతించలేదు. అతను తల్లికి ధైర్యం చెప్పి, ఒక వల తీసుకుని చేపలు పట్టేందుకు నదికి వెళ్లాడు. చేపలుపట్టే వృత్తికి కొత్తవాడయినా, పింగళుడు ఆ సాయంత్రం వరకూ నదిలో వలవేసి చాలా చేపలు పట్టగలిగాడు. వాటిని బజారులో అమ్మి,





ఆ డబ్బుతో ఒక దుకాణదారు దగ్గిర, ఇంటికి కావలసిన సంబారాలన్నీ కొన్నాడు.

ఈ విధంగా పింగళుడు పగలల్లా కష్టించి చేపలుపట్టి, అవి అమ్మగా వచ్చిన డబ్బుతో సుఖంగా కాలం గడుపుతున్నాడు. కొద్ది రోజులకే యీ సంగతి అన్నలిద్దరికీ తెలిసింది. వాళ్ళు పింగళుడు నదికి వెళ్ళిన సమయంలో బావురుమని ఏడుస్తూ తల్లి దగ్గిరకు వచ్చి ఆకలితో మలమల మాడి పోతున్నామని మొరపెట్టుకున్నారు. లోగడ తనకు ఎంత అన్యాయం చేసివున్నా, పుత్ర ప్రేమ కొందికి, అవన్నీ మరిచిపోయి, తల్లి వాళ్ళిద్దరకూ చక్కని భోజనం పెట్టింది.

జీవదత్తుడూ, లకదత్తుడూ తల్లికి కృతజ్ఞత చెప్పుకుని, గతంలో తాము చేసిన అన్యాయాలకు పశ్చాత్తాపం వెలిబుచ్చారు. తల్లికూడా వాళ్ళమీద జాలి తలిచి, తమ్ముడు లేని సమయంలో రోజూ వచ్చి, అన్నం తిని పోవలసిందని వాళ్ళకు చెప్పింది. పనిపాట్లు చేసుకుని గౌరవంగా బ్రతకటానికి వళ్ళు వంగని పెద్దవాళ్ళిద్దరూ, యిందుకు చాలా సంతోషించి, కేరింతలు కొడుతూ వీధిలోకి వెళ్ళిపోయారు.

పింగళుడికి యివేమీ తెలియవు. అతడు ప్రతి దినం సూర్యోదయంతోపాటే లేచి వల తీసుకొని నదికి పోతూండేవాడు. ఒక





నాడు, ఎందుకనో అతడు ఎంతసేపు నదిలో వలవేసినా ఒక్క చేపకూడా పడింది కాదు. ఏమో యీ దురదృష్టం అనుకుంటూ, అతడు సూర్యాస్తమయం వరకూ ప్రయత్నించి, ఏమీ దొరకక, వల భుజాన వేసుకుని దిగాలుపడి యింటిమార్గం పట్టాడు. దారిలో ప్రతిదినం అతడు సామాను కొనే దుకాణంవాడు, ఆ రోజు పింగళుడు దుకాణం దగ్గరకు రాకుండా పోవటం చూచి, అతడిని కేకవేశాడు.

పింగళుడు, దుకాణంవాడి దగ్గరకు పోయి, ఆ రోజు తనకు నదిలో ఒక్కగానొక్క చేప అయినా దొరకలేదని, అందువల్ల తనదగ్గిర డబ్బు ఏమీలేదని చెప్పాడు. ఆ మాటలు వింటూనే దుకాణంవాడు నవ్వి, "నీకు అవసరమైన సంబారాలన్నీ రోజూ యిక్కడే కొనుక్కు పోతూండేవాడివి గదా! అలాంటప్పుడు, ఈ రోజు డబ్బు లేకపోతే మాత్రం ఏం పోయింది? అవసరమైన సరుకులు తీసుకుపో. రేపు డబ్బిద్దువుగాని," అన్నాడు.

పింగళుడు, దుకాణంవాడి దయకు కృతజ్ఞత చెప్పి, కావలసిన సామానులు తీసుకుని, పుత్సాహంగా బయలుదేరి, రోజు కన్న కొంచెం ముందుగా యిల్లుచేరాడు. ఆ సమయంలో, పింగళుడి అన్న లిద్దరూ,





యింట్లో సుఖంగా భోజనంచేస్తూ, తల్లితో కబుర్లాడుతున్నారు. హఠాత్తుగా పింగళుడు లోపలకు వచ్చేసరికి, వాళ్లిద్దరూ గడబిడ పడి, సిగ్గుతో తలవంచుకుని పారిపోజూచారు.

పింగళుడు అన్న లిద్దర్నీ ప్రేమతో కౌగలించుకుని, "అన్నల్లారా! మీరు వున్నంతలో హాయిగా భుజించండి. జరిగిపోయిందేదో జరిగిపోయింది. మనం ఒక్క తండ్రి సంతానంగదా!" అన్నాడు.

తమ్ముడు యిలా అనేసరికి, పెద్దవాళ్లిద్దరికీ ఎక్కడలేని ఆనందం కలిగింది. వాళ్లు పింగళుడిని మెచ్చుకుని, "నువ్వు యింత మంచివాడివని మాకుతెలియదు, తెలిస్తే, అనవసరంగా నీమీద వ్యాజ్యంవేసి, మా ఆస్తితోపాటు నీదికూడా పోగొట్టేవాళ్లం కాదు," అన్నారు, విచారిస్తూన్నట్టు. కొడుకులు, విరోధభావం మాని, ఒకటైనందుకు తల్లి సంతోషించింది.

పింగళుడు ఆ మరసటి రోజునకూడా మామూలు వేళకే నదికి వెళ్ళాడు. ఆ రోజునకూడా సాయంత్రం వరకూ ప్రయత్నించినా వలలో ఒక్క చేపకూడా పడలేదు. అతడు తన దురదృష్టాన్ని నిందించుకుంటూ, యింటికి పోతూండగా, దుకాణంవాడు మళ్లీ పిలిచి, సంగతి తెలుసుకుని, అప్పుగా మరికొంత సామాను యిచ్చాడు.





ఈ విధంగా వరసగా పదిరోజులు నదిలో చేపలు దొరకకపోయేసరికి, పింగళుడు విసిగి, పదకొండవరోజున, అక్కడికి క్రోసు దూరంలో వున్న చిలకసరస్సుకు చేపల కోసం వెళ్ళాడు.

చిలకసరస్సులో అతడు వలవేసి ఒడ్డున కూర్చునేంతలో, మైదానంమీద ఒక గుర్రపు రౌతు వస్తూన్న సూచనగా దుమ్ములేచింది. పింగళుడు ఆ వచ్చేవాడు ఎవరైవుంటాడా అనుకునేంతలో, రౌతు గుర్రాన్ని దూకిస్తూ, పింగళుడు వున్నచోటుకువచ్చి, "పింగళా! నువ్వు నాకో సాయం చేసిపెట్టాలి!" అంటూ గుర్రం దిగాడు.

తను ముక్కూ మొహం ఎరగనివాడు, సరాసరి దగ్గరకు వచ్చి, పేరుపెట్టి పిలిచేసరికి పింగళుడికి చాలా ఆశ్చర్యంకలిగింది. అతడు ఆ వచ్చినవాడికేసి అనుమానంగా చూస్తూ, "నాపేరు మీకెలా తెలుసు? మీకు కావలసిన సాయం ఏమిటి?" అన్నాడు.

ఆ ప్రశ్నలకు, ఆ కొత్తవాడు నవ్వి, "నీ పేరేమిటో, నువ్వేసమయంలో యీ చిలక సరస్సుదగ్గిర చేపలు పడుతూవుంటావో—అదంతా మా గురువుగారు, నువ్వు పుట్టక ముందే నాకు చెప్పారు. అది నలభై ఏళ్ల కిందటిమాట! నే నడిగిన సాయం చెయ్య గలవా?" అన్నాడు.





"అదేదో చెప్పండి. ఇంతకూ మీ పేరేమిటో చెప్పారు కాదు!" అన్నాడు పింగళుడు వినయంగా.

"నాపేరు మండనుడు. పోతే, నువ్వు చేయవలసిన సాయం ఏమంత కష్టమైంది కాదు. నా చేతులు రెండూ తాడుతో వెనక కట్టివేసి, నన్ను ఎత్తుకుపోయి సరస్సులో పడవెయ్యి. కొద్దిసేపు తరవాత నా తల, ముందు నీటిపైన కనబడితే, వల వేసి నన్ను బయటికి లాగు. అలాకాక, కాళ్ళుగాని ముందు తేలితే, నువ్వు యీ గుర్రాన్ని పట్టణంలోకి తీసుకుపోయి, కాంచనమిత్రుడు అనే వర్తకుడికి ఒప్పచెప్పావంటే, అతడు నీకు నూరు మొహరీలు యిస్తాడు," అన్నాడు.

పింగళుడు, మండనుడు చెప్పినట్టు చేయటానికి అంగీకరించాడు. మండనుడు, గుర్రపు జీనుకు వేలాడుతున్న ఒక తాడు తెచ్చి, పింగళుడికి యిచ్చాడు. పింగళుడు, మండనుడి చేతులను వెనక్కు విరిచికట్టి, అతన్ని భుజాన వేసుకుని సరస్సు ఒడ్డునే నిలబడి, అతన్ని సరస్సులోకి విసిరివేశాడు.

ఒకటి రెండు నిమిషాల కాలం సరస్సులో అలలు లేచి సద్దుమణిగిన తరవాత, మండనుడి కాళ్ళు ముందుగా నీటిపైకి తేలినై. "పాపం, చచ్చిపోయాడు!" అనుకుంటూ, పింగళుడు, మండనుడి గుర్రాన్ని తీసుకుని పట్టణంలోకి వెళ్ళాడు. అక్కడ అతడికి గొప్ప వర్తకుడైన కాంచనమిత్రుడి దుకాణం తెలుసుకోవటం ఏమీ కష్టంకాలేదు. కాంచనమిత్రుడు, పింగళుడినీ, అతడి వెంటవున్న గుర్రాన్నీ చూస్తూనే, "దురాశ దుఃఖంచేటు!" అంటూ గొణిగి, పెట్టెలో నుంచి, నూరు మొహరీలు తీసి పింగళుడికి యిస్తూ, "అబ్బాయ్, యీ సంగతి రహస్యంగా వుంచు. అది నీకు చాలా క్షేమంకూడా!" అన్నాడు.

(ఇంకా వుంది)








## 2

[అవంతీనగరంలో ముగ్గురు అన్నదమ్ములుండేవారు. చిన్నవాడైన పింగళుడు చేపలు పట్టేందుకు చిలకసరస్సుకు వెళ్లాడు. అక్కడికి మందనుడు అన్నవాడొకడువచ్చి, తనను సరస్సులో కత్తి పడవేయవలసిందిగా కోరాడు. పింగళుడు అలాగేచేసి, పట్టణానికివెళ్లి కాంచనమిత్రుడు అనే వర్తకుడిదగ్గిర నూరుమొహరీలు పుచ్చుకున్నాడు. తరవాత—]

కాంచనమిత్రు డిచ్చిన నూరు మొహరీలు తీసుకుని, పరమానందంతో పింగళుడు దుకాణంవాడి దగ్గిరకు వెళ్ళాడు. దుకాణంవాడు, పింగళుణ్ణి చూస్తూనే అతడు ఉత్సాహంగా వున్నట్టు గ్రహించి, "ఏం పింగళా, ఇవ్వాళ అదృష్టం తిరిగినట్టుంది! చాలా చేపలు పట్టినట్టున్నావే?" అన్నాడు.

పింగళుడికి అప్పటి ఉత్సాహంలో తను నూరు మొహరీలు ఏ విధంగా సంపాదించిందీ దుకాణంవాడితో చెప్పాలనిపించింది. కాని, వెంటనే అతడికి కాంచనమిత్రుడు చేసిన హెచ్చరిక గుర్తుకువచ్చి, "పదిరోజుల తరవాత, ఇవ్వాళే వలలో తిరిగి చేపలు పడినై. ఈ గడిచిన పదిరోజులూ ఏదో దురదృష్టదేవత నన్ను వెన్నాడినట్టుంది," అన్నాడు విచారంగా.

తరవాత పింగళుడు, ఆనాటివరకూ దుకాణంవాడికి యివ్వవలసిన డబ్బంతా లెక్కచూసి ఇచ్చి, తనకు కావలసిన సామానులు తీసుకుని ఇంటికి వెళ్ళాడు. అతడు ఇంటికి వెళ్ళేసరికి అన్నలిద్దరూ గోడనానుకుని కునికిపాట్లు పడుతూ కని







పించారు. తల్లి ఎదురువచ్చింది. పింగళుడు తను దుకాణంనుంచి తెచ్చిన సామానులు తల్లికి ఇచ్చి, "ఇవ్వాళ అదృష్టం కలిసివచ్చింది. త్వరగా వంటపనులు పూర్తిచెయ్యి," అన్నాడు.

కొద్దిసేపటిలోనే తల్లి భోజనం తయారు చేసింది. పింగళుడితోపాటు తీపదర్తుతూ, లకదర్తుతూ కూడా త్వరత్వరగా భోజనం చేసి, ఉల్లాసంగా బయటికి వెళ్ళిపోయారు. అన్నలు అటు వెళ్ళగానే పింగళుడు జేబులోంచి మొహరీలుతీసి, తల్లికి చూపించాడు.

తల్లి మొహరీలు చూస్తూనే ఆశ్చర్యపడి, "ఇంత డబ్బు ఎలా సంపాయించావ్?" అని అడిగింది. పింగళుడు ఏమీ దాచకుండా జరిగినదంతా తల్లికి చెప్పాడు.

ఆమె అంతా విని, "పింగళా! నువ్వు చేసిన పని మరెవరికైనా తెలిస్తే చాలా ప్రమాదం కలుగుతుంది. ఇకమీదట నువ్వు చిలకసరస్సు ప్రాంతాలకు వెళ్ళకు," అన్నది భయపడుతూ.

తల్లి భయం చూసి, పింగళుడు నవ్వి, "నేను చేసింది నేరం ఎలా అవుతుంది? ఆ వచ్చినవాడు కావాలని కోరి చేతులు విరిచికట్టించుకుని, సరస్సులో మునిగి చచ్చాడు. అయినా ఈ సంగతి మరెవరికీ తెలియకుండా దాయవచ్చు," అన్నాడు.

"నీ అన్నల సంగతి తెలుసుగదా? వాళ్లు మంచివాళ్లు కాదు. వాళ్ళ చెవిని పడకుండా ఉంచు," అన్నది తల్లి.

పదిరోజుల తరవాత పింగళుడికి, ఆ రాత్రి హాయిగా నిద్రపట్టింది. అతడు మరునాడు తెల్లవారుతూనే వల తీసుకుని, చిలకసరస్సుకు వెళ్ళాడు. అతడు సరస్సులో మిట్టమధ్యాహ్నంవరకు వల వేసినా, ఒక్క చేప అయినా పడలేదు. అతడు నిరుత్సాహపడి, ఇక ఇంటికి వెళదామా అనుకునేంతలో, అల్లంత దూరాన వేగంగా వస్తున్న గుర్రపు రౌతు కనిపించాడు.









పింగళుడు అదిరిపడ్డాడు. గుర్రంమీద వస్తున్న వ్యక్తి అచ్చుగా నిన్న వచ్చిన మండనుడిలాగానే ఉన్నాడు. సరస్సులో మునిగిపోయినవాడు పిశాచమై రావటంలేదుగదా? అనిపించింది పింగళుడికి. అంతలో గుర్రం అతన్ని సమీపించింది. రౌతు నవ్వుతూ గుర్రంమీంచి దిగి, "పింగళా, నీనుంచి నాకో సహాయం కావాలి!" అన్నాడు.

పింగళుడు, భయపడుతూనే అతడికేసి చూశాడు. ఈ వచ్చినవాడు పోలికకు మాత్రం మండనుడిలాగానే ఉన్నాడు. కాని వయసులో మాత్రం అతడికన్న కొంచెం చిన్నవాడులా కనిపించాడు. గుర్రం కూడా మరో రంగుది. దానితో పింగళుడికి ఈ వచ్చింది పిశాచం కాదని తెలిసి, కొంత ధైర్యంకలిగింది.

"నా పేరు మీకెలా తెలుసు? నానుంచి మీకు కావలిసిన సహాయం ఏమిటి?" అని అడిగాడు పింగళుడు.

ఈ ప్రశ్న వింటూనే రౌతు పెద్దగా నవ్వి, "పింగళా! నీ పేరు నాకెలా తెలుసో, నే వచ్చిన పనేమిటో నీకు తెలియుండికాదు. నా పేరు అనురూపుడు. నీ సహాయం కోరిన మండనుడు నా సోదరుడే. నాకూ నీనుంచి అలాంటి సహాయమే కావాలి," అన్నాడు.

"మండనుడు మీ సోదరుడా? ఆయన ఎక్కడున్నాడు?" అని అడిగాడు పింగళుడు.

అనురూపుడు పొట్ట చెక్కలయ్యేలా నవ్వి, సరస్సు మధ్యకు చేయి చూపుతూ, "బహుశా, మండనుడు అక్కడ వుండి వుంటాడు. లేక యీ సరికి జలచరాలకు ఆహారమయినా అయివుండొచ్చు," అన్నాడు.

"అయితే, నిన్న ఇక్కడ జరిగిందేమిటో అంతా మీకు తెలుసునన్నమాట?" అని ప్రశ్నించాడు పింగళుడు.

"అవును. సర్వం నాకు తెలుసు. నీనుంచి నాకూ్కడా సహాయం కావాలి," అన్నాడు అనురూపుడు.







"చేస్తాను. కాని, నా సహాయానికి యీ సారి రెండు వందల మొహరీలు ఇవ్వవలసి వుంటుంది." అన్నాడు పింగళుడు.

అనురూపుడు పెద్దగా నవ్వి, పింగళుడి భుజం తడుతూ, "అవును, నువ్వు రెండు వందల మొహరీలు అడుగుతావేమో అని నాకు ముందే అనుమానం కలిగింది. అందుకే కాంచనమిత్రుడిదగ్గిర ఆ ఏర్పాటు చేసి వొచ్చాను. కాని నేను సరస్సునుంచి ప్రాణాలతో బయటపడనని నీ కెందుకు నమ్మకం కలగాలి?" అన్నాడు.

తరవాత పింగళుడు తాడు తీసుకుని అనురూపుడి చేతులు వెనక్కు విరిచికట్టి, అతన్ని భుజానవేసుకుని సరస్సు ఒడ్డుమీది నుంచి లోపలకు విసిరివేశాడు. అను రూపుడు సరస్సులో పడబోయే ముందు, "పింగళా, నా తల ముందు నీటిమీద తేలితే, వెంటనే వలవేసి బయటకి లాగు సుమా!" అంటూ కేకవేశాడు.

పింగళుడు సరస్సు ఒడ్డునే వల తీసు కుని సిద్ధంగా వున్నాడు. సరస్సులో కొంచెం సేపు అలలు లేచి తగ్గిపోయినై. ఒకటి, రెండు నిమిషాల తరవాత నీటిమీద చిన్న బుడగలు లేచి, అనురూపుడి కాళ్ళు ముందుగా పైకి తేలినై.

"చచ్చిపోయాడు, పాపం!" అనుకుని పింగళుడు అనురూపుడి గుర్రాన్ని ఎక్కి, వెనక్కు తిరిగి చూడకుండా పట్టణంలోకి వెళ్ళాడు. కాంచనమిత్రుడు అతన్ని అంత దూరాన చూస్తూనే, "దురాశ దుఃఖంచేటు" అంటూ బిగ్గరగా అరిచి, పింగళుడికి రెండు వందల మొహరీలు లెక్కపెట్టి ఇచ్చాడు.

"దురాశ ఎవరిది? నాదా? ఈ రెండు వందల మొహరీలకోసం నేనెంత శ్రమ చేస్తున్నానో మీకు తెలుసా?" అన్నాడు పింగళుడు, కాంచనమిత్రుడితో.

ఆ మాటలకు కాంచనమిత్రుడు అయి ష్టంగా తల వూపి, "దురాశ నీదికాదు, ఆ







చనిపోయిన వాళ్ళది. నువ్వు చేస్తున్న పని ఏమిటో బయటపడితే, నీకు కలగబోయే ప్రమాదం ఊహించటం ఏమంత కష్టం కాదు. నీలోనూ దురాశ తలచూపుతున్నది. నిన్న వంద మొహరీలు, ఇవ్వాళ రెండు వందల మొహరీలు!" అన్నాడు.

"రేపు మూడు వందల మొహరీలు! అంతకు తక్కువయితే, నేను ఎవరికీ చచ్చేందుకు సహాయం చెయ్యను," అంటూ పింగళుడు ఇంటికి బయలుదేరాడు.

ఆ రాత్రి పింగళుడు, తల్లికి తను తెచ్చిన రెండు వందల మొహరీలూ ఇచ్చాడు. తల్లి ఆ డబ్బు చూస్తూనే భయంతో వణికిపోయింది. "నాయనా! ఇకనైనా నువ్వు ఆ చిలకసరస్సు వైపుకు వెళ్లటం మాను. నా కెందుకనో భయంగా వుంది," అన్నది.

"భయం ఏమీలేదు. నువ్వు ఈ సంగతి మాత్రం ఎవరికీ తెలియకుండా ఉంచు," అన్నాడు పింగళుడు.

ఆ రాత్రి పింగళుడికి సరిగా నిద్రపట్ట లేదు. తెలతెలవారుతూండగానే వల భుజాన వేసుకుని చిలకసరస్సుకు వెళ్ళాడు. అతడు సరస్సులో వలవేసినా దృష్టిమాత్రం మైదానంమీదే ఉంది.



సరిగా మిట్టమధ్యాహ్నంవేళకు మైదానం మీద దుమ్మురేపుతూ ఒక రౌతు రావటం పింగళుడికి కనిపించింది. అతడు చూస్తూన్నంతలో రౌతు అక్కడికి వచ్చి, "పింగళా! నా పేరు పద్మపాదుడు. నాకో సహాయం చేసిపెట్టాలి!" అన్నాడు.

"ఓ, సహాయానికేం, చేస్తాను. ఈ సరస్సులో పడి ఆత్మహత్య చేసుకోవాలనుకున్న ప్రతి ఒక్కరికీ సహాయపడటమే నా పని. మూడు వందల మొహరీలు ఇవ్వవలసి వుంటుంది," అన్నాడు.

"దానికేం, నేను చచ్చిపోతే మూడు వందల మొహరీలూ కాంచనమిత్రుడు

"ఇస్తాడు," అంటూ పద్మపాదుడు నవ్వి, గుర్రానికి వేలాడుతున్న తాడు విప్పి పింగళుడి చేతికి అందించాడు.

పింగళుడు తాడు తీసుకుని పద్మపాదుడి చేతులు వెనక్కు విరిచికట్టి. అతణ్ణి భుజాన వేసుకుని, సరస్సు ఒడ్డుకు మోసుకుపోయి, లోపలకు విసిరివేస్తూనే, "పాపం, చచ్చిపోయాడు!" అంటూ వెనుదిరిగి గుర్రం దగ్గిరకు వెళ్ళాడు.

పింగళుడు సరస్సుకేసి చూడనైనా చూడకుండా గుర్రాన్ని ఎక్కి బయలుదేరబోయేంతలో సరస్సులోనుంచి పద్మపాదుడి కేకలు వినిపించినై. "పింగళా, నన్ను త్వరగా వలవేసి బయటికి లాగు, నీకు పుణ్యం ఉంటుంది!" అంటూ అతడు బిగ్గరగా అరవసాగాడు.

పింగళుడు గుర్రంమీంచి ఒక్క దూకు దూకి, వలవేసి, పద్మపాదుణ్ణి నీటిలోంచి ఒడ్డుకు లాగాడు. పద్మపాదుడు రొప్పుతూ నీటిలోంచి బయటికి వచ్చాడు. అతడి చేతిలో రెండు మొసలిపిల్లలు వున్నాయి. పింగళుడు వాటికేసి ఆశ్చర్యంగా చూసి, ప్రశ్నించబోయేంతలో పద్మపాదుడు గుర్రం దగ్గిరకు వెళ్ళి, దానిమీద ఉన్న సంచీలోంచి ఒక గాజుబుడ్డి తీసి, దానిలో మొసలిపిల్లలను పడవేసి మూతపెట్టాడు.





పింగళుడు పద్మపాదుడికేసి, ఆ మొసలి పిల్లలకేసి ఓమారు అనుమానంగా చూసి, "పద్మపాదా, నువ్వు చాలా అదృష్ట వంతుడివి బ్రతికి బయటపడ్డావ్. సరే, నా మూడు వందల మొహరీల మాటే మిటి?" అన్నాడు.

పద్మపాదుడు ఆప్యాయంగా పింగళుడిని కౌగలించుకుని, "పింగళా! నీకు ఆ మూడు వందల మొహరీలేమిటి...లక్ష... కోటి మొహరీలు ఇస్తాను. ప్రపంచంలో అందరికన్న ధనవంతుణ్ణి చేస్తాను. నువ్వు మాత్రం నావెంట భల్లూకపర్వతాల దగ్గిరకు రావలసి వుంటుంది," అన్నాడు.

"భల్లూకపర్వతాలా? అబ్బో, ఆ పేరం టేనే నాకు భయం. మా అమ్మ వాటిని గురించి చాలా సంగతులు చెప్పింది. ఆ కొండలు పిశాచాలకు నిలయమని విన్నాను," అన్నాడు పింగళుడు.

"ఆ పిశాచాలూ, దయ్యాలూ నన్నేమీ చెయ్యలేవు. ఈ ప్రపంచంలో ముగ్గురే ముగ్గురు గొప్ప మాంత్రికులున్నారు. వాళ్లల్లో ఇద్దరిని స్వయంగా నువ్వే ఈ సరస్సుకు బలియిచ్చావు. ఇక మిగిలినవాడిని నేను," అన్నాడు పద్మపాదుడు.

"నాకేమీ అర్థం కాలేదు," అన్నాడు పింగళుడు ఆశ్చర్యంగా.







"అలాఅయితే, నీ సహాయం కావలసిన వాణ్ణిగనక సంగతంతా చెపుతాను విను," అంటూ పద్మపాదుడు యిలా చెప్పాడు।

మేం ముగ్గురు అన్నదమ్ములం. మా తండ్రి గొప్ప మాంత్రికుడు. ఆయన తన మంత్రశక్తివల్ల అనేకులకు మేలూ, కొందరికి కీడూ కూడా చేశాడు. ఆయన చిన్నప్పటినుంచీ మా అన్నదమ్ముల్లో ఎవరిమీదా పక్షపాతం చూపకుండా, అందరికీ మంత్రవిద్యలో ప్రవేశం కల్పించాడు. ఆయన పెద్దవాడయి మరణించేముందు ఆస్తిపాస్తులన్నీ మాకు సమానంగా పంచి యిచ్చాడు. కాని ఆయన తనకు తెలిసిన మంత్రవిద్యసంతా రాసివుంచిన పుస్తకాన్ని మాత్రం మాకెవరికీ ఇవ్వకుండా, 'మీలో ఎవరు శక్తిమంతులైతే, వారికి అది లభిస్తుంది!' అని చెప్పి మరణించాడు.

ఆయన మరణించిన మరుక్షణంనుంచీ మా అన్నదమ్ముల్లో కలతలు బయలుదేరినై. మాలో ప్రతి ఒక్కరికీ ఆ పుస్తకాన్ని తమదిగా చేసుకోవాలనే కోర్కె పుట్టింది. ఒకరిమీద ఒకరం, మంత్రశక్తి ఉపయోగించుకోవటానికి తయారయ్యాం.

అన్నదమ్ములం ఒకర్ని ఒకరం నాశనం చేసుకునేటందుకు సిద్ధమౌతున్న దశలో మా తండ్రికి మంత్రవిద్య నేర్పిన గురువు మాయింటికి వచ్చాడు. అతడు మా పోట్లాట చూచి, చాలా ఖేదపడ్డాడు. ముగ్గుర్నీ ఒక చోట కూర్చోపెట్టి, 'మీతండ్రి విడిచిపోయిన ఆ పుస్తకాన్నిగురించి, మీకేమీ తెలియదు. అందుకే తగవులాడుకుంటున్నారు. మీలో ఎవరు శక్తిమంతులైతే, వారికి ఆ పుస్తకం లభిస్తుందని మీతండ్రి చెప్పాడుగదా? కనుక, ఆ పుస్తకంలో వున్న మంత్రశక్తులు మీ అధీనం కావాలంటే, ముందుగా మీరు సాధించవలసింది చాలావుంది,' అన్నాడు. అదేమిటో చెప్పమని ఆయన్ని కోరాం. ఆయన యిలాచెప్పాడు। (ఇంకావుంది)








# 3

[పింగళుడి సాయంవల్ల, పద్మపాదుడు సరస్సులోంచి, రెండు మొసలి పిల్లలను పట్టుకుని బయటికి వచ్చాడు. తరవాత పింగళుడికి తను ఎవరైందీ చెప్పి, భల్లూకపర్వతాల దగ్గిరకు తనతో రావలసిందిగా అతణ్ణి అడిగాడు. తన తండ్రి గురువైన వృద్ధుడొకడు, మహామాయుడనే మంత్రవేత్తను గురించి చెప్పిన వృత్తాంతం పింగళుడికి చెప్పసాగాడు.]

భల్లూక పర్వతలోయలో ప్రవహించే ఒక నది గర్భాన, ఒక పాడుపడిన దేవళం వుంది. ఆ దేవళంలో మహామాయుడనే గొప్ప మాంత్రికుడు సమాధి అయాడు. అతడు సమాధి అయినచోట ముఖ్యమైన వస్తువులు మూడు వున్నై. ఒకటి, అతడి వేలికి వున్న వుంగరం! దాన్ని ధరించిన వాడికి, భూగర్భంలో వున్న నిధి నిక్షేపాలన్నీ కనబడతై. రెండు, వజ్రాలు తాపిన పిడిగల కత్తి! దానినుంచి వెలువడే అగ్నికణాలు యెటువంటి శత్రువునైనా, నాశనం చేయ గలవు. మూడు, బంగారుతో చేయబడిన భూగోళం! ఆ భూగోళాన్ని సంపాయించిన వాడు, దాన్ని గుండ్రంగా తిప్పి, తను ఏదేశానికి చక్రవర్తి కావాలని కోరుకున్నా, మరుక్షణం ఆ కోరిక నెరవేరుతుంది.

కాని, మహామాయుడి నుంచి వీటిని సంపాయించాలంటే, ముందుగా చిలకసరస్సులో మొసళ్లరూపంలో వున్న అతడి శిష్యులను చేజిక్కించుకోవాలి. ఇందుకు, పింగళుడనే ఒక బాలరి సాయం అవసరమవుతుంది. తరవాత అతడి సాయంవల్లనే,







మహామాయుడినుంచి వుంగరం, కత్తి, భూగోళంకూడా సాధించవచ్చు. ఆ మూడు వస్తువులనూ సాధించినవారికి మాత్రమే మీ తండ్రి విడిచిపోయిన మంత్ర గ్రంథం వుపయోగపడుతుంది.

"మా తండ్రిగారి గురువు, యింతవరకూ చెప్పి, మా ముగ్గురి ముఖాలకేసి పరీక్షగా చూచాడు. చిలకసరస్సులో మొసళ్ల రూపం ధరించివున్న మహామాయుడి శిష్యులను ముందు చేజిక్కించుకోవాలనేసరికే నాకు, ఒళ్ళు జలదరించింది. మహామంత్రవేత్త అయిన మహామాయుడి శిష్యులతో, అందులోనూ వాళ్ళు మొసళ్ల రూపంలో



నీటి అడుగున వుండగా, పోరాడటం ఎలా సాధ్యమవుతుంది?

"నా తక్కిన సోదరులుకూడా, బహుశా నాలాగే వెలవెలపోయి వుంటారు. గురువు మా ముగ్గురినీ వుద్దేశించినట్టు బిగ్గరగా నవ్వి, 'మహామాయుడి శిష్యులను జయించటంలో, నే చెప్పిన జాలరి వెంగళుడు, మీకు చాలా సాయం చేయగలడు. కాని, యీ ప్రయత్నంలో మీరు ప్రాణాలు పోగొట్టుకున్నా పోగొట్టుకోవచ్చు. ముందుగానే హెచ్చరిస్తున్నాను," అన్నాడు.

"మా అన్నదమ్ముల్లో ముందుగా మండసుడు జవాబిచ్చాడు; 'నేను, యిందుకు సిద్ధం. నా తండ్రి వదిలిపోయిన మంత్ర గ్రంథంమీద వున్నతీపి, నాకు నా ప్రాణాల మీదకూడా లేదు," అన్నాడు.

"అతనలా మాట్లాడేసరికి, నాకూ, అనురూపుడికీ కూడా ధైర్యం కలిగింది. మేమూ మహామాయుడి శిష్యులతో పోరాడటానికి సిద్ధమే అన్నాం. అప్పుడు గురువు, మాకు చిలకసరస్సుకు మార్గం చెప్పి, నీచేత కాళ్లూ చేతులూ కట్టించుకుని, సరస్సులో పడిం తరవాత చేయవలసినదంతా వివరించాడు."

"అయితే, నేను చేయవలసిన సాయమేదో చేశాను. ఇప్పుడు, మీవెంట నేను





భల్లాకపర్వతాలకు రావలసిన అవసర మేమిటి?" అని అడిగాడు పింగళుడు.

పద్మపాదుడు ఆ ప్రశ్న విని, కొంచెం సేపు ఆలోచించి, తరవాత పింగళుడి భుజంమీద ఆప్యాయంగా చేయివేస్తూ, "పింగళా! నువ్వు, నన్ను గురించి ఏదో భయపడుతూన్నట్టుంది. నానుంచి నీకు ఎలాంటి హానీ జరగకపోగా, నీకు చాలా గొప్ప మేలు జరుగుతుంది. మహామాయుడు సమాధి అయివున్న పాడుదేవళంలో ప్రవేశించవలసినవాడివి నువ్వు! ఆ పని మరొకరివల్ల కాదు," అన్నాడు.

"నాకు ఎలాంటి హానీ జరగదని మీరు ప్రమాణించేసి హామీయిస్తారా?" అని అడిగాడు పింగళుడు.

పద్మపాదుడు ప్రమాణించేశాడు. పింగళుడికి ఆ క్షణంలో తల్లి గుర్తుకొచ్చింది. "నేను భల్లాకపర్వతాలనుంచి ఎన్నాళ్లకు తిరిగి రాగలను?" అన్నాడు పింగళుడు.

"రెండు నెలలు; అంతకంటె ఎక్కువ వుండదు. కాని, నువ్వు అక్కడినుంచి తిరిగి యింటికి వెళ్లేప్పుడు, యిలా వుండవు. నిన్ను యీ ప్రపంచంలో అందరికన్నా గొప్ప ధనికుణ్ణి చేస్తానని మాటయిచ్చానుగదా!" అన్నాడు పద్మపాదుడు.

"అప్పటి మాట అలా వుంచండి. ప్రస్తుతానికి నేను, చిల్లిగవ్వకూడా చేతలేని అతి పేదవాణ్ణి. నేను యింటలేని రెండు నెలలూ, నా తల్లీ సోదరులూ బ్రతకటం ఎలా?" అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు గుర్రానికి వేలాడుతున్న ఒక సంచీలోంచి వెయ్యి మొహరీలు తీసి పింగళుడికి యిస్తూ, "ఈ డబ్బు నీ తల్లికి యిచ్చిరా. నీ క్షేమాన్నిగురించి, ఆమె భయపడవలసిందేమీ లేదు. రేపు, యీ వేళప్పుడు, నన్ను యిక్కడే కలుసుకో!" అన్నాడు.

పింగళుడు, పద్మపాదుడిచ్చిన డబ్బు తీసుకుని అమితానందంతో యింటికి





వెళ్లాడు. అతడు వెళ్లేసరికి, యింటిలో అన్నలు లేరు. తల్లి ఒక్కతే అతడికోసరం ఎదురు చూస్తున్నది. పింగళుడు, తను తెచ్చిన వెయ్యి మొహరీలు తల్లిముందు పోశాడు. ఆమె గజగజలాడింది.

"పింగళా! యింత డబ్బు ఎక్కడిది? నాకు భయంగా వుంది," అన్నది తల్లి.

పింగళుడు, జరిగిందంతా తల్లికి చెప్పాడు. తను రెండు నెలలలో క్షేమంగా యింటికి తిరిగి రాగలనని, భయపడవలసిన అవసరంలేదనీ ధైర్యం కలిగించాడు.

"మాంత్రికుల మంచితనంలో నాకు నమ్మకం లేదు. యీ పద్మపాదుడు అందరి లాంటివాడు కాదని చెపుతున్నావు. దేవుడి దయవల్ల నీకు ఏ కష్టాలు కలగకుండా, భల్లూకపర్వతాలనుంచి సుఖంగా యింటికి తిరిగి రావాలని, ముక్కోటి దేవతలకూ మొక్కుకుంటున్నాను," అన్నది తల్లి.

మరునాడు పద్మపాదుడు చెప్పిన వేళకు, పింగళుడు చిలకసరస్సుదగ్గిరకు వెళ్లాడు. సరస్సు ఒడ్డున, పద్మపాదుడు ఒంటరిగా కూర్చునివున్నాడు. పక్కన ఒక సంచీ తప్ప, గుర్రంగాని మరే వాహనంగాని లేదు.

పింగళుడు, అతణ్ణి సమీపిస్తూనే "పద్మపాదా! మన ప్రయాణం కాలినడకనేనా?" అని అడిగాడు.





"కాలినడకనా? అది అసంభవం. భల్లూకపర్వతాలు చేరాలంటే, మనం రెండు మూడు వందల మైళ్లు ప్రయాణం చేయవలసి వుంటుంది. ఆ ప్రయాణానికి మామూలు గుర్రాలు పనికిరావు. ఇక రెండు రోజుల్లో ఒక పర్వదినం వస్తుంది. ఆ రోజుకు మనం భల్లూకపర్వతాల దగ్గిర వుండాలి. ఇవిగో మన వాహనాలు!" అంటూ పద్మపాదుడు, చిటికెడు మన్ను తీసుకుని మంత్రించి భూమిమీద చల్లాడు.

మరుక్షణం, పెళపెళా రావాలతో భూమి బద్దలయింది. అందులోనుంచి శిరస్సులు పైకెత్తి కర్ణకఠోరంగా ఓండ్రిస్తూ రెండు గాడిదలు బయటికి దూకినై. పద్మపాదుడు, వాటిలో ఒకదాని వీపుమీద తన దగ్గిరవున్న నంచిని వేలాడకట్టి, దానిమీద ఎక్కి కూచున్నాడు. పింగళుడు భయకంపితుడై, ఏమి చెయ్యాలో తోచక రెండవ గాడిదకేసి చూస్తూ, కదలా మెదలక నిలబడ్డాడు.

"పింగళా, అది నీ వాహనం, త్వరగా ఎక్కికూర్చో. మనం వెళ్లవలసిన ప్రదేశం చాలాదూరంగదా. ఇక బయలుదేరదాం!" అన్నాడు పద్మపాదుడు నవ్వుతూ.

"ఇవి మామూలు గాడిదలు కావు, ఏవో పిశాచాలు! నాకు భయంగా వుంది," అన్నాడు పింగళుడు.







"అవి మామూలు గాడిదలు కానిమాట నిజమే. పిశాచాలు అయితేనేం? మనం చెప్పినట్టల్లా నడచుకుంటై. వాయు మనో వేగాలతో ప్రయాణం చేయగలవు. నే వున్నా గదా? నీవు భయపడవలసిందేమీ లేదు," అన్నాడు పద్మపాదుడు.

పద్మపాదుడు యిలా అనేసరికి, పింగళుడికి ధైర్యం కలిగింది. అతడు నిర్భయంగా వెళ్లి గాడిదమీద ఎక్కి కూర్చున్నాడు. మరుక్షణం గాడిదలు రెండూ బిగ్గరగా ఓండ్రపెడుతూ, కొంతసేపు గాలిలోనూ, కొంతసేపు భూమిమీదా దౌడు తియ సాగినై.

సరిగా చీకటిపడే వేళకు వాళ్లు ఒకానొక అడవిప్రాంతం చేరారు. పద్మపాదుడు ముందుగా గాడిదమీంచి దిగుతూ, "పింగళా! ఈ రాత్రికి యిక్కడ మనం విశ్రాంతి తీసుకుందాం! తక్కిన ప్రయాణం రేపు సాయంత్రం లోపల ముగించవచ్చు," అన్నాడు. బాగా అలిసిపోయివున్న పింగళుడు, అందుకు సరే నన్నాడు.

అక్కడ వున్న పచ్చికమీద కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్న తరవాత, పింగళుడికి స్నానం చేయాలనిపించింది. కాని, ఆ ప్రాంతాల ఎక్కడా నీరు వున్న జాడ లేదు అతడు, పద్మపాదుడిని అడిగాడు. పద్మపాదుడు, అడవికేసి చూపుతూ, "అక్కడ, అడవిలో ఒక కొలను వున్నది. నువ్వు ఆ ప్రాంతాల ఎవరిని చూచిగాని భయపడ నవసరం లేదు," అన్నాడు.

పింగళుడు, అడవికేసి బయలుదేరాడు. పద్మపాదుడు 'ఎవరిని చూచిగాని భయపడ నవసరం లేదు,' అని ఎందు కన్నాడో అతడికి అర్థంకాలేదు. అతడు జాగ్రత్తగా చెట్ల కిందినుంచి నడుస్తూ కొద్దిసేపటికి, ఒక కొలను దాపులకు వెళ్ళాడు. నిర్మలంగా వున్న ఆ కొలనులోని నీరు అతడికి చాలా ఆనందం కలిగించింది. అతడు వుత్సా











హంగా కొలనులోకి దిగబోయాడు. అంతలో, ఆ ప్రదేశమంతా దద్దరిల్లేలా, ఒక భీకర స్వరం వినబడింది. "నన్ను విడిపించండి! మీకు సహాయంచేస్తాను! నన్ను..."

పింగళుడు ఆ స్వరం వింటూనే ఆదిరి పడ్డాడు. అతడి దృష్టి ఆ ధ్వని వస్తున్న వైపుకు వెళ్ళింది. కొలనుగట్టునే, ఒకచోట, రెండు పెద్ద కొండరాళ్లకు గొలుసులతో బంధింపబడిన నల్లని వికృతాకారం అతడికి దృష్టిగోచరమయింది. పింగళుడు బెంబేలు పడి ఒక త్రుటికాలంలో వెనుదిరిగి పారి పోదామనుకుని, అంతలోనే ఆ వికృతా కారుడు బలమైన గొలుసులతో రాళ్లకు బంధింపబడివున్న సంగతి గుర్తుకు తెచ్చు కుని, వున్న చోటునే వుండిపోయాడు.

"ప్రభూ, స్వామీ! నా చేతులకు వున్న యీ గొలుసులు బద్దలుకొట్టి, నన్ను కాపా డండి. నేను మీకు ఏ సహాయం కావాలన్నా చేస్తాను," అంటూ ఆ వికృతాకారుడు, పింగళుడికేసి తలతిప్పి అరవసాగాడు.

పింగళుడికి ఆసరికి బాగా ధైర్యం కలి గింది. అతడు అడుగులో అడుగు వేసు కుంటూ, ఆ వికృతాకారుడి దగ్గిరకు వెళ్ళాడు. దగ్గిరలో వుండి చూచినప్పుడు, ఆ వికృతాకారుడు మరీ భయంకరంగా కని పించాడు. తాటిమొదళ్లలా వున్న కాళ్లూ, జడలబర్రెలా వంటినిండా నిక్కబొడిచిన రోమాలూ, ఏనుగుచెవులలాంటి పెద్ద చెవులూ, నిప్పులు చెరిగే కళ్లూ—పింగళుడు భయంతో కంపించిపోయాడు.

"స్వామీ, నన్ను కాపాడండి! మీకు ఎలాంటి సాయమైనా చేయగలను. ఈ మూడు లోకాల్లో ఎక్కడికైనా, మిమ్మల్ని నా భుజస్కంధాలమీద మోసుకు పోగలను," అన్నాడు వికృతాకారుడు.

పింగళుడు, ఆ మాటలకు నవ్వి, "మూడు లోకాలకేకాదు, పద్నాలుగు లోకా లకూ నన్ను కావాలంటే మోసుకుపోగల







గాడిద నాకొకటి వుంది. నిన్ను చూస్తే, గాడిద కంటె బలమైనవాడివి. తెలివి గల వాడివిగాకూడా కనబడుతున్నావు. నీ పేరేమిటి?" అన్నాడు.

"నా పేరు భల్లూకకేతుడు!" అన్నాడు వికృతాకారుడు వినయంగా.

"ఇక్కడకు దాపులనే వున్న భల్లూక పర్వతాల సంగతి నీకు తెలుసా?" అని అడిగాడు పింగళుడు.

"భల్లూకపర్వతాల సంగతా?" అంటూ భల్లూకకేతుడు వికృతంగా నవ్వి, "నేను ఒకప్పుడు ఆ భల్లూకపర్వతాలకు అధిపతిని. ఒక మాంత్రికుడి మూలంగా, నాకీ దురవస్థ పట్టింది. మీరు నన్ను బంధవిముక్తుణ్ని చేస్తే, ఆ పర్వతాల్లో వున్న సర్వసంపదలూ మీవిగా చేస్తాను," అన్నాడు భల్లూకకేతుడు.

భల్లూకకేతుడు అలా అనేసరికి, పింగళుడికి ఎక్కడలేని ఆశా కలిగింది. భల్లూక కేతుడి సాయంతో, తను భల్లూకపర్వతాల్లో వున్న నిధినిక్షేపాలన్నీ వశపరచుకోవచ్చు ననుకున్నాడు. కావాలంటే, అందులో పద్మపాదుడికికూడా పాలు పంచవచ్చు.

"అయితే, నిన్ను యీ గొలుసులనుంచి విముక్తుణ్ణి చేస్తాను. కాని, ఆ తరవాత నాకు హాని చేయవని నమ్మకమేమిటి?" అని ప్రశ్నించాడు పింగళుడు.

భల్లూకకేతుడు ఆశగా పింగళుడికేసి చూస్తూ, "స్వామీ, ఆడినమాట తప్పితే, తల పగిలిపోతుందని, నాకు శాపం వుంది. మీకు హాని చేయనని మాటయిచ్చినతరవాత, చావదలిస్తే తప్ప, లేకపోతే అందుకు భిన్నంగా ప్రవర్తించలేను," అన్నాడు.

పింగళుడికి, భల్లూకకేతుడి మాటల్లో నమ్మకం కలిగింది. అతడు కొలను ఒడ్డునే వున్న ఒకరాయి తీసుకుని, ముందుకు వెళ్లబోయాడు. ఇంతలో వెనకనుంచి పద్మపాదుడు, "పింగళా! ఆగు!" అంటూ బిగ్గరగా కేక వేశాడు. (ఇంకా వుంది)








**4**

[పద్మపాదుడు, పింగళుడు భల్లూకపర్వతాలకు బయలుదేరారు. కొంత దూరం ప్రయాణం చేసిన తరవాత, పింగళుడు స్నానం చేసేందుకు, ఒక కొలనుదగ్గిరకు వెళ్ళాడు. అక్కడ, బంధింపబడి వున్న భల్లూకకేతుడనేవాడు, పింగళుణ్ణి సాయంచేయవలసిందిగా అడిగాడు. పింగళుడు అతణ్ణి విడిపించబోయేంతలో, వెనకనుంచి పద్మపాదుడు కేకవేశాడు.]

పద్మపాదుడి కేక విని, పింగళుడు అదిరిపడి వెనుదిరిగి చూచాడు. అతడి చేతిలోని రాయి జారి కొలనులో పడి శబ్దమైంది.

"పింగళా! అత డెవరనుకుంటున్నావ్?" అంటూ పద్మపాదుడు కఠినంగా ప్రశ్నించాడు. పింగళుడు ఒకసారి భల్లూకకేతుడికేసి చూసి తల వంచుకున్నాడు.

భల్లూకకేతుడు, పద్మపాదుడికేసి అనుమానంగా చూస్తూ, "స్వామీ, తమరెవరు? పుణ్యకార్యం చెయ్యనున్న, యీ యువకుణ్ణి ఎందుకు వారిస్తున్నారు?" అన్నాడు.

"పుణ్యకార్యమా?" అంటూ పద్మపాదుడు బిగ్గరగా నవ్వి, "నువ్వెవరివైందీ నాకు తెలియందికాదు. నిన్ను గురించి సర్వం ఎప్పుడో తెలుసుకున్నాను," అన్నాడు.

భల్లూకకేతుడు జవాబు చెప్పబోయేంతలో, పింగళుడు అందుకుని, "ఇతడి పేరు భల్లూకకేతుడు. మనం వెళుతున్న భల్లూక పర్వతాలకు ఒకప్పుడు, యితడు అధిపతి అట. ఒకానొక మాంత్రికుడి కారణంగా, తనకీ దురవస్థ పట్టిందని చెప్పాడు," అన్నాడు.







"అవును, ఒకానొక మాంత్రికుడివల్లనే, యితడికి యీ దుస్థితి కలిగింది. ఆ మాంత్రికు డెవరో నువ్వెరుగుదువా, పింగళా?" అని అడిగాడు పద్మపాదుడు. తెలియదన్నట్టు పింగళుడు తల వూపుతూ, భల్లూకకేతుడికేసి చూశాడు.

"ఈ భల్లూకకేతుణ్ణి పట్టి యిక్కడ రాతికి కట్టి, బంధించిన వాడు మహామాయుడు!" అంటూ పద్మపాదుడు, భల్లూకకేతుడికేసి తీక్షణంగా చూశాడు.

భల్లూకకేతుడు, ఆ మాట వింటూనే పళ్ళు పటపట కొరికి, "నువ్వెవరు? నా సంగతి నీకెలా తెలుసు? ఆ మహామాయుడి వృత్తాంతం నీకెవరు చెప్పారు? నీవూ మరో మాంత్రికుడివి కాదుగదా?" అన్నాడు తీవ్రంగా.

"అవును, నేనూ మాంత్రికుణ్ణే! నా పేరు పద్మపాదుడు. మహా బలశాలివీ, జిత్తులమారివీ అయిన నిన్ను జయించి, యిక్కడ కొండరాతికి బంధించిన, ఆ మహామాయుడి సమాధిమీదకు నేను దాడి వెళుతున్నాను," అన్నాడు పద్మపాదుడు.

"నిజమా? మహామాయుడి సమాధిమీదికే దాడి వెళుతున్నారా? అదే నిజమైతే, స్వామీ, మీరూ మహామంత్రవేత్తలయి వుంటారు. మహామాయుడికి బద్ధశత్రువునైన నా సాయం మీకు చాలా వుపకరిస్తుంది. నన్ను బంధవిముక్తుణ్ణి చేయండి. మీకు ఎల్లకాలం దాసుడుగా వుంటాను," అన్నాడు భల్లూకకేతుడు.

"నీ కల్లబొల్లిమాటలు నమ్మేందుకు నేను అమాయకుణ్ణి కాదు," అన్నాడు పద్మపాదుడు నవ్వుతూ.

పింగళుడు, పద్మపాదుడి దగ్గిరకువస్తూ, "పద్మపాదా, యితణ్ణి మనం రక్షించవచ్చనుకుంటాను. ఆడిన మాట తప్పితే, తల పగిలిపోతుందని, అతడి కెవరో శాపం పెట్టినట్టు చెప్పాడు," అన్నాడు.









"ఆ మాట నమ్మి, నువ్వు ప్రమాదంలో చిక్కుకునేందుకు సిద్ధమయావు. మహా మాయుడిదగ్గిర వున్న మంత్రశక్తి గల వస్తువులు మనవి కానిదే, యీ భల్లూకకేతుణ్ణి మనం విడిపించటం ప్రమాదమవుతుంది. ముందు ఆ వస్తువులను మనవిగా చేసుకున్న తరవాత, యితణ్ణి మన దాసుడుగా చేసుకోవచ్చు," అన్నాడు పద్మపాదుడు.

"అయితే, స్వామీ..." అంటూ భల్లూకకేతుడు, ఏమో చెప్పబోయేంతలో, పద్మపాదుడు అతణ్ణి వారిస్తూ, "భల్లూకా! నీ మెరమెచ్చుమాటలు నన్ను మోసపుచ్చలేవు. మహామాయుడు సమాధి అయిన పాడుదేవళంలో నేను ప్రవేశించిన తరవాత, నిన్ను బంధవిముక్తుణ్ణి చేస్తాను. అంతవరకూ, నీవు యిక్కడ వుండవలసిందే!" అంటూ వెనుదిరిగాడు. పింగళుడుకూడా, అతడి వెనకనే బయలుదేరాడు.

పద్మపాదుడూ, పింగళుడూ అడవి నుంచి బయటికి వచ్చారు. ఎదురుగా వున్న పచ్చికబయలులో, వారికి వాహనాలుగా వుపయోగించిన గాడిదలు లేవు. పింగళుడు ఆశ్చర్యపోతూ చుట్టూచూచి, "మన పిశాచ వాహనా లెక్కడ? అవి, యీ ప్రాంతాల మేస్తున్నవనుకున్నాను," అన్నాడు.

"అవి గాడిదల రూపంలో వున్న పిశాచాలుగాని, గాడిదలు కావు గదా? అలాంటప్పుడు, వాటికి ఆహారంగా పచ్చిక ఎలా పనికివస్తుంది? అవి రెండూ ఆహారసంపాదనకు వెళ్లినై. ఇక, మన ఆహారం సంగతి!" అంటూ పద్మపాదుడు పొట్ట తడువుకుంటూ, అక్కడ మెత్తని కంబళిలా వున్న పచ్చికమీద కూలబడ్డాడు.

పింగళుడుకూడా అతడిపక్కనే కూర్చుంటూ, "అవును, పద్మపాదా! నాకూ ఆకలేస్తున్నది. మనం ఆహారం వెంట తెచ్చుకోవటం మరిచిపోయాం," అన్నాడు గాభరాపడుతూ.








పద్మపాదుడు, పింగళుడి వాలకంచూచి నవ్వి, "పింగళా, అక్కడ వున్న సంచీ అందుకో" అంటూ కొంచెం ఎడంగా వున్న సంచీకేసి చేయి చూపాడు.

పింగళుడు సంచీ తీసుకుని, అందులో ఆహారపదార్థాలు వున్నవేమో అని చేయి పెట్టి వెతికి, ఏమీ లేకపోవటం తెలుసుకుని, నిరాశపడ్డాడు. పద్మపాదుడు, సంచీని అందుకుని, "పింగళా, నీ కెలాంటి భోజనం కావాలి? ఎన్ని రకాల కూరలు? కోరుకో!" అని అడిగాడు నవ్వుతూ.

"ఎన్నిరకాల కూరలోకూడానా? కాలే కడుపుకు, యిన్ని పచ్చడి మెతుకులు



చాలు. ఆ సంచిలో ఏమీలేదు. వట్టి కాళీ సంచీ!" అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు సంచీ తెరిచి, అందులోకి ఓమారు తొంగిచూచి, మెల్లగా ఏదో మంత్రం జపించి, "పింగళా, సంచీలో యిప్పుడు చూడు!" అంటూ సంచీని పింగళుడి ముందుపెట్టాడు.

పింగళుడు ఆత్రంగా సంచీలో చేయి పెట్టాడు. అతడి చేతికి వేడివేడిగా వున్న ఒక వెండిపాత్ర తగిలింది. అది బయటికి తీశాడు. అందులో కళకళలాడుతూన్న అన్నం వుంది. అతడు ఆశ్చర్యపోతూ పద్మపాదుడికేసి చూశాడు.

పద్మపాదుడు నవ్వి, "నీకు కావలసిన అన్ని రకాలకూరలూ, పాయసాలూకూడా ఆ సంచీలో వున్నవి. త్వరత్వరగా బయటికి లాగు," అన్నాడు.

పది నిమిషాలు గడిచీ గడవకముందే, పింగళుడు సంచీలోనుంచి ఇరవైఅయిదు రకాల కూరలూ, పాయసాలూ బయటికి లాగాడు. బాగా ఆకలిగొనివున్న పద్మపాదుడూ, పింగళుడూ కలిసి త్వరలోనే భోజనం ముగించారు. తరవాత కొంచెం సేపు విశ్రాంతి తీసుకుని తిరిగి ప్రయాణానికి సిద్ధమయారు.











పద్మపాదుడు చిటికెడు మన్ను తీసుకుని మంత్రించి, భూమిమీద చల్లగానే పెళపెళమంటూ భూమి బద్దలయింది. గాడిదల రూపంలో వున్న రెండు పిశాచాలూ, భీకరంగా ఓండ్రిస్తూ పైకి వచ్చినై. పద్మపాదుడూ, పింగళుడూ చెరి ఒక వాహనాన్ని ఎక్కి భల్లూకపర్వతాలకేసి బయలుదేరారు.

రెండు మూడు గంటల ప్రయాణం తరవాత, భూమ్యాకాశాలు ఒరుసుకునే చోట, నల్లని పొగలు కమ్ముతున్నట్టుగా ఒక దృశ్యం కనిపించింది. పింగళుడు, అటుకేసి చూపుతూ, "పద్మపాదా! ఆ కనబడేవి మబ్బులా లేక పొగలా?" అని అడిగాడు.

పద్మపాదుడు కొంచెంసేపు అటువైపు పరీక్షగా చూచి, "పింగళా, అవి మబ్బులూ కాదు, పొగలూ కాదు. భల్లూకపర్వతాలు వున్న ప్రదేశంలో, వాటిని కాపలా కాస్తున్న రాక్షసగణం! బహుశా, అవి మన రాకను గమనించి, మనను భయపెట్టేందుకు ప్రయత్నిస్తున్న వనుకుంటాను," అన్నాడు.

పద్మపాదుడు మాట ముగించీ ముగించకముందే, ఎదురుగా, దాదాపు ఓ యాభై గజాల దూరంలో, మేఘంలాంటి నల్లని పొగ భూమిమీంచి గుండ్రగా సుడులు తిరుగుతూ, తాటిచెట్టు ప్రమాణంలో పైకి లేచింది. పింగళుడు భయంతో వణికిపోతూ, పద్మపాదుడికేసి చూశాడు. పద్మపాదుడు ఏదో మంత్రోచ్చారణ చేసి, తను ఎక్కివున్న గాడిదను, అటుకేసి పరిగెత్తించాడు. మరుక్షణాన పొగ మాయమైంది.

పద్మపాదుడు, పింగళుడికేసి తిరిగి, "పింగళా, భయపడకు! ఇదిగో, నీకు రక్షణగా, యీ కత్తి యిస్తున్నాను. దీనితో నీవు ఏ రూపంలో నిన్ను ఎదిరించవచ్చిన రాక్షసినైనాసరే సంహరించవచ్చు," అంటూ పింగళుడికి కత్తిని యిచ్చేంతలో, వారిద్దరి మధ్య వున్న భూమి దద్దరిల్లింది. పద్మపాదుడూ, పింగళుడూ ఎక్కివున్న గాడి





దలు రెండూ పక్కలకు పారిపోయినై. మరు క్షణంలో, బారెడేసి దంతాలతో, శరీర మంతా జడలతో అలుముకునివున్న ఏనుగు ఒకటి, ఘీంకరిస్తూ పింగళుడి మీదికి లంఘించింది. పింగళుడు వెనుకాడక, నిర్భయంగా తన చేతికత్తితో ఏనుగుమీదికి దూకాడు. వెంటనే ఏనుగు బాధతో మూలి గినట్టుగా శబ్దంచేసి, క్షణంలో నల్లని పొగగా మారి, సుడులు తిరుగుతూ దూరంగా పారిపోయింది.

" భేష్, పింగళా, అదీ యువకుడైనవాడు ప్రవర్తించవలసిన తీరు ! దెబ్బకు దెయ్యం పారిపోతుందనే సామెత కల్లగాదు. నీకు, యిచ్చిన కత్తిలో ఏ మంత్రశక్తి లేదు. కాని. ముందుగా ఆ మాట చెప్పినట్లయితే. నువ్వు అంత ధైర్యంగా ఆ మాయాగజాన్ని ఎది రించేవాడివి కాదు. ఇప్పుడు తెలిసిందా, ధైర్యవంతుణ్ణి ఎవరూ లొంగతీసుకోలేరన్న సంగతి !" అన్నాడు పద్మపాదుడు.

పింగళుడు తన చేతనున్న కత్తికేసి ఓమారు ఆశ్చర్యంగా చూసి, పొట్టచెక్కల యేలా నవ్వుతూ. " యీ కత్తిలో నిజంగా మంత్రశక్తి లేదా ? అయినా ఫరవాలేదు. దీనితో నేను వెయ్యిమంది రాకసులనైనా సరే ఎదిరించగలను. జై, పాతాళభూతా !" అంటూ కత్తిని గాలిలో గిరగిరా తిప్పాడు.





పింగళుడు ప్రదర్శించిన ధైర్యసాహసాలు పద్మపాదుణ్ణి ఎంతగానో ఆకర్షించినై. అతడు పింగళుడికేసి ఆప్యాయంగా చూసి, "పింగళా, మనం భల్లూకపర్వతాలను సమీపించాం. మనం చేరవలసిన నది, యీపర్వతాల మధ్య గల లోయలో వుంది. కాలి నడకను, అక్కడికి చేరాలంటే చాలాకాలం పడుతుంది. ఎక్కే రాయీ దిగే రాయీ— చాలా శ్రమతో కూడిన పని. కనుక, యీ పిశాచగార్దభాలను కొండలమీదుగా ఎగిరించి, ఆ లోయలో దిగుదాం!" అన్నాడు.

పింగళుడు అంగీకార సూచకంగా తల వూపింతలో గాడిదలు రెండూ, గాలిలోకి లేచినై. అవి కొండశిఖరాలమీదుగా ఎగురుతూ, క్రమంగా లోయలో గల నది సమీపాన దిగినై. పద్మపాదుడూ, పింగళుడూ తమతమ వాహనాలమీంచి దిగారు. మరుక్షణంలో అవి రెండూ మాయమైపోయినై.

పద్మపాదుడు నది ఒడ్డునే కూర్చుని, చేతితో నీళ్లను కదిలిస్తూ మంత్రం పఠించసాగాడు. క్రమంగా నదిలో అలలు పుట్టి ఉవ్వెత్తుగా లేస్తూ పొగలు చిమ్మసాగినై. పింగళుడు స్థాణువులా ఆ దృశ్యం చూస్తూ కదలామెదలక వుండిపోయాడు.

కొద్దిసేపటి తరవాత పద్మపాదుడు యివతలికి వచ్చి, నంచిలో వున్న గాజుజాడీని





తీసుకురావలసిందిగా పింగళుడితో చెప్పాడు. పింగళుడు గాజుజాడీ తెచ్చి, పద్మపాదుడి ముందు పెట్టాడు. అందులో మొసళ్ల రూపంలోవున్న మహామాయుడి శిష్యులిద్దరి కేసీ పద్మపాదుడు గుర్లుచుముతూ చూచి, "ఇకనైనా మీరు, మీ అసలు రూపాలు ధరిస్తారా? లేక కాల్చి బూడిదచేసి, యీ నదిలో కలపమంటారా?" అంటూ హుంక రించాడు. వెంటనే గాజుజాడీ తపీమంటూ పగిలి ముక్కలుచెక్కలుగా గాలిలోకి ఎగిరి పోయింది. నల్లని వికృతాకారులైన యిద్దరు వ్యక్తులు పద్మపాదుడుకి నమస్కరిస్తూ, "మహామాంత్రికా! మేము మీకు దాసాన దాసులం! ఏమిటి సెలవు?" అని అడిగారు.

"మహామాయుడి సమాధి వున్న పాడు దేవళంలోనికి ప్రవేశం కావాలి. ముందుగా యీ నదిలోని నీరు యింకి పోయేట్టు, చేయండి!" అంటూ పద్మపాదుడు కఠి నంగా జవాబిచ్చాడు.

మహామాయుడి శిష్యులు ముఖ ముఖాలు చూచుకుని, జవాబు చెప్పేం దుకు తటపటాయిస్తున్నంతలో, పద్మ పాదుడు కళ్ళెర్రచేసి, "నా ఆజ్ఞ విన్నారా లేదా?" అని ప్రశ్నించాడు.

మహామాయుడి శిష్యులు వణికిపోతూ, పద్మపాదుడికి నమస్కరించి, "ఈ నది యింకిపోవాలన్నా, మహామాయుడి సమాధి వున్న పాడుదేవళంలోకి ప్రవేశించాలన్నా, ముందుగా పింగళుడనే జాలరి యువకుడు యిక్కడికి రావలసి వుంటుంది," అన్నారు.

"అదుగో, యితడే ఆ జాలరి, పింగ ళుడు!" అంటూ పద్మపాదుడు, పింగళుడి కేసి చేయిచూపాడు.

మహామాయుడి శిష్యులు, పింగళుడి కేసి ఆశ్చర్యంగా చూసి, "మహాప్రసాదం! మీ ఆజ్ఞ యిప్పుడే నెరవేరుస్తాం!" అంటూ వెంటనే అదృశ్యులై పోయారు.

(ఇంకా వుంది)








## 5

[పద్మపాదుడు, పింగళుణ్ణి, ఖల్లాటకకేతుడి మాయలో పడకుండా రక్షించిన తరవాత— ఇద్దరూ కలిసి, ఖల్లాటకపర్వతాలకు బయలుదేరారు. దారిలో వాళ్లకు పొగల రూపంలో, సుడులు తిరుగుతూ కదిలే పిశాచాలు కనిపించినై. మొసళ్ల రూపంలో వున్న మహామాయుడి శిష్యులు, పద్మపాదుడికి సహాయం చేసేందుకు అంగీకరించి అదృశ్యులై పోయారు.]

మహామాయుడి శిష్యులిద్దరూ అదృశ్యులై పోగానే, పింగళుడు ఆశ్చర్యపడుతూ, పద్మపాదుడికేసి చూసి, "పద్మపాదా! ఆ ఇద్దరూ తిరిగి మొసళ్ళ రూపంలో ఈ నదిలో ప్రవేశించలేదుగదా?" అని అడిగాడు.

"మొసళ్ళ రూపంలోనా?" అంటూ పద్మపాదుడు ఉలిక్కిపడి, అంతలోనే సర్దుకుని నవ్వుతూ, "పింగళా, వాళ్లిద్దరూ నిజంగా మళ్లీ మొసళ్ళ రూపం ధరిస్తే, కథ మొదటికి వస్తుంది. వాళ్లను చేజిక్కించుకునేందుకు నా సోదరులిద్దరూ ఆహుతి అయిన సంగతి నీకు తెలుసుగదా? నేను కూడా వారి బారినుంచి కొనప్రాణాలతో బతికి బయట పడ్డాను," అన్నాడు.

"అయితే, వాళ్ళిప్పుడు ఎక్కడికి వెళ్ళినట్టు?" అని ప్రశ్నించాడు పింగళుడు.

"వాళ్ళు ఎక్కడికి ఏ రూపంలో వెళ్ళారనేది అంత ముఖ్యంకాదు. మనం ఈ నదిగర్భంలో ఉన్న పాడుబడిన దేవళంలో ప్రవేశించవలసి ఉంది. ఆ దేవళంలో గల అయిదు ద్వారాలను తెరుచుకుంటే తప్ప, మనం మహామాయుడు సమాధి







ఆయివున్న గదిని చేరలేము. అందుకు వాళ్లు మనకు సహాయం చేస్తారు," అన్నాడు పద్మపాదుడు.

"నాకు అంత బాగా ఈత రాదు. ఈ నదిలో ఉన్న దేవాలయాన్ని నే నెలా చేర గలను?" అన్నాడు పింగళుడు.

పింగళుడు అమాయకంగా అడిగిన ఈ ప్రశ్నకు పద్మపాదుడు నవ్వి, "పింగళా, నీకు యీదటం చేతకాకపోయినా, తిరుగు లేని గుండెనిబ్బరం ఉంటే చాలు! ఈ నదిలో ఒక్క చుక్క నీరుకూడా లేకుండా ముందు చేయవలసివుంది. అందుకు ప్రయత్నిద్దాం. ఆ ప్రయత్నంలో మనకు మహామాయుడి శిష్యులు యిద్దరూ తప్పక సహాయంచేస్తారు" అన్నాడు.

"ఇంత గొప్ప నదిలో—ఒక్క నీటి చుక్కకూడా లేకుండా చేయటమా?" అంటూ పింగళుడు ఆశ్చర్యం కనబరిచాడు.

"అవును, అలా చేసినప్పుడే మన కార్యం నెరవేరుతుంది. నేను అప్పుడే మంత్రనిష్ఠకు పూనుకోబోతున్నాను. దాన్ని మహామాయుడి స్వాధీనంలో ఉన్న దుష్ట శక్తులు పాడుచేయకుండా కాపాడవలసిన బాధ్యత నీది. అంటే—ఒకరకంగా నువ్వే నన్ను రక్షించవలసి ఉంటుందన్నమాట!"

"నేను మిమ్మల్ని రక్షించటమా?" అని పింగళుడు అదుర్దాగా ప్రశ్నించాడు.

"అవును, నువ్వే నన్ను రక్షించవలసి వుంటుంది. నేను మంత్రనిష్ఠలో ఉండగా నా చుట్టూ ఏమి జరుగుతుందో నాకు తెలియదు. కనుక, ఆయుధపాణివై నీవే నన్ను సదా కాపాడవలసి ఉంది. ఇదుగో ఆయుధం!" అంటూ పద్మపాదుడు గాలిలో చేయి చాచి ధగధగమని మెరుస్తూ కళ్ళకు మిరుమిట్లు కొల్పుతున్న ఒక గదను అందుకుని, పింగళుడికి ఇచ్చాడు.

పింగళుడు, పద్మపాదుడినుంచి గదను అందుకుని దానిని గిరగిర తిప్పచూచి,









భుజాన పెట్టుకున్నాడు. పద్మపాదుడు అతడికేసి ఆప్యాయంగా చూస్తూ, "అయితే పింగళా, ఇక నేను సమాధిలో వుండి మంత్రోచ్ఛారణ చేస్తాను. మాయారూపాలు ధరించి మనను బాధించవచ్చే మహామాయుడి పిశాచగణాన్నుంచి నన్నూ, నిన్నూకూడా రక్షించుకోవలసిన బాధ్యత నీది. త్వరలోనే ఈ నదీజలాన్ని స్తంభింపచేసి, ఇంకిపోయేట్టు చేస్తాను," అన్నాడు.

"అలాగే కానివ్వండి. ఈ గద సహాయంతో ఎటువంటి రక్కసులనైనా సరే పారదోలగలను," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు నది ఒడ్డునే పద్మాసనం వేసి కూర్చుని, నదీజలాన్ని రెండు మూడు సార్లు చేతితో కదిపి, "జల—సర్వస్తంభనం...కురు కురు ...శీఘ్రం వశ్యం... ఠః ఠః...." అంటూ కళ్లుమూసుకున్నాడు.

పద్మపాదుడు ఆ విధంగా కళ్లు మూసుకునేంతలో, ఆకాశం గింగుర్లెత్తేలా కీచుమన్న వికృత ధ్వని వినిపించింది. పింగళుడు అదిరిపడి, అంతలోనే గుండెనిబ్బరం తెచ్చుకుని, భుజంమీదినుంచి గదను చేతిలోకి తీసుకుని ఆకాశంకేసి చూశాడు.

ఒక్క త్రుటికాలం ఆకాశమంతా నల్లని కారుమేఘంతో కప్పబడినట్టయింది. చూస్తూండగానే అది కుంచించుకుపోతూ, క్రమంగా ఏనుగు ప్రమాణానికి తరిగిపోయింది. "ఓహో, నన్ను లోగడ ఎదిరించిన మాయా గజం, మళ్లీ నామీదకు వస్తున్నదన్నమాట!" అనుకుంటూ పింగళుడు, గదను గట్టిగా గుప్పెటలో బిగించాడు. కాని ఆ మేఘం ఏనుగు ఆకృతి ధరించక త్రుటికాలంలో పెద్ద పక్షిలా అయి, రెక్కలు అల్లల్లాడించ సాగింది.

"ఇది పిశాచ గండభేరుండపక్షి, సందేహం లేదు!" అనుకున్నాడు పింగళుడు.

గండభేరుండపక్షి దిక్కులు పిక్కటిల్లేలా కేకరించి రెక్కలాడిస్తూ, సూటిగా పింగ








ళుడు నిలబడివున్న చోటుకు దిగసాగింది. అది క్రమంగా కిందికి వస్తూన్నకొందికీ దాని రెక్కలనుంచి వెలువడే గాలి తాకిడికి ఆ ప్రాంతాల గల చెట్టూ చేమలు తుఫాను దెబ్బకు ఊగిపోయినట్టు ఊగిపోయినై.

పింగళుడు చలించలేదు. ఆ పక్షి తనను కోడిపిల్లను తన్నుకుపోయినట్టు తన్నుకు పోయేందుకు వస్తున్నదని అతడికి తెలును. అయినా తన చేతిలో, పద్మపాదుడు యిచ్చిన మంత్రశక్తి గల గద ఉన్నది!

పింగళుడు గదను రెండు గుప్పెట్లలోనూ బిగించి పట్టుకుని పైకెత్తాడు. పిశాచ పక్షి అతన్ని సమీపిస్తున్నది. బారెడు పొడవున



కొనదేరిన ముక్కూ, పదునైన కాలిగోళ్ళూ, నిప్పులు చెరిగే కళ్ళూ—అది చాలా భయంకరంగా, వికృతంగా ఉన్నది. అది దగ్గిరకు వస్తున్నప్పుడు దాని రెక్కల గాలి రివ్వు రివ్వుమంటూ శబ్దం చేయసాగింది. దాని తాకిడికి పింగళుడు ఉన్న చోటున కాలు నిలదొక్కుకోలేక, అల్లంత దూరం కొట్టుకుపోయాడు. అదే సమయంలో పిశాచపక్షి అతడి తలకు దగ్గిరగా ముక్కు సాచింది. పింగళుడు చేతనున్న గదను బలంగా విసిరాడు. కాని పక్షి ఆ దెబ్బ తప్పుకుని, వికృతంగా అరిచి పైకి ఎగిరిపోయింది.

'బతికిపోయాను!' అనుకుంటూ పింగళుడు పైకి చూచాడు. పిశాచపక్షి ఆకాశంలోకి చాలా దూరం ఎగిరిపోయి, ఈసారి మరింత వేగంగా కిందికి దిగిరాసాగింది. పింగళుడు పాదాలు భూమిలోకి బాగా గుచ్చి, గద పైకెత్తి సిద్ధంగా ఉన్నాడు. పక్షి రివ్వుమంటూ తలమీదికి వచ్చేసరికి, అతడు గురిగా గదను దాని తలమీదికి విసిరికొట్టాడు. మరుక్షణం కొండ బద్దలయినట్టు ఢాం అన్న శబ్దం వెలువడింది. పిశాచపక్షి తునా తునియలై, తల ఒక వైపుకూ, రెక్కలూ, కాళ్ళూ మరొక వైపుకూ చెల్లాచెదరుగా ఎగిరి, ఢెంఢెం భూమిమీద పడింది.









పింగళుడు ఆ దృశ్యం చూసి సంతోషం పట్టలేక, 'జై, పద్మపాదా!' అంటూ గదను గిరగిరా తిప్పుతూ గంతులువేశాడు. తరవాత మంత్రనిష్ఠలో ఉన్న పద్మపాదుణ్ణి చూశాడు. పద్మపాదుడిలో ఏమాత్రం చలనంలేదు. అతడి కళ్లు మూతలుపడి ఉన్నాయి. పెదాలు మాత్రం అప్పుడప్పుడూ కదులుతున్నాయి. "ఈయనకు నిష్ఠాభంగం కలగలేదు, అంతే చాలు!" అనుకుంటూ పింగళుడు వెనుదిరగపోయేంతలో ఘల్లు ఘల్లుమంటూ గజ్జెలమోత వినబడింది.

పింగళుడు నిశ్చేష్టుడయాడు. ఎదురుగా సర్వాలంకారాలతో అప్సరసలా వున్న ఒక యువతి నాట్యంచేస్తూ పాట పాడుతున్నది. ఆమె సౌందర్యం, గంధర్వగానం విని పింగళుడు ఒక్క తృటికాలం తనను తామరిచాడు.

"పింగళా! నీ అందం చూసి నేను ఇక్కడకు వచ్చాను. నన్ను వివాహం ఆడు. నీకు సర్వసంపదలూ సమకూరుస్తాను," అన్నది ఆ యువతి.

ఆ పరికి పింగళుడు తన్నుదా సముదాయించుకుని, "నువ్వు నా అందంచూసి వచ్చావా? నేను ఏ మహరాజు కుమారుణ్ణో అనుకుంటున్నావేమో! అలా పొరబడకు. నేను జాలరి పింగళుణ్ణి!" అన్నాడు.

"జాలరివయితే మాత్రం ఏం? నీ అంత అందగాడు, పధ్నాలుగు లోకాల్లోనూ వుండడు," అంటూ ఆ యువతి నాట్యం ప్రారంభించింది.

పింగళుడు ఆమెకేసి అనుమానంగా చూస్తూ, "నీ గొంతుతోపాటు శ్రుతి కలిపి చాలా పక్కవాద్యాలు వినబడుతున్నవి! ఆ వాద్యగాళ్లంతా, నా కంటికి కనబడరేం?" అన్నాడు.

"నన్ను పెళ్లాడితే తప్ప, నీకు వాళ్లు కనిపించరు. నేను ఖేచరిని!" అన్నది, యువతి.

"నువ్వు ఖేచరివా? ఓహో—ఆకాశంలో సంచరించే గంధర్వకాంత వన్నమాట!"











అంటూ పింగళుడు గద పైకెత్తి, ఆమెను సమీపించబోయాడు.

"పింగళా! ఆ గద దూరంగా పార వెయ్యి. నాకు, ఆయుధాలంటే భయం," అంటూ ఖేచరి వెనక్కు నడిచింది.

దానితో, పింగళుడికి ఆ యువతి ఎవరైనదీ అర్థమైపోయింది. పద్మపాదుడికి నిష్ఠాభంగం కలక్కుండా, కాపాడుతున్న తనను, ముందుగా మాయచేసి సంహరించేందుకు వచ్చిన పిశాచమని తెలుసుకున్నాడు. అతడు పొంగివచ్చే కోపాన్ని అణచుకుని, లేని సంతోషాన్ని కనబరుస్తూ, "ఓ, ఖేచర కాంతామణీ! నిన్ను వివాహమాడేందుకు నా అభ్యంతరం ఏమీలేదు. కాని, సమయానికిక్కడ, మా ముత్తాత తాతగారి, మూడవ భార్య లేనందుకు విచారిస్తున్నాను. ఆవిడే నన్ను పెంచి పెద్దవాణ్ణి చేసింది. అయినా ఫరవా లేదు. మా వంశాచారం ప్రకారం, పెళ్లికి ముందు ఈ గదతో నీ నెత్తిమీద ఒక్కసారి మోదనియ్యి," అంటూ ముందుకు వురికాడు.

ఖేచరి కెవ్వున కేకవేసి, వెనక్కు పరిగెత్తబోయింది. యీ లోపల, పింగళుడు తన గదతో, ఆమెను బలంగా నెత్తిమీద కొట్టాడు. మరుక్షణం పెద్ద ధ్వనితో మాయారూపంలో వచ్చిన పిశాచిని ముక్కలు చెక్కలుగా పేలి, గాలిలోకి ఎగిరిపోయింది.

పింగళుడు పెద్దగా నవ్వి, వెనుదిరిగి పద్మపాదుడి దగ్గిరకు వచ్చాడు. పద్మపాదుడు యింకా కళ్లు మూసుకునే వున్నాడు. పింగళుడి దృష్టి నదికేసి వెళ్లింది. అతడి ఆశ్చర్యానికి అంతులేదు. నదిలో నీరు చూస్తూండగానే, యింకిపోతున్నది. అప్పటి వరకూ ఆ నీటిలో ఆవాసం ఏర్పరుచుకున్న జలచరాలు, కుప్పతిప్పలుగా బయట పడుతూ—అటూయిటూ గెంతుతున్నవి.

"పింగళా!" అంటూ పద్మపాదుడు కళ్లు తెరిచాడు. పింగళుడు ఒక్క ఎగురున



పద్మపాదుణ్ణి సమీపించి, "పద్మపాదా! నదికేసి చూడు!" అన్నాడు ఆశ్చర్యంగా.

పద్మపాదుడు నదికేసి చూస్తూ, "భేష్, మహామాయుడి శిష్యులు మాట నిలుపుకున్నారు! అంతకూ మనకు కావలసిన పాడుదేవళం ఎక్కడ?" అన్నాడు.

పింగళుడు నదిమధ్యకేసి పరీక్షగా చూచి, "అదుగో, యిప్పుడిప్పుడే శిఖరం నీటినుంచి బయటికి వస్తున్నది! అదేనా మహామాయుడు సమాధి అయిన దేవళం?" అని అడిగాడు.

పద్మపాదుడు, పింగళుడు చూచిన వైపుకు చూస్తూ, తృప్తిగా నవ్వి, "అదే పాడుబడిన దేవళం. నదిలో ఒక్క చుక్క నీరు లేకుండా యింకిపోయిన తరవాత, మహామాయుడి శిష్యులిద్దరూ మన దగ్గిరకు వస్తారు. సరే, నేను నిష్ఠలో వుండగా, దాన్ని భంగపరిచేందుకు పిశాచగణమేమీ రాలేదు గదా?" అని అడిగాడు.

పింగళుడు, సంతోషంతో తను సంహరించిన పిశాచ గండభేరుండ పక్షిని గురించీ, ఖేచరకాంతను గురించీ వివరంగా చెప్పాడు. అంతావిన్న పద్మపాదుడు, పింగళుడి భుజం తడుతూ, "పింగళా, గంధర్వ స్త్రీ రూపంలో వచ్చిన పిశాచిని అందానికి వశుడవు కాకుండా నిగ్రహించు కున్నందుకు, నాకు చాలా ఆనందంగా వుంది. నువ్వు. పాడుదేవళంలో ప్రవేశించినప్పుడూ, యిలాంటి పరీక్షలనే కొన్నిటిని ఎదుర్కొవలసి వస్తుంది, జాగ్రత్త!" అన్నాడు.

అంతలో నది మధ్యంనుంచి, "మహామాంత్రికా!" అన్న కేక వినబడింది. పద్మపాదుడూ, పింగళుడూ అటుకేసి చూశారు. ఒక దేవాలయశిఖరం, వారి దృష్టి నాకర్షించింది. దానిపక్కనే నిలబడి, మహామాయుడి శిష్యులిద్దరూ కనిపించారు. వారు, పద్మపాదుడికేసి చూస్తున్నారు.

—(ఇంకా వుంది)








6

[పద్మపాదుడూ, పింగళుడూ భల్లూకపర్వతాల లోయలో గల నది వద్దకు వెళ్లారు. నది జలాన్ని యింకింపజేసేందుకు, పద్మపాదుడు సమాధినిష్ఠలో మంత్రం జపిస్తూండగా, పింగళుడు గద చేబూని, అతడికి రక్షణగా వున్నాడు. నదిజలం యింకిపోయింది. అందులోనుంచి, పాడుబడిన దేవాలయ శిఖరం బయటపడింది. తరవాత—]

పద్మపాదుడు, దేవాలయ శిఖరంకేసి కొంత సేపు పరీక్షగా చూసి, దాని పక్కనే నిలబడివున్న మహామాయుడి శిష్యులను దగ్గరకు రావలసిందిగా చేయి వూపాడు. మహామాయుడి శిష్యులిద్దరూ తృటి కాలంలో, పద్మపాదుడిని సమీపించి, అతడికి వంగి నమస్కరించారు.

"మీరు నా ఆజ్ఞను శిరసావహించి నందుకు, నాకు చాలా సంతోషంగా వుంది. ప్రస్తుతానికి మీ యిష్టం వచ్చిన చోటుకు వెళ్లవచ్చు," అన్నాడు పద్మపాదుడు.

మహామాయుడి శిష్యులు ముఖముఖాలు చూచుకున్నారు. వారిలో ఒకడు ధైర్యం తెచ్చుకుని, "మహామాంత్రికా! దయతో, మా విన్నపం ఆలించవలసిందిగా ప్రార్థిస్తున్నాము. మావల్ల మీకు కావలసిన సహాయం అయిపోయింది. ఇకనైనా మమ్మల్ని, మంత్రవిముక్తుల్ని చేయరాదా?" అని అడిగాడు.

"నే వచ్చిన పని నెరవేరందే, మిమ్మల్ని మంత్రవిముక్తుల్ని చేయటమా?" అంటూ పద్మపాదుడు బిగ్గరగా నవ్వి, "మీరు,









మామూలు పిశాచాలు కాదనీ—మహాదుష్ట, క్రూర పిశాచగణానికి చెందిన వారనీ నాకు తెలుసు! కనుక, మీ గురువు సమాధినుంచి, నాకు కావలసినవి, నేను సంగ్రహించందే, మిమ్మల్ని మంత్రవిముక్తుల్ని చేయటమనే ఆలోచనే లేదు," అన్నాడు.

పద్మపాదుడి మాటలు వింటూనే, మహామాయుడి శిష్యులిద్దరూ వెలవెలపోయారు. తరవాత వాళ్లిద్దరూ, పద్మపాదుడికి సాష్టాంగ పడి, "మహామాంత్రికా! మేము మీకు దాసానదాసులం! మంత్రబలంతో మీరు మమ్మల్ని బంధించిననాటినుండి, మాకు కడుపునిండా ఆహారమే లేదు. మేము శక్తిహీనులమై పోయాం!" అంటూ విలపించసాగారు.

పింగళుడికి, వాళ్లిద్దఃమీదా ఎంతో జాలి కలిగింది. అతడు పద్మపాదుడికేసి తిరిగి, "పద్మపాదా!" అంటూ ఏమో చెప్పబోయేంతలో, పద్మపాదుడు అతణ్ణి వారించి, మహామాయుడి శిష్యులతో యిలా అన్నాడు,

"మీరు, యింతకాలంగా ఆహారం లేక వుపవాసాలు చేస్తున్నారని నాకు తెలుసు. మీకు వేటాడే శక్తిలాటిది గనక, నేను ప్రసాదిస్తే—ఆ మరుక్షణం, మీరు నన్నే వేటాడి చంపేందుకు ప్రయత్నిస్తారు! అవునా?"

"మహామాంత్రికులైన మిమ్మల్ని, క్షుద్రులమైన మేము, వేటాడటమా?" అంటూ, మహామాయుడి శిష్యులు దీనాతిదీనంగా ముఖం పెట్టారు.

పద్మపాదుడు నవ్వాడు. తరవాత, పింగళుడి చేతిలోంచి మంత్రశక్తి గల గద తీసుకుని, "మీ యిద్దరికీ. ప్రస్తుతానికి మానవులను తప్ప, మరి దేనినైనా చంపి తినగల శక్తి యిస్తున్నాను. మీకు ఎలాంటి రూపాలు కావాలని వుంది?" అని అడిగాడు.

"పద్మపాదా! వాళ్లను ఏనుగులుగా మార్చండి. ఆ కనబడే అడవిలో నిర్భయంగా బ్రతకగలరు," అన్నాడు పింగళుడు.









"ఏనుగు రూపాలా? మహామాంత్రికా వద్దు. వద్దు!" అంటూ మహామాయుడి శిష్యులిద్దరూ ఏక కంఠంతో అరిచారు. "ఆ రూపాల్లో మేము ఆకూ అలములూ తప్ప మాంసాహారం తినేందుకు అవకాశం లేదు! మాకు శాకాహారం పడదు; అది మా దేహాలకు విషతుల్యం!"

"అలా అయితే, మీలో ఒకరిని సింహం గానూ..." అంటూ పద్మపాదుడు, మహ మాయుడి శిష్యుల్లో ఒకడి నెత్తిమీద గదతో మోదాడు. మరుక్షణంలోనే వాడు సింహంగా మారిపోయాడు. "...మరొకణ్ణి పెద్దపులి గానూ, మారుస్తున్నాను!" అని పద్మ పాదుడు, రెండవవాడి తలమీద గదతో బాదాడు. వాడు వెంటనే పులిగా మారాడు.

పింగళుడు, ఓ త్రుటికాలం వాళ్లిద్దరికేసీ ఆశ్చర్యంగా చూసి, "ఇక మీకు కావలసి నంత మాంసాహారం! ఆ కనబడే అడవికి పొండి!" అంటూ, సింహాన్నీ, పెద్దపులినీ వీపులమీద తట్టాడు. వెంటనే క్రూరమృగాల రూపంలో వున్న మహామాయుడి శిష్యు లిద్దరూ, భీకరంగా గర్జిస్తూ, దాపులనేవున్న అడవికేసి పరిగెత్తారు.

పద్మపాదుడు, మహామాయుడి శిష్యుల కేసి కొద్దిసేపు చూసి, పింగళుడికేసి తిరు



గుతూ, "పింగళా! మనం ఎంతో మెలు కువగా వుండవలసివుంది! మన ప్రయత్నాన్ని విఫలం చేసేందుకే కాక, వీలయితే మన లను సంహరించేందుకూ కూడా, అనేక దుష్ట శక్తులు ప్రయత్నిస్తున్నవి. సరే, ఇక మన పని చూద్దాం! ఆ పాడుదేవళపు శిఖరం, నీకు స్పష్టంగా కనబడుతున్నది గదా?" అని అడిగాడు. పింగళుడు అవునన్నట్టు తల వూపి, ఆ దిక్కుకేసి చూశాడు.

"అయితే, నువ్విప్పుడా దేవళంలోని, మహామాయుడి సమాధిని చేరవలసివుంది. ఆ సమాధిలో నువ్వు ప్రవేశించే ముందు, నువ్వు దాటవలసిన ద్వారాల సంఖ్య ఆరు.






మొదటి ద్వారంవరకూ నేను రాగలను. ఆ ద్వారాన్ని నువ్వు తెరుచుకున్న తరవాత, తక్కిన అయిదు ద్వారాలనుకూడా తెరుచుకుని, మహామాయుడి సమాధిలో ప్రవేశించవలసినవాడివి, నీవు !" అన్నాడు.

పద్మపాదుడూ, పింగళుడూ ఒక్క చుక్క నీరైనా లేకుండా యింకిపోయిన, నదీగర్భంలోనుంచి నడిచి, పాడుదేవళాన్ని సమీపించారు. దేవళానికి వున్న మొదటి ద్వారం, చూపరులకు చాలా భయంకొల్పుతున్నది. పెద్ద దేవదారుచెక్కతో చేయబడిన తలుపులపై అనేక భయంకరాకృతులు చెక్కబడినై. రెండు తలుపులలోనూ బిగించబడిన, రెండు పెద్ద మేకులకు చుట్టుకుని, ఒక సర్పం పడగవిప్పి బుసలుకొడుతున్నది.



ఆ ఆరు ద్వారాలకూ రక్షకులుగా మహాభయంకరులైన మాయా రక్కసులు వున్నారు. వారిలో ప్రతిఒక్కరూ నిన్ను సంహరించేందుకు ప్రయత్నిస్తారు. నువ్వు వాళ్లను చూచి, ఏమాత్రం వెరపు కనబరిచినా, మన ప్రయత్నం వమ్ము కావటమేగాక, ప్రాణాపాయం కలిగే ప్రమాదంకూడా వుంది," అన్నాడు పద్మపాదుడు.

పింగళుడు జవాబివ్వలేదు. అతడి దృష్టి నదీగర్భాన గల పాడుదేవళంమీదనే వుంది. పద్మపాదుడు, అతడికేసి ఓమారు చూచి, "పింగళా, యిక మనం దేవళం దగ్గిరకు వెళదాం. దానికి గల ఆరు ద్వారాలలోనూ

పద్మపాదుడు, ఆ సర్పంకేసి చేయి చూపుతూ, "పింగళా, నువ్వు నిర్భయంగా ఆ సర్పాన్ని సమీపించి, దానిని రెండుసార్లు నీ చేతితో తాకవలసివుంది. ఆ తరవాత ద్వారం లోపలినుంచి, ఒక భీకరాకారం నిన్ను ప్రశ్నిస్తుంది. నువ్వు ఎవనివైనదీ నిర్భయంగా చెప్పిన తరవాత ద్వారం తెరుచుకుంటుంది. కాని...ఆ తరవాత ఏం జరగబోయేదీ నీకు చెప్పటమంటే





—నేను నా మంత్రశక్తిని కోల్పోవటమే నన్నమాట! కనుక, నువ్వు దేనికి భయపడకుండావుంటే, అన్ని ద్వారాలూ తెరుచుకుని, మహామాయుడి సమాధిలో అడుగుపెట్టే అవకాశం కలుగుతుంది. అక్కడి అపూర్వ వస్తువుల సంగతి తెలుసుగదా?" అన్నాడు.

"పద్మపాదా! నేను ఎటువంటి భీకర శక్తికి భయపడను. కాని, మోసం చేసి నన్ను హతమార్చ చూచే దుష్టశక్తు లేమీ, యీ పాడుదేవళంలో లేవు గదా?" అని ప్రశ్నించాడు పింగళుడు.

"కావాలనుకుంటే నిన్ను మోసగించకుండానే, యీ దేవళంలో వున్న శక్తులు నిన్ను హతమార్చగలవు. కాని, నీవు ఏమాత్రం భయపడకుండా ముందుకు వెళ్లినప్పుడు అవి నిన్ను ఏమీ చెయ్యలేవు. మహామాయుడి సమాధినుంచి, నువ్వు మనకు కావలసిన వస్తువులు సంపాయించిననాడు, నీకన్న యీ ప్రపంచంలో శక్తిమంతుడూ ధనవంతుడూ మరొకడుండడు," అన్నాడు పద్మపాదుడు.

"అందుకోసమేగదా, నేనిన్ని ప్రమాదాలకు ఎదురీదేందుకు సిద్ధమయాను!" అంటూ పింగళుడు ముందుకు నడిచాడు. అదే సమయంలో పద్మపాదుడు వెనుదిరిగి,



లోగడ తను సమాధినిష్ఠలో వుండి మంత్రం జపించిన చోటుకు వచ్చాడు.

పింగళుడు నిర్భయంగా ద్వారాన్ని సమీపించి, పడగ విప్పి బుసలుకొడుతూవున్న సర్పాన్ని, తన కుడిచేతితో రెండుసార్లు తాకాడు. అంత భయంకరసర్పమూ తల వంచి కదలామెదలక పూరుకున్నది. కాని, అదే క్షణాన తలుపుల వెనక భూమి దద్దరిల్లేలా కర్ణకఠోరమైన ధ్వనితో ఒక కర్కశ కంఠం యిలా ప్రశ్నించింది.

"లోపలకు రావటం ఎలాగో తెలియకుండానే, మహామాయుడి సమాధి ప్రథమ ద్వారాన్ని సమీపించిన పిరికిపంద ఎవడు?"







"నా పేరు పింగళుడు! నేను అవంతీ నగరపు జాలరిని! నా గురువు పద్మపాదుడు..."

"చాలు, చాలు! నీ గురువు ఎవరన్నది, నాకవసరంలేదు. నీవు జాలరి పింగళుడివి! ఇదిగో తలుపు తెరుస్తున్నాను!" అన్న శబ్దం అయింది. మరుక్షణాన తలుపులు రెండూ బార్లా తెరుచుకున్నవి. పర్వతాకారంలో వున్న నల్లనివాడొకడు తళతళలాడే కత్తి చేబట్టి, ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు. పింగళుడు ముందుకు నడిచాడు.

సరిగా కత్తివేటుకు అందే దూరంలోకి పింగళుడు రాగానే, పర్వతాకారుడు 'హుం' అని హుంకరిస్తూ, "నువ్వు జాలరి పింగళుడివా? అయితే, మెడ చాచు, ఒక్క వేటుకు నీ కుత్తుక తెగేలా, యీ కత్తితో నరుకుతాను!" అన్నాడు.

కనురెప్పపాటులో, పింగళుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. ఇంతదూరం వచ్చి వెను దిరగటం ఎలానూ ప్రాణాపాయం అని అతడికి అర్థమైంది. అలా అని, మెడచాచినా, ఆ మహాకాయుడి కత్తికి అది తెగి కింద దొర్ల వచ్చును. ఏమైనా కానీ, అనుకుంటూ, పింగళుడు ఒక అడుగు ముందుకు వేసి మెడ వంచాడు. తక్షణం పర్వతాకారుడి చేతినుంచి కత్తిజారి కిందపడి, ఖంగుమని శబ్దం చేసింది. అతడు, పింగళుడి ముందు శవంలాగా ఢఢీమంటూ బోర్లా పడిపోయాడు.

ఇలా జరిగేసరికి, పింగళుడికి ఎక్కడ లేని సత్తువా, ధైర్యం కలిగినట్టయింది. అతడు మాటిగాచూస్తూ మొదటి ద్వారం దాటి, రెండవ ద్వారాన్ని సమీపించాడు. ఆ ద్వారం తలుపులుకూడా బంధించివున్నవి. చేతిలో పెద్ద శూలం ధరించిన ఒక గుర్రపురౌతు, పింగళుణ్ణి చూస్తూనే, మాటామంతీ లేకుండా, శూలాన్ని గురిగా పింగళుడి గుండెలపైకి ఎత్తాడు. పింగళుడు నిర్భయంగా గుండెలమీద వున్న చొక్కాను









పక్కకు తొలిగించి, "నే నెవరో తెలుసా ? జాలరి పింగళుణ్ణి!" అంటూ ముందుకు నడిచాడు. మరుక్షణం గుర్రంతోపాటు, రౌతుకూడా కుప్పలా భూమిలోకి కుంగి పోయాడు. పింగళుడు, యినుమడించిన వుత్సాహంతో రెండవ ద్వారం దాటి మూడవ ద్వారాన్ని సమీపించాడు.

ఈ మూడవ ద్వారంముందు ఒక విలుకాడు, బాణం ఎక్కుపెట్టి, పింగళుడికేసి చూస్తూ నిలబడివున్నాడు. పింగళుడు తొణకకుండా ముందుకు నడుస్తూ, విలుకాడికి తన ఫాలభాగం వేలితో కొట్టి చూపించాడు. ఉత్తరక్షణంలో విలుకాడు పెద్దగా అరిచి పక్కకు పడిపోయాడు. పింగళుడు మూడవ ద్వారం దాటాడు.

నాలుగవ ద్వారాన్ని, పింగళుడు సమీపించ నున్నంతలో భీకరమైన అంకెలు వినిపించినై. ద్వారానికి అటూ యిటూ నిలబడివున్న రెండు ఖడ్గమృగాలు తలలువంచి, పింగళుడిమీదికి దూకేందుకు బుసలుకొడుతున్నాయి. పింగళుడు చలించకుండా ముందుకు నడిచి, ఆ ఖడ్గమృగాలను రెండు చేతులతోనూ అంటుకున్నాడు. వెంటనే అవి రెండూ భగ్గుమని ఒక్కసారి మండి బూడిదకుప్పలా అయిపోయినై.

పింగళుడు అయిదవ ద్వారాన్ని సమీపించేసరికి, అక్కడ అతడికి కనబడిన వింత మృగం, అతడిలో భయానికన్న, ఆశ్చర్యం ఎక్కువ కలిగించింది. దాని శరీరం, వెనక కాళ్లూ సింహాకృతిలో వున్నవి. తలా, ముందుకాళ్లు మాత్రం గద్దను పోలివున్నవి. "ఇది ఏమి మృగం?" అని పింగళుడు అనుకునేంతలో, ఆ గరుడసింహం వెనక కాళ్లమీద లేచి, రెక్కలు అల్లల్లాడిస్తూ, పింగళుడిమీదికి వురకబోయింది.

పింగళుడు, ఓ తృటికాలం నిశ్చేష్టుడై, అంతలోనే తెలివి తెచ్చుకుని, "దారి తొలుగు! నేను జాలరి పింగళుణ్ణి!" అంటూ







ముందుకు అడుగువేశాడు. గరుడసింహం తపీమని పేలి, తునాతునియలై పోయింది. పింగళుడు, దానికేసి ఓమారు జాలిగా చూసి, అయిదవ ద్వారాన్ని దాటి, ఆరవ ద్వారాన్ని సమీపించాడు.

ఈ ఆరవ ద్వారం దాటగలిగితే, తను మహామాయుడి సమాధిలో ప్రవేశించగలనన్న సంగతి గుర్తుకు రాగానే, పింగళుడికి పరమానందమయింది. వుంగరం, వజ్రాలు తాపిన పిడిగల కత్తి, భూగోళం—యీ మూడూ తనవి కానున్నవి!

పింగళుడు, అంతు లేని వుత్సాహంతో ఆరవ ద్వారాన్ని సమీపించాడు. అతడికి హఠాత్తుగా కన్ను చెదిరినట్టయింది. ఎదురుగా, ద్వారం పక్కన పద్మపాదుడు గద చేబూని నిలబడివున్నాడు. పింగళుడు మైకం కమ్మినవాడిలా ముందుకు అడుగు వేయబోయేసరికి, "ఆగు, ఆగు! నువ్వెవరివి?" అన్న భీకరమైన కంఠస్వరం వినబడింది. 'నన్ను మోసపుచ్చేందుకు, ఏదో పిశాచి పద్మపాదుడి ఆకృతి దాల్చింది!' అని పింగళుడు అనుకునేంతలో, ధగధగ మెరుస్తున్న గద, అతడి నేత్రాలముందు కదిలింది. పింగళుడు, భయకంపితుడై వెనక్కు అడుగువేశాడు.

"ఎవడో దొంగ, జాలరి పింగళుడు కాదు! బయటికి గెంటండి! దూరంగా విసిరివేయండి!" అన్న కేకలు పింగళుడికి వినిపించినై. ఆ వెంటనే. అతడి వీపుమీదా, తలమీదా కర్రతో. చేతులతో ఎవరో మోద సాగారు. ఒక్కొక్క ద్వారమే టకటకమని మూసుకోసాగింది. పింగళుడు, భయంతో వణికిపోతూ, కళ్లు తెరిచేంతలో, అతడు గాలిలో ఎగిరిపోతున్నాడు. అతడి దృష్టి కిందకు మళ్లింది. అక్కడ పద్మపాదుడు చేతులు చాచి, తను కింద పడకుండా పట్టుకునేందుకు సిద్ధంగా వున్నాడు.

—(ఇంకా వుంది.)








# 7

[పింగళుడు పాడుదేవళంలోని, మొదటి ద్వారాన్ని దాటి రెండవ ద్వారం సమీపించి, అక్కడ పర్వతాకారుడికి తను ఎవరైందీ చెప్పి, ఆ ద్వారాన్నికూడా అధిగమించాడు. కాని ఆరవ ద్వారం దగ్గిర మాయాపద్మపాదుడి రూపంలో వున్న రక్కసివల్ల అతడికి ప్రమాదం కలిగింది. అతడు దేవళంనుంచి గాలిలోకి విసిరివేయబడ్డాడు. తరవాత—]

పద్మపాదుణ్ణి చూడగానే పింగళుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. అతడు తన కిక ప్రాణభయం లేదని గ్రహించాడు. అంతలో పద్మపాదుడు, పింగళుణ్ణి కింద పడకుండా చేతులతో అదుకుని, మెల్లగా భూమిమీద నిలబెట్టాడు.

"పింగళా, ఏం జరిగింది? ప్రమాదకరమైన దెబ్బలేమీ తగలలేదుగదా?" అంటూ పద్మపాదుడు ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"దెబ్బల మాట తరవాత చూద్దాం. ముందు ప్రాణాలతో బయటపడ్డాను. అంతే చాలు," అని, పింగళుడు వెనుదిరిగి పాడు దేవళంకేసి చూశాడు. అతడు చూస్తూండగానే, అంతవరకూ ఒక్క నీటిచుక్కకూడా లేకుండా యింకిపోయిన నది, బుస్సుమంటూ ఒక్కసారి జలంతో పొంగసాగింది.

పద్మపాదుడు, పింగళుడి భుజంమీద చేయి వేసి, "పింగళా, యీసారికి మనం ఓడిపోయాం. మహామాయుడి శిష్యులు తిరిగీ నదిని జలంతో నింపుతున్నారు. దేవాలయం కూడా అందులో మునిగిపోతుంది. అయినా, మనం కావాలనుకున్ననాడు, తిరిగీ నదీ







జలాన్ని యింకింపచేయుగలం. ముందు, నీ అనుభవాల సంగతేమిటో చెప్పు?" అన్నాడు.

పింగళుడు, తను మొదటి ద్వారం దాటి, ఆరవ ద్వారాన్ని సమీపించేవరకూ జరిగిన సంఘటనలన్నీ పద్మపాదుడితో చెప్పాడు.

"ఆ ఆరవ ద్వారందగ్గిర అంత తెలివి గల భూతం కావలి వుంటుందని నేననుకో లేదు. హఠాత్తుగా, మీ ఆకృతి అక్కడ కనిపించింది. 'ఆగు, ఆగు. నువ్వెవరివి?' అని నన్ను ప్రశ్నించిన కంఠస్వరంకూడా మీదే! నేను ఒక్క తృటికాలం సంశ యించాను. యీలోపల హఠాత్తుగా కళ్ళు మిరుమిట్లు కొలిపే గద ఒకటి మెరిసింది. నేను కళ్ళు మూసుకున్నాను. అంతే, నా వీపుమీదా, తలమీదా దభీదభీమని దెబ్బలు పడసాగినై. ఎవరివో బలమైన చేతులు నన్ను పడిసిపట్టుకుని, ఆకాశంలోకి విసరివేసినై. కింద పడకుండా, మీరు నన్ను పట్టుకుని, కాపాడారు," అన్నాడు పింగళుడు.

"అలాగా!" అంటూ పద్మపాదుడు కళ్ళెర్రచేసి, నదీజలంలో మునిగిపోతున్న పాడుదేవళంకేసి ఓసారి చూశాడు. "పింగళా! మహామాయుడి శిష్యులు యింత నీచానికి ఒడికట్టుతారని నేననుకో లేదు. నీ గురువునైన, నా ఆకృతిలో మాత్రమే వాళ్లు నిన్ను మోసపుచ్చగలిగారు. అంతకు ముందు వాళ్ళు నిన్ను భయ పెట్టేందుకు ప్రయోగించిన ప్రతి దుష్టశక్తిని నువ్వు జయించావు. అది నాకు చాలా ఆనందం కలిగిస్తున్నది!" అన్నాడు.

పద్మపాదుడి మాటలు, పింగళుడికి చాలా వుత్సాహం కలిగించినై. అతడు పాడుదేవళంకేసి చూచి, "ఇప్పుడు చేయ వలసిందేమిటి? దేవాలయం మళ్ళీ నదీ గర్భంలో మునిగి పోతున్నది!" అన్నాడు.

"ఈ రోజుకు యింక మనం చేయ గలిగిందేమీ లేదు. నేటినుంచి మూడు రోజుల తరవాత మళ్లీ పర్వదినం ఒకటి





రానున్నది. అనాడు తిరిగి నీవు మహా మాయుడి సమాధిలో ప్రవేశించవచ్చు. అంతవరకూ మనం యిక్కడే వుండవలసి వుంది. యీలోపల మనకు కాలక్షేపం జరిగేందుకు..." అంటూ పద్మపాదుడు, చేతనున్న గవను గాలిలో తిప్పి, ఏదో మంత్రం పఠించాడు. మరుక్షణంలోనే, ఆ నిర్జన ప్రదేశాన ఒక ఎత్తయిన సుందర భవనం లేచి నిలబడింది.

ఆశ్చర్యంగా ఆ మాయాభవనంకేసి చూస్తున్న పింగళుడి చేయి పట్టుకుని, పద్మపాదుడు అతణ్ణి భవనంకేసి నడిపాడు. వారిద్దరూ భవన ప్రాంగణాన్ని సమీపించేంతలో, తక్కున ద్వారం తెరుచుకున్నది. ఆజానుబాహులైన యిద్దరు కాలదేహులు బయటికి వస్తూ పద్మపాదుడికీ, పింగళుడికీ నమస్కరించారు.

"పద్మపాదా, వీళ్లెవరు?" అన్నాడు పింగళుడు అనుమానంగా.

"వీళ్లు, మనకు యీ మూడు రోజులూ వినోదం కలిగించేందుకు వచ్చిన మాయా రక్కసులు. మనం యిక్కడ వూరికే గోళ్లు గిల్లుకుంటూ కూర్చోలేంగదా? యీ పిశాచమల్లులకు, కుస్తీ, కర్ర కత్తియుద్ధాలు పెట్టి వినోదిద్దాం!" అన్నాడు పద్మపాదుడు.



పింగళుడూ, పద్మపాదుడూ భవనంలో ప్రవేశించారు. వాళ్లిద్దరూ ఒక ద్వారంనుంచి, ఒక పెద్ద గదిలోకి ప్రవేశిస్తూండగా, పింగళుడికి అక్కడ అనేకమంది మల్లులూ, యోధులూ కసరత్తులు చేస్తూండటం కనిపించింది. అతడు వారికేసి చూస్తూ, "పద్మపాదా, వీళ్ళందరూ కలిసి మనకేమైనా హాని తలపెట్టరుగదా?" అన్నాడు.

"అలాంటి భయం నీకేమీ అవసరం లేదు!" అంటూ పద్మపాదుడు ముందుకు నడిచి, మొదట కనిపించిన కాలదేహులతో మెల్లిగా ఏమో చెప్పాడు. వాళ్ళు వెంటనే అక్కణ్ణించి హుటాహుటిగా వెళ్లిపోయారు.







పద్మపాదుడూ, పింగళుడూ ఆ పెద్ద గదిలో వున్న పట్టుపరుపుల మెత్తలకు ఆనుకుని కూర్చున్నారు. కొద్దిసేపట్లో వారిదగ్గిరకు, బంగారు పళ్ళెరాల్లో వివిధ భోజనపదార్థాలు పెట్టుకుని అపురూప సౌందర్యవతులైన కొందరు స్త్రీలు వచ్చారు. పింగళుడు వారిని చూస్తూనే, "పద్మపాదా! వీళ్లు గంధర్వ కాంతలా, లేక ఆ రూపాలు ధరించిన పిశాచినులా?" అని ప్రశ్నించాడు.

పద్మపాదుడు, 'ఉష్' అని పింగళుణ్ణి వారిస్తూ, "పింగళా, అంత పెద్దగా మాట్లాడకు. పిశాచినులు ఏమైనా అనుకోగలవు. మనకు దాస్యం చేసేందుకు వచ్చిన పిశాచినులనైనా సరే మనం కించెపరచటం మంచిదికాదు. వాళ్లను, యీ మూడు రోజులూ గంధర్వకాంతలుగానే సంభావిద్దాం!" అన్నాడు.

తరవాత పద్మపాదుడూ, పింగళుడూ భోజనాలు ముగించారు. అంతలో, కాలదేహులు యిద్దరూ కొందరు పిశాచమల్లులనూ, యోధులనూ అక్కడికి తీసుకు వచ్చారు. వాళ్లు వివిధ రూపాలు ధరిస్తూ కుస్తీ, కత్తియుద్ధాలు చేసి, పింగళుడికీ, పద్మపాదుడికి వినోదం కలిగించారు.

ఈ విధంగా మూడు రోజులు గడిచిపోయినై. నాలుగవనాడు పద్మపాదుడు, ఆ మాయాభవనాన్నీ, అందులో వున్న మాయారూపుల్నీ, తన మంత్రబలంచేత మాయంచేసి, యింతకు పూర్వం తను నదిదగ్గిర కూర్చుని, మంత్రం పఠించిన చోటుకు వెళ్లాడు.

పద్మపాదుడు యిప్పుడు నదీగర్భంలో మునిగిపోయివున్న పాడుదేవళంకేసి చేయి చూపుతూ, "పింగళా, నేను నదీజలాన్ని యింకింప చేస్తాను. యీసారి నువ్వు మహామాయుడి సమాధిలో ప్రవేశించేప్పుడు, తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి నేను మళ్లీ చెప్పనవసరంలేదు గదా?" అన్నాడు.







"పద్మపాదా, అలాంటి అవసరం ఏమీ లేదు. లోగడ తిన్న దెబ్బల కణుతులు యింకా కరిగికూడా పోలేదు. నేను ఏం మరచి పోయినా, ఆ దెబ్బల బాధా, మీ రూపంలో నన్ను మోసగించిన, మహామాయుడి శిష్యుడి ముఖ కవళికలూ మాత్రం మరవను! యీసారి వాడి అంతు తేలుస్తాను," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు మంత్రం జపించి, కొద్ది సేపట్లోనే నదీజలాన్ని యింకింప జేశాడు. పింగళుడు, నిర్భయంగా పాడుదేవళపు మొదటి ద్వారాన్ని సమీపించి, బుసలు కొడుతున్న పాముపడగమీద చెయ్యివేశాడు. అది వెంటనే ప్రాణం వదిలి కింద పడి పోయింది. తక్షణం, తలుపుల వెనకనుంచి కర్ణకఠోరమైన ధ్వనితో ప్రశ్న వినబడింది.

"నా పేరు పింగళుడు! నేను అవంతీ నగరపు బాలరిని!" అంటూ పింగళుడు ధైర్యంగా తలుపులను నెట్టాడు. తలుపులు తెరుచుకున్నవి. పర్వతాకారంలో వున్న నల్లనివాడు కత్తి ఝళిపిస్తూ ముందుకు వచ్చాడు. అతడు, పింగళుణ్ణి మెడ చాచ మనటం, పింగళుడు మెడ చాచటం— పర్వతాకారుడు దభీమంటూ పడిపోవటం. అంతా పూర్వ పద్ధతిగానే జరిగింది.




పింగళుడు, ఒక్కొక్క ద్వారాన్నే దాటి, చివరకు ఆరవ ద్వారాన్ని సమీపించేంతలో, ద్వారంపక్కనే, పింగళుడి తల్లి కళ్ళ నీళ్లు కారుస్తూ, "నాయనా, ఎందుకు వచ్చిన శ్రమ. వెనుదిరిగి పో! ఆ పద్మపాదుడు నిన్ను హతమార్చాలని చూస్తున్నాడు," అన్నది దీనాతిదీనంగా.

పింగళుడు నివ్వెరపోయాడు. ఆ వెంటనే అతడికి గత అనుభవం గుర్తుకు వచ్చింది. లోగడ తనను పద్మపాదుడి రూపంలో మోసగించిన పిశాచమే, యిప్పుడు తన తల్లిరూపం ధరించి మాయచేయ చూస్తున్న దని అతడు నిర్ణయించుకున్నాడు.




31





"దారితొలుగు. నువెవ్వరో నాకు తెలుసు! నా తల్లిరూపం ధరించినా, నన్ను మోసగించలేవు!" అంటూ పింగళుడు ద్వారంపక్కన వున్న కత్తినొకదానిని తీసుకుని ముందుకురికాడు. మాయారూపంలో వచ్చిన పిశాచి కెవ్వున కేకవేసి, వెంటనే మాయమయింది.

పింగళుడు పెద్దగా నవ్వి, కత్తిని దూరంగా గిరవాటువేసి ద్వారం దాటాడు. ఎదురుగా పట్టుతెరలు గాలికి రెపరెపలాడుతూ కనిపించినై. సన్నని ఆ తెరల వెనకనుంచి కాంతులు వెదజల్లుతున్న ఉన్నతాసనం ఒకటి కనిపించింది.

పింగళుడు పట్టుతెరలు తొలగించుకుని లోపలకు వెళ్ళాడు. రత్నమాణిక్యాల కాంతిలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న సింహాసనంమీద మహామాయుడు యోగనిద్రలో వున్నట్టు కళ్ళు మూసుకుని కూర్చుని వున్నాడు. పింగళుడికి, ఓ క్షణకాలం మహామాయుడు సజీవుడేమో అన్న అనుమానంకూడా కలిగింది. అతడు గాలి పీల్చుకునేందుకూడా వెరిచి, అడుగులో అడుగు వేసుకుంటూ మహామాయుణ్ణి సమీపించాడు. అతడి దృష్టి, మహామాయుడి కుడిచేతి వేళ్ళమీదకు పోయింది. అక్కడ, కాంతికిరణాలను వెదజల్లుతున్న అతడి వేలి వుంగరం పింగళుణ్ణి ఆకర్షించింది.

పింగళుడు, నిర్భయంగా, మహామాయుడి కుడిచేతి వేలినుంచి వుంగరాన్ని వూడదీశాడు. ఇంక తనకు కావలసినవి రెండు వస్తువులు!. వజ్రాలు తాపిన పిడిగల కత్తి, మహామాయుడి నడుముకు వేలాడ కట్టబడి వుంది. పింగళుడు దాన్ని వరతో కూడా తీసుకుని తన నడుముకు బిగించుకున్నాడు. ఇక, కావలసింది, భూగోళం!

పింగళుడు, నలువైపులా కలయచూచాడు. అతడికి ఒక మూలగా మెట్లు కనిపించినై. ఆ మెట్లకు దిగువగా, ఒక







ఎత్తయిన బల్లమీద గుండ్రని చంద్ర బింబంలా మెరుస్తూన్న భూగోళం కనిపించింది. పింగళుడు దాన్ని సమీపించి గోళంలోకి చూశాడు. అందులో, వివిధ దేశాలూ, వాటి సరిహద్దులూ, పనిపాట్లలో మునిగి వున్న ఆయా దేశ ప్రజలూ, అతడి దృష్టికి స్పష్టంగా కనిపించారు.

మహామాయుడి సమాధినుంచి తను సంగ్రహించవలసిన మూడు వస్తువులూ పింగళుడికి లభించినై. అతడు భూగోళాన్ని భద్రంగా అందుకుని భుజంమీద పెట్టుకుని, ఆఖరిసారిగా మహామాయుడు కూర్చునివున్న సింహాసనానికేసి చూసి, బయటికి బయలుదేరాడు.

పింగళుడు, మహామాయుడి సమాధి గదినుంచి బయటికి నడిచేంతలో, ఎక్కడినుంచో చెవులకు విందుచేసే చక్కని గానం వినబడింది. "భేష్, పింగళా! నీ ధైర్యసాహసాలూ, తెలివితేటలూ మా అందరి మెప్పునూ పొందినై!" అన్న మృదువైన కంఠస్వరం, పింగళుడికి వినబడింది. ఆ కంఠస్వరం మహామాయుడిదేమో అనుకుని పింగళుడు వెనుదిరిగి చూశాడు. కాని, మహామాయుడిలో ఏమీ చలనం లేదు.

పింగళుడు అన్ని ద్వారాలూ దాటి బయటికి రాగానే, పద్మపాదుడు వుత్సాహంగా చప్పట్లు చరిచి, "పింగళా, మనం జయించాం! ఇక, యీ ప్రపంచంలో మన శక్తికి తిరుగులేదు," అంటూ ముందుకు పరిగెత్తుకుంటూ వచ్చాడు. అదే సమయంలో, నదీగర్భంనుంచి అగ్నిపర్వతం బద్దలయినట్టుగా పెద్ద ధ్వని వినబడింది. మరుక్షణం, తాటిచెట్టు ప్రమాణంలో నీటి ధార ఒకటి భూమిలోంచి లేచింది. పద్మపాదుడు, దానిని చూస్తూనే అదురుకుని, వెనక్కు ఒక గంతువేశాడు.

(ఇంకా వుంది)








## 8

[పింగళుడు మరోసారి పాడుదేవళంలో ప్రవేశించి, అక్కడ వున్న దుష్టశక్తులను జయించి, మహామాయుడి సమాధిని చేరాడు. తరవాత, మహామాయుడి వేలినున్న ఉంగరాన్ని, వజ్రాలుతాపిన పిడిగల కత్తిని, భూగోళాన్ని తీసుకుని సురక్షితంగా బయటికి వచ్చారు. అంతలో నదీగర్భంనుంచి పెద్ద ధ్వనితో నీటిధార ఒకటి లేచింది. తరవాత—]

అంత గొప్ప మాంత్రికుడైన పద్మపాదుడు, నదీగర్భంనుంచి పైకి లేచిన నీటిధారను చూచి. అదిరిపడి వెనకడుగు వేయటం, పింగళుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. అతడు పద్మపాదుడి పక్కనే నిలబడి నిర్భీతిగా ఆ నీటిధారకేసి చూస్తూ, "పద్మపాదా! కావాలంటే ప్రపంచంమొత్తాన్నే దాసోహం అనిపించుకోగల శక్తులు మనదగ్గిర వున్నవి గదా? అటువంటప్పుడు, ఆ నీటిధారను చూచి మనం భయపడవలసిందేమి వున్నది?" అన్నాడు.

పింగళుడి ప్రశ్న వింటూనే పద్మపాదుడు కొంత కుదుటపడ్డాడు. అతడు పింగళుడి కేసి తిరిగి, ఆప్యాయంగా అతడి భుజం తడుతూ, "పింగళా, నీవంటి యువవీరుడు నా పక్కన వుండగా, నేను దేనికీ భయపడను. ఏ మంత్ర తంత్రాలూ తెలియని నువ్వు కనబరచిన తెగువతనం, నిర్భయత్వం అమోఘం. నేను, ఆ నదీగర్భం నుంచి లేచిన నీటిబుగ్గను చూచి భయపడటం లేదు. కాని...." అంటూ పద్మపాదుడు, మరోసారి నదీగర్భంకేసి చూశాడు.







"సంశయిస్తారెందుకు? సంగతేమిటో చెప్పండి!" అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు ఓ చిరునవ్వు నవ్వి, "మనం మహామాయుడినుంచి అన్ని అద్భుత శక్తుల్ని సంగ్రహించాం. ఆ కారణంవల్ల ఈ భల్లూకపర్వత ప్రాంతాల్లో ఇంతకు ముందు విచ్చలవిడిగా విహరిస్తున్న దుష్ట శక్తులన్నీ శక్తిహీనం కావలిసింది. కాని, అలా జరగకపోగా, మరింతగా ఆ శక్తులు విజృంభిస్తున్నవి. దీనికి కారణం ఇప్పటిగ్గాని అవగాహన కాలేదు." అన్నాడు.

పింగళుడు తనకేమీ తెలియలేదన్నట్టుగా తల పంకించాడు. పద్మపాదుడు తిరిగి ఏమో చెప్పబోయేంతలో, పొంగులువారుతున్న నదీజలంమీద అనేక భీకరాకారాలు వివిధాయుధాలు ధరించి వికృతంగా అరుస్తూ పోరాటం ప్రారంభించాయి.

ఆ దృశ్యం చూస్తూనే పింగళుడు నిలువెల్లా నీరయిపోతూ, "పద్మపాదా! ఇప్పుడేం దారి? నా జీవితంలో— ఆఖరుకు కలలో కూడా ఇన్ని వికృతాకారాల్ని చూడలేదు. వీటిమీద, మనం సంపాయించిన మహాశక్తి సంపన్నమైన ఆయుధాలను ప్రయోగించవలసిందేనా?" అన్నాడు.

పద్మపాదుడు ఓ క్షణకాలం తలవంచుకు ఊరుకుని, "ఊహూఁ" అంటూ తలాడించి పింగళుడికేసి చూస్తూ, "ఇంతవరకూ వీటిని అదుపాజ్ఞల్లో ఉంచిన మహామాయుడి సమాధిని మనం చేరగలిగాం. అతడి శక్తులు కూడా మనవశం అయాయి. కనుక, ఇప్పుడు ఈ దుష్టపిశాచగణానికి నాయకుడు లేడు. అవన్నీ నాయకత్వంకోసం పోరాడుతున్నవి. మనం ఒక పనిచేస్తే బావుంటుంది. భల్లూకకేతుడి సంగతి నువ్వు మరిచిపోలేదుగదా?" అన్నాడు.

"భల్లూకకేతుడా! అతణ్ణి ఎలా మరవగలను. అతడు ఒకప్పుడు ఈ పర్వతప్రాంతాలకు అధిపతిననికూడా చెప్పాడు. మనం,







తిరుగుప్రయాణంలో అతడికి లోహశృంఖలాలనుంచి విముక్తి కలిగిస్తామని మాట కూడా ఇచ్చాం!" అన్నాడు పింగళుడు.

"అదీ సంగతి! మనం అతడికి ఇచ్చిన మాట నిలుపుకునేందుక్కూడా ఇదే మంచి అదను. ఈ భల్లూకపర్వత ప్రాంతాలకు అధిపతి అంటూ ఎవడూ లేకపోతే, ఈ చిన్నా పెద్ద భూతాలు, తమలో తాము తగవులాడి, ఈ పరగణా అంతా అల్లకల్లోలం చేయగలవు. కనుక, మనం తిరిగి ఆ భల్లూకకేతుడికి వీటిమీద ఆధిపత్యం ఇద్దాం," అన్నాడు.

"చాలా మంచి యోచన. అలాగే చేయండి," అన్నాడు పింగళుడు.

"అయితే, నువ్వు వెంటనే బయలుదేరు. ఆ అడవిలో ఉన్న కొలనుప్రాంతం నీకు తెలిసిందేగదా? అతణ్ణి బంధవిముక్తుణ్ణి చేసి ఇక్కడకు తీసుకురా!" అన్నాడు పద్మపాదుడు.

పింగళుడు సరేనన్నాడు. పద్మపాదుడు తన మొలనున్న మహామాయుడి వజ్రాలు తాపిన పిడిగల కత్తిని పింగళుడికి ఇస్తూ, "నీకు వాహనంగా ఆ పిశాచగార్దభం ఉంటుంది. ఈ కత్తి సాయంతో నువ్వు భల్లూకకేతుడిని సమీపించకుండానే అతడిని బంధించివున్న ఇనప సంకెళ్లను పూడ కొట్టవచ్చు! ఇదిగో నీ వాహనం!" అంటూ గదను గాలిలో తిప్పాడు. వెంటనే భూమి విచ్చుకుని, అందులోనుంచి ఓండ్రిస్తూ పిశాచగార్దభం బయటికి గెంతింది.

పింగళుడు, మహామాయుడి కత్తిని చేబూని పిశాచగార్దభంమీద కూర్చున్నాడు. గార్దభం గాలిలోకి లేచింది. కొండలూ, నదులూ, అడవులూ, దాటి కొద్దిసేపట్లోనే పింగళుడు, భల్లూకకేతుడు బంధింపబడి వున్న కొలనుప్రాంతం చేరాడు.

కత్తి చేతబట్టి, గాడిదమీద ఎక్కి గాలిలో ఎగురుతున్న పింగళుణ్ణి చూస్తూనే భల్లూక





కేతుడు పెద్దగా మూలిగి, "అయ్యో, ప్రభో, దేవా, గార్దభేంద్రా! నన్ను రక్షించండి. ఈ యినపగొలుసులు బద్దలుకొట్టి పుణ్యం కట్టుకోండి!" అంటూ అరవసాగాడు.

పింగళుడు పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతూ, కొలను ఒడ్డునే గార్దభం మీంచి దిగి, "భల్లూకా! నేను ఏదో దేవుణ్ణనుకుని నాకు గార్దభేంద్ర బిరుదు యిస్తున్నట్టుంది. నేను మనిషిని. లోగడ నన్ను ఒకమారు చూచావు. నాపేరు పింగళుడు!" అన్నాడు.

"మీరు పింగళులా...అయ్యో, ఇప్పుడు గుర్తుకొచ్చింది. మహామాయుడి సమాధి మీదికి దారి వెదలిన ఆ ఘన మంత్రవాది పద్మపాదుడు మీ గురువుగదా?" అన్నాడు భల్లూకకేతుడు.

"అవును, నీ జ్ఞాపకశక్తి మెచ్చదగిందే!" అన్నాడు పింగళుడు.

"అయ్యో, ప్రభూ! ఆ మంత్రవేత్త సుఖంగా వున్నారా? మహామాయుడి సమాధిలో ప్రవేశించటం సాధ్యమైందా?" అని అడిగాడు భల్లూకకేతుడు ఆదుర్దాగా.

"ఆ సమాధిలో ప్రవేశించింది నేను. యిదిగో ఆ మహామాయుడి మంత్రశక్తి గల ఖడ్గం!" అంటూ పింగళుడు తన చేతనున్న కత్తిని ఝుళిపించి, దాని కొనను భల్లూకకేతుడికేసి సూటిగా గురిపెట్టాడు.



మరుక్షణంలోనే కళ్లను మిరుమిట్లు కొలిపే కాంతిరేఖలు, మెరుపు వేగంతో కత్తి నుంచి బయలుదేరి, భల్లూకకేతుడిని బంధించివున్న ఇనపగొలుసును తాకినై. తక్షణం ఆ ఇనపగొలుసు పరితాడులా ఒక్కసారి భగ్గుమని మండి బూడిద అయి, నుసిగా మారి రాలిపోయింది.

భల్లూకకేతుడు తన మహాకాయాన్ని ఒక్కసారి విదిలించుకుని, లేచి నిలబడ్డాడు. అతడు కృతజ్ఞత పుట్టిపడే నేత్రాలతో, పింగళుణ్ణి సమీపించి, అతడికి సాష్టాంగపడుతూ, "ప్రభూ! మీరు నన్ను బంధవిముక్తుణ్ణి చేసి, ఎంతో కాలంగా నే పడుతున్న యాతననుంచి నన్ను కాపాడారు. మీ దయవల్ల నేను నరకబాధనుంచి బయటపడ్డాను. ఈ ఘడియనుంచి నేను మీకు దాసుణ్ణి! ఏమి సెలవు!" అన్నాడు.

"మనం యిప్పుడే బయలుదేరి వజ్రపాదుణ్ణి చేరాలి. మహామాయుడు తన శక్తిని కోల్పోయిన తరవాత, భల్లూక పర్వత లోయలో గల చిన్నా పెద్ద పిశాచాలు నాయకత్వంకోసం గుద్దులాడుకుంటున్నై. నీ వంటి బలవంతుణ్ణి, శక్తిమంతుణ్ణి తిరిగి ఆ క్షుద్రజీవాలకు నాయకుడుగా చేయాలని వజ్రపాదుడి అభిప్రాయం. అలా కానప్పుడు ఆ పిశాచాలు ఊళ్లనూ, రాజ్యాలనూ పంచు





కుని ఈ ప్రాంతాలను నానా కశ్మలం చేయవచ్చు." అన్నాడు.

పింగళుడి మాటలు వింటూనే భల్లూకకేతుడు వెలవెలపోయాడు. అతడు రెండు చేతులూ జోడించి, పింగళుడికి నమస్కరిస్తూ, "ప్రభూ! ఇక నాకు ఈ భూతగణం మీద నాయకత్వం వద్దు. ఆ పదవి అనుభవించటం ఎంత బాధాకరమో నాకు తెలిసివచ్చింది. ఏ మంత్రవేత్తో, లేక ధైర్యసాహసాలు గల యువకుడో మామీదకు దాడి రావటం, మేము యిన్ని శక్తులూ, కుయుక్తులూ ఎరిగివుండికూడా—వాళ్ల ధాటికి తట్టుకోలేక ఎక్కడికో పారిపోవటం—అదీ మా జీవితం! నేను, ఈ నాటినుంచి మానవులను సేవించి బతకదలిచాను! మానవుల్లో మీరు అతి సాహసోపేతులని నాకు తెలిసివచ్చింది. నన్ను మీ దాసుడుగా స్వీకరించండి. కావాలంటే, మీ దగ్గరవున్న ఇతర దాసులమీదా, బానిసలమీదా నాకు నాయకత్వం ఇవ్వండి!" అన్నాడు.

"భేష్, నీ భక్తికీ, వినయానికీ మెచ్చాను. కాని, నన్ను ఎలా ఉపయోగించుకోవాలన్నది, నేను తేల్చగల సమస్య కాదు. పద్మపాదుడితో ముందుగా మాట్లాడి, ఆయన ఉద్దేశం ఏమిటో కనుక్కోవలసివుంది. ఇక బయలుదేరు!" అన్నాడు పింగళుడు వెనుదిరుగుతూ.

పింగళుడు ఇలా చెప్పి, తన పిశాచగార్దభాన్ని ఎక్కి కూర్చోబోయేంతలో భల్లూకకేతుడు, పిశాచగార్దభం నడుము పట్టుకుని, "ప్రభూ! మీవంటి గొప్పవారూ, గౌరవనీయులూ ఇలాంటి క్షుద్రపిశాచాలను వాహనంగా వాడుకోవటం తగదు. నా భుజాల మీద ఎక్కండి. క్షణంలో మిమ్మల్ని, మీ గురువు దగ్గిరకు చేర్చుతాను" అంటూ పిశాచగార్దభాన్ని ఒంటి చేత్తోనే ఎత్తి గిరగిరా గాలిలో తిప్పి, చెట్లమీదుగా దాన్ని ఆకాశంలోకి విసిరివేశాడు.





గార్దభం దిక్కులు పిక్కటిల్లేలా ఓండ్రిస్తూ, ఎగరటం చూచి, భల్లూకకేతుడు బిగ్గరగా నవ్వి, "ప్రభూ! ఇక రండి! నా భుజాలమీద కూర్చోండి!" అంటూ పింగళుడి ముందు మోకరిల్లాడు.

పింగళుడు సంశయించకుండా, ఎలుగ్గొడ్డు రూపంలో వున్న భల్లూకకేతుడి భుజాలమీదికి ఎక్కి కూర్చున్నాడు. భల్లూకకేతుడు వెంటనే గాలిలోకి ఎగిరి, కళ్ళు మూసి తెరిచేంతలో పింగళుణ్ణి పద్మపాదుడు వున్న చోటుకు తెచ్చి దించాడు.

పద్మపాదుడు భల్లూకకేతుణ్ణి చూస్తూనే మందహాసంచేసి, "కులాసాయేగదా? అటు చూడు!" అంటూ నదిలో పొంగులువారుతున్న నీటిమీదా, పక్కలనే వున్న కొండరాళ్ళ మధ్యా పోరాడుతున్న అసంఖ్యాక రక్కసులను చూపి, "వీళ్ళంతా రాజరికం కోసం ఒకళ్ళ గొంతులు ఒకరు కోసుకుంటున్నారు. నీవు వాళ్ళ తగువు మాన్పి, తిరిగి వాళ్ళకు నాయకుడుగా, రాజుగా వుండాలని నేను కోరుతున్నాను," అన్నాడు.

పద్మపాదుడి మాటలు వింటూనే, భల్లూకకేతుడు దిగాలుపడిపోయి, పింగళుడికేసి దీనాతిదీనంగా చూశాడు. పింగళుడు, పద్మపాదుడితో, భల్లూకకేతుడి కోర్కె వివరించి, "నేను ఇతణ్ణి నా సేవకుడుగా తీసుకుంటాను," అన్నాడు.

"అందుకు నా అభ్యంతరం ఏమీలేదు. కాని, ఈ తగువులాడే రక్కసుల సంగతేమిటి?" అన్నాడు పద్మపాదుడు.

"వాటి సంగతి నాకు వదలండి! నేను...." అని భల్లూకకేతుడు ఏమో చెప్పబోయేంతలో ఒక్కసారిగా ఆ ప్రాంతం అంతా మార్మోగేలా, పిశాచాలన్నీ ఏకకంఠంతో, "భల్లూకకేతా! ఓహోం! ఓహోం!!" అని అరుస్తూ, పద్మపాదుడు వున్న చోటుకు పరిగెత్తుకు రాసాగాయి.

(ఇంకా వుంది)






# 9

[ మహామాయుడినుంచి పింగళుడు అద్భుతశక్తులు గల వస్తువులన్నిటిని హరించగానె, భల్లూకపర్వతాలమీద గల దుష్టశక్తులన్నీ విజృంభించినై. పద్మపాదుడు భల్లూకకేతుడి కోసం పింగళుణ్ణి పంపాడు. పింగళుడు భల్లూకకేతుణ్ణి తీసుకువచ్చాడు. అప్పుడు పిశాచాలన్నీ భల్లూకకేతుడు వున్నచోటుకు పరిగెత్తుకు రాసాగాయి. తరవాత—]

తమవద్దకు పరిగెత్తుకువస్తున్న పిశాచాలను చూసి, పద్మపాదుడు చిరునవ్వు నవ్వాడు. భల్లూకకేతుడుమాత్రం వాటికేసి చూసి, అయిష్టంగా తల పక్కకు తిప్పి, పింగళుడికి నమస్కరిస్తూ, "ప్రభో, ఈ క్షుద్రజీవాలకు నేను నాయకుడుగా వుండలేను. దయవుంచి నన్ను మీ వెంట తీసుకుపొండి!" అన్నాడు.

పింగళుడు జవాబేమీ చెప్పలేదు. అప్పుడు పద్మపాదుడు, భల్లూకకేతుడి భుజం తడుతూ, "భల్లూకకేతా! నువ్వు ఈ పర్వత ప్రాంతాల, ఈ రక్కసిగణానికి నాయకత్వం వహించి బతకటమే అన్ని విధాలా మంచి పని నా అభిప్రాయం!" అన్నాడు.

"అయ్యో, ప్రభో! ఆ జీవితం ఇక నాకు వద్దు!" అంటూ భల్లూకకేతుడు, పద్మపాదుడికి సాష్టాంగ ప్రణామం చేశాడు.

అంతలో పిశాచాలన్నీ వారిని చుట్టుముట్టి, "భల్లూకకేతా, మారాజా! ఓహెూం! ఓహెూం!" అంటూ అరవసాగాయి. కర్ణకఠోరంగా వున్న వాటి వికృతనాదాలను విని, పింగళుడు చీదరించుకుంటూ, "పద్మ







పాదా! నాకు ఒక మంచి వుపాయం తోస్తున్నది. ఆలా చేస్తే, అటు భల్లూకకేతుడికీ, మనకూకూడా అన్ని సమస్యలూ విరగడవుతవి!" అన్నాడు.

"ఏమిటది?" అన్నాడు పద్మపాదుడు.

"భల్లూకకేతుడికి మనను సేవిస్తూ బతకాలని వుంది. ఆ కారణంవల్ల అతడు ఈ పిశాచాలకు నాయకుడుగా, ఈ పర్వత ప్రాంతాల వుండేందుకు అంగీకరించటం లేదు. మనం ఈ పిశాచాలను ఇలాగే వదలి పోతే, అవి ఎలాంటి అఘాయిత్యాలు చేస్తవో మనకు తెలీదు. అందువల్ల వీటిని దుంపనాశనంచేయటమే మంచిది. వీటిమీద మహామాయుడి కత్తిని వుపయోగిద్దాం!" అన్నాడు పింగళుడు.

పింగళుడు ఇలా అనేసరికి, పిశాచాలన్నీ హాహాకారాలు చేసినై. అవన్నీ ఏకకంఠంతో, "మహామాంత్రికులారా! మమ్మల్ని సర్వనాశనం చేయకండి. మా ప్రభువు భల్లూకకేతుడు మాకు నాయకత్వం వహించకపోతే, మేమే నాయకుణ్ణి ఎన్నుకోగలం!" అన్నవి.

"అందుకు నా అభ్యంతరం ఏమీలేదు. మీరు నాయకత్వపు సమస్యను ఎలా పరిష్కరించుకోగలరో చూడాలని నాకు కుతూహలంగా వుంది," అన్నాడు పద్మపాదుడు.

"మీ మానవుల్లోలాగానే మాలోనూ బలదర్పాలు గలవాడే నాయకుడు! ఆ శక్తులు ఎవరిలో ఎక్కువగా వున్నవో రుజువు చేసుకుంటాం!" అంటూ పిశాచాలన్నీ బాహాబాహీ, ముష్టాముష్టి యుద్ధానికి వుపక్రమించినై.

"భేష్, ఈ పద్ధతి చాలా బావుంది!" అంటూ పింగళుడు ఎంతో వుత్సాహంగా చప్పట్లు చరిచాడు.

ఇక పిశాచాలు నాయకత్వంకోసం పోరు ప్రారంభించినై. అవి క్షణక్షణానికీ అనేక రూపాలను ధరిస్తూ యుద్ధం సాగించినై. పులిరూపం దాల్చిన వాటిని మట్టుపెట్టేందుకు కొన్ని ఏనుగురూపాలు ధరిస్తే, వాటిని







హతమార్చేందుకు మరికొన్ని పిశాచాలు సింహాకృతులు ధరించినై. కొన్ని నాగుజాములైతే, మరికొన్ని గరుడపక్షులు!

ఈ విధంగా జరిగిన ఘోరసంగ్రామంలో చావగా మిగిలిన కొద్ది పిశాచాలు, చివరకు తమ నాయకుడుగా ఒక పెనుభూతాన్ని ఎన్నుకున్నవి. పద్మపాదుడికి, యీ విధంగా నాయకత్వపు సమస్య పరిష్కారమయినందుకు చాలా సంతోషం కలిగింది. అతడు, యిప్పుడు పిశాచాల నాయకుడైన పెనుభూతాన్ని దీవించి, "యిక మీరు స్వేచ్ఛగా, యీ భల్లూక పర్వతాలలో బతకవచ్చు. మీరు అహంకరించి మానవులమీద కత్తి కట్టితే తప్ప లేకపోతే మీ జోలికి నేనుగాని, పింగళుడుగాని రామని అభయహస్తమిస్తున్నాను. యిక వెళ్లండి!" అన్నాడు.

పిశాచాలన్నీ జయజయధ్వానాలు చేస్తూ, తమ కొత్త నాయకుడైన పెనుభూతాన్ని భుజాలమీద ఎక్కించుకుని పర్వతాల మీదికి వెళ్లిపోయినై. అప్పుడు పద్మపాదుడు, పింగళుడికేసి తిరిగి, "పింగళా! మనం అష్టకష్టాల కోర్చి, కావలసిన శక్తులన్నిటినీ సంపాదించుకొన్నాం. యిందులో నీవు చేసిన సహాయం నే నెన్నడూ మరువరానిది. నీవు నీ యింటికి వెళ్లేముందు, నాకు కొద్ది రోజులపాటు అతిథిగా వుండవలసిందని కోరుతున్నాను," అన్నాడు.

పింగళుడు అందుకు అంగీకరించాడు. పద్మపాదుడు ఓ చిటికెడు మన్ను తీసుకుని మంత్రించి భూమిమీద చల్లాడు. వెంటనే ఓండ్రిస్తూ పిశాచగార్దభాలు పెళపెళా రావాలతో భూమిలోంచి బయటికి దూకినై.

పద్మపాదుడు ఒక పిశాచగార్దభాన్ని ఎక్కి కూర్చున్నాడు. పింగళుడు రెండవ గార్దభం దగ్గిరకు వెళ్లబోయేంతలో, భల్లూకకేతుడు అతడిముందు మోకరిల్లి, "ప్రభో! మీరు నా భుజాలమీద ఎక్కండి. నేను మీకు సదా సేవకుణ్ణి!" అన్నాడు.







పింగళుడు నవ్వుతూ, భల్లూకకేతుడి భుజాలమీద ఎక్కి కూర్చున్నాడు. పద్మపాదుడు కూర్చున్న గార్దభం గాలిలోకి లేచింది. ఆ వెంటనే భల్లూకకేతుడుకూడా గాలిలోకి ఎగిరాడు. రౌతులేని రెండవ పిశాచ గార్దభం వారివెంట ఎగిరి రాసాగింది.

అడవులూ, కొండలూ, నదులూ దాటుతూ సూర్యాస్తమయం వేళకు వారు ఒకానొక నగరం సమీపించారు. పద్మపాదుడు కింద బొమ్మరిళ్లలా వున్న ఆ నగర భవనాలను పింగళుడికి పేరుపేరునా చూపిస్తూ, "ఆ కొండపక్కన పాములా కదులుతున్న సెలఏరు కనబడుతున్నదిగదా? దానివెంట వున్న ఆ చెట్లగుంపు చూడు! అందులో పాలరాతితో నిగనిగలాడుతున్నదే, నా పిత్రు గృహం! నా అన్నలిద్దరూ చిలకసరస్సుకు ఆహుతి అయిపోయారు గనక, యిప్పుడు నేనే ఆ గృహానికి అధిపతిని. నా తండ్రి వదిలిపోయిన మంత్రగ్రంధంకూడా నాదే!" అన్నాడు వుత్సాహంగా.

అంతలో పద్మపాదుడు ఎక్కివున్న పిశాచగార్దభం క్రమంగా కిందకు దిగి ఎత్తయిన ప్రాకారం గల పద్మపాదుడి యింటి ముందు ఆగింది. భల్లూకకేతుడుకూడా కిందికి దిగాడు. ప్రాకారద్వారానికి గల పెద్ద యినప తలుపులముందు, యిద్దరు నీగ్రో



బానిసలు పహరా తిరుగుతున్నారు. వారు పద్మపాదుణ్ణి చూస్తూనే, తమ చేతుల్లో గల శూలాలను పైకిఎత్తి, "జై పద్మపాదా!" అంటూ జయజయధ్వానాలు చేశారు.

పద్మపాదుడు గార్దభంమీంచి దిగి ముందు దారితీశాడు. పింగళుడుకూడా, భల్లూకకేతుడి భుజాలమీంచి కిందకు దూకి అతణ్ణి అనుసరించాడు. అందరూ భవనం ముందు గల చిత్రవిచిత్రమైన చెట్లలోంచి నడుస్తూ, భవనాన్ని సమీపించేసరికి, మెట్ల వద్ద తెల్లని బారెడు గడ్డంతో వున్న ఒక వృద్ధుడు ఎదురయ్యాడు. పద్మపాదుడు అతణ్ణి చూస్తూనే వంగి ప్రణామంచేసి, వెనుదిరిగి పింగళుడితో, "వీరే మా తండ్రి గురువులు!" అన్నాడు. పింగళుడుకూడా ఆయనకు నమస్కరించాడు.

వృద్ధుడు అందరూ సమీపించేవరకూ ఆగి, తరవాత పింగళుడికేసి వేలుచూపుతూ, "పద్మపాదా! యీ యువకుడెవరు?" అంటూ ఆగి, "అవంతీనగరపు జాలరి కాదుగదా?" అన్నాడు.

పద్మపాదుడు అవునన్నట్టు తల వూపాడు. వెంటనే వృద్ధుడు పరమానందం పొంది, "అయితే, నువ్వు మహామాయుడి సమాధిలో గల అపూర్వ శక్తులనన్నిటిని వశపరుచుకున్నావన్నమాట!" అన్నాడు.





పద్మపాదుడు మారుమాటాడకుండా, తన వేలిన గల వుంగరాన్ని, వజ్రాలు తాపిన పిడి గల కత్తినీ, భూగోళాన్నీ వృద్ధుడికి చూపించాడు. వృద్ధుడు వాటిని కొంచెంసేపు పరీక్షగా చూసి, "పద్మపాదా! ఇక నిన్ను జయించ గల మాంత్రికుడు ఈ ప్రపంచంలో మరొకడు లేడు. నీ తండ్రి ఎంతో ప్రయత్నించి కూడా సాధించలేకపోయిన వాటిని నువ్వు సాధించావు. ఆ విధంగా ఆతడి ఆత్మకు శాంతి కలుగుతుంది!" అన్నాడు.

"నా తండ్రి వదిలిపోయిన మంత్ర గ్రంధం యిప్పుడు నాదేగదా?" అన్నాడు పద్మపాదుడు.

వృద్ధుడు చిరునవ్వు నవ్వి, "ప్రపంచాన్ని జయించ గల సర్వశక్తులూ నీ స్వాధీనం అయిన తరవాత, ఆ మంత్రగ్రంధంతో నీకు కొత్తగా జరగబోయే మేలు ఏమున్నది? నివు సంపాయించిన శక్తులకన్న, అందులో గొప్ప శక్తులేమీ లేవు. తను సాధించలేకపోయిన వాటిని తన కొడుకులచేత సాధింపచేయాలనే, నీ తండ్రి మరణించే ముందు, ఆ మంత్రగ్రంధాన్ని గురించి అలాంటి షరతులు పెట్టాడు. మహామాయుడు నీ తండ్రికి ప్రబల విరోధి! నువ్వు ఆతణ్ణి జయించావు," అన్నాడు వృద్ధుడు.

వృద్ధుడు అంత చెప్పిన తరవాత గాని, పద్మపాదుడికి తన తండ్రి అభిప్రాయం ఏమిటో అర్థం కాలేదు. తనకు ప్రబల విరోధి అయిన మహామాయుణ్ణి, శక్తిహీనుణ్ణి చేసేందుకు ఆయన తనను వుపయోగించుకున్నాడన్నమాట!

పద్మపాదుడు ఇలాంటి ఆలోచనలతో సతమత మవుతూండగా, వృద్ధుడు, పంగ కుడి భుజాన్ని ఆప్యాయంగా తడుతూ, "అవంతినగరపు జాలరివైన నువ్వు, విధి ప్రేరణవల్ల, పద్మపాదుడివి తటస్థపడి—మహత్కార్యాన్ని సాధించావు. ఇందుకు నేను నిన్ను అభినందిస్తున్నాను," అన్నాడు.









పింగళుడు వారంరోజులపాటు పద్మపాదుడికి అతిథిగావుండి తిరుగు ప్రయాణానికి సిద్ధమయాడు. పద్మపాదుడు అతడికి విలువైన దుస్తులతోపాటు, చాలా బంగారమూ, రత్నాలూ, మణులూ బహూకరించాడు. పింగళుడు వాటినన్నిటినీ ఎంతో కృతజ్ఞత కనబరుస్తూ స్వీకరించాడు.

తీరా పింగళుడు యింటి ప్రాకారాపు ద్వారాలు దాటి బయటికి వచ్చేంతరవాత, పద్మపాదుడు అతడికి, మహామాయుడి సమాధినుంచి తెచ్చిన వస్తువులన్నీ చూపెడుతూ, "పింగళా! వీటిలో నీకు కావాలన్న ఏ ఒకటైనా సంతోషంగా యిచ్చివేస్తాను, తీసుకో!" అన్నాడు.

పింగళుడు అందుకు అంగీకరించలేదు. అతడు చిరునవ్వు నవ్వుతూ, "పద్మపాదా! ఆ మహాశక్తిసంపన్నమైన వస్తువులు, జాలరినైన నాదగ్గిరకన్న, మంత్రవేత్తవయిన నీ దగ్గిరే ఎంతో రాణిస్తవి. మరోలా అనుకోకపోతే, నేను కోరదలిచిన వస్తువు నీదగ్గిర ఒకటి వున్నది," అన్నాడు.

"ఏమిటదీ? నిరభ్యంతరంగా కోరుకో, యిచ్చేస్తాను!" అన్నాడు పద్మపాదుడు.

"నీదగ్గిర మహత్తుగల సంచీ ఒకటి వున్నదిగదా? వంటచేసే బాధ లేకుండా సకల పదార్థాలూ అందులో దొరుకుతవి! అలాంటి వస్తువు నాదగ్గిర వుంటే, వృద్ధురాలైన నా తల్లికి రోజూ వంట చేయవలసిన బాధ తప్పి, ఎంతో సంతోషిస్తుంది," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు, పింగళుడు కోరిన విధంగా ఆ సంచిని ఇచ్చేశాడు. తరవాత పింగళుడు వృద్ధ మంత్రవేత్తకూ, పద్మపాదుడికీ వీడ్కోలు చెప్పి, భల్లూకకేతుడి భుజాలమీద కూర్చుని ఆకాశమార్గాన బయలుదేరాడు.

భల్లూకకేతుడు దట్టంగా మేఘాలతో కప్పబడిన ఆకాశమార్గాన ఎగురుతూ, సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు అవంతినగర









పరిసరాలకు చేరాడు. పింగళుడు, ఆ నగరాన్ని, ఆ నగరం పొలిమేరలలో వున్న తన వూరిగుడిసెనూ చూస్తూనే, ఉలిక్కిపడి భల్లూకకేతుడి భుజం తట్టి, "భల్లూకా! నువ్వు యిక ముందుకు సాగకుండా, ఆ దిగువ కనుపిస్తున్న చెట్లమధ్యకు దిగు!" అన్నాడు ఆదుర్దాగా.

భల్లూకకేతుడు, పింగళుడు కోరిన విధంగా, అవంతీనగర పొలిమేరలలో వున్న ఒకానొక చెట్లగుంపుమధ్య దిగాడు. పింగళుడు అతడి భుజంమీంచి దిగి నగరంకేసి చూస్తూ, "భల్లూకా! నిన్ను యీ రూపంలో నగరంలోకి తీసుకపోవటం, అనేక చిక్కులకు కారణం కాగలదు. యిప్పుడేం దారి?" అన్నాడు నిస్పృహగా.

పింగళుడి భయానికి కారణం ఏమిటో గ్రహించిన భల్లూకకేతుడు పెద్దగా నవ్వి, "ప్రభో! అయితే మీరు ఒంటరిగానే నగరంలోకి వెళ్లండి. నా సహాయం కావలసివచ్చినప్పుడు, యీ మంత్రం పఠించండి! వెంటనే నేను మీ సాన్నిధ్యంలో వుంటాను," అంటూ ఏదో మంత్రం పింగళుడి చెవిలో చెప్పి, అదృశ్యుడయాడు.

పింగళుడు, పద్మపాదుడు యిచ్చిన ధనరాసుల్ని మోసుకుంటూ తన యింటివైపుకు నడిచాడు. అతడు కొంతసేపు తరవాత యింటిని సమీపించేసరికి, చిక్కిశల్యమైపోయిన స్థితిలో వున్న అతడి తల్లి, వాకిట్లో కూర్చుని నీరసపడిన గొంతుతో, "అయ్యా! ధర్మదాతలు, యీ ముసలిదానికి ఏమైనా ధర్మంచెయ్యండి. ఆకలితో అలమటిస్తున్నాను!" అంటూ దీనాతిదీనంగా చేతులు చాచటం, అతడి కంటబడింది.

పింగళుడు ఆ దృశ్యాన్ని చూస్తూనే నిలువెల్లా వణికిపోయి, వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ, "అమ్మా! నీకు యీ దుస్థితి ఎలా కలిగింది!" అంటూ తల్లికేసి పరిగెత్తాడు. (ఇంకా వుంది)








## 10

[భల్లూకకేతుడు రక్కసిమూకకు నాయకుడుగా వుండేందుకు అంగీకరించలేదు. చేసేదిలేక పద్మపాదుడు తిరిగి తన దేశానికి బయలుదేరాడు. అక్కడ పింగళుడు, పద్మపాదుడికి వారం రోజులు అతిథిగావుండి, తరవాత తన యిల్లు చేరాడు. ఇంటిముందు అతడికి, తన తల్లి దీనంగా బిచ్చం అడుగుతూ వుండటం కంటబడింది. తరవాత—]

పింగళుడి కంఠస్వరం వింటూనే, తల్లి అతణ్ణి గుర్తించి, కళ్ళవెంట జలజల నీరు కారుస్తూ, "నాయనా, ఎన్నాళ్ళకు నిన్ను చూడగలిగాను!" అంటూ అతణ్ణి కావిలించుకున్నది. పింగళుడు ఆమెను ఓదారుస్తూ, "అమ్మా, నీ స్థితి యిలా అవటానికి కారణం ఏమిటి? నేను ప్రయాణం అయి వెళ్ళేముందు నీకు వెయ్యి మొహరీలు యిచ్చానుగదా? ఆ డబ్బు ఏమయింది? యింతకూ నా అన్నలు ఎక్కడ వున్నారు?" అని అడిగాడు. తల్లి వెంటనే జవాబు చెప్ప లేక కొట్టుమిట్టాడింది. చివరకు ఆమె కళ్ళ నీళ్లు తుడుచుకుంటూ, "నీ అన్నలవల్లనే నాకీ కష్టాలన్నీ వచ్చాయి. నువు అటు వెళ్ళగానే, వాళ్ళిద్దరూ నన్ను తిట్టి కొట్టి, ఆ వెయ్యి మొహరీలూ లాక్కుపోయారు" అన్నది.

తల్లి మాటలు వింటూనే పింగళుడు నిశ్చేష్టుడయాడు. కన్న తల్లిని హింసించే కటికదుర్మార్గులు తన అన్నలన్న సంగతి అతడికి చాలా బాధ కలిగించింది. అయినా, తనకైతాను ఆ సోదరులను హతమార్చ ప్రయత్నించటం ధర్మం అనిపించుకోదు.









చూస్తూ, "నాయనా, నువ్వు అదృష్టశాలివి! అందువల్లనే ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని కూడా క్షేమంగా బయటపడగలిగావు. నాకు ఆకలి దహించుకుపోతున్నది. ముందు బజారుకు వెళ్లి, యిన్ని రొట్టెలూ, ఏదైనా కూరా తెచ్చిపెట్టు!" అన్నది.

తల్లిమాటలకు పింగళుడు పకాలున నవ్వాడు. తరవాత ఆమెను గోడపక్కనే వున్న ఒక పీటమీద కూర్చోపెట్టి, ముందు పెద్ద విస్తరి పరిచి, తనవెంట వున్న మంత్రాల సంచిని ఆమెకు చూపిస్తూ, "అమ్మా, నీకు ఎలాంటి పదార్థాలు కావాలో కోరుకో! అన్నం, కూరలే కాదు, ఎన్ని రకాల పిండివంటలైనా సరే, క్షణంలో నీకు సమకూరుస్తాను," అన్నాడు.

"పింగళా, ఆకలితో ప్రాణం కడబడుతున్న నాకు పిండివంట లెందుకు? ముందు బజారుకు వెళ్లి యిన్ని రొట్టెలు పట్టుకురా, చాలు!" అన్నది తల్లి.

పింగళుడు తల్లి పక్కనే కూర్చుని సంచిలోకి చేయి పోనిచ్చి, మంత్రం పఠించి, అందులోనుంచి వేడివేడిగా వున్న రొట్టెలను బయటికి లాగాడు. యిదేదో వింతగా భావించి, ఆశ్చర్యపడుతున్న తల్లి మారు మాటాడకముందే, పింగళుడు సంచిలోంచి

పింగళుడు బక్కచిక్కిపోయిన తల్లిని లేవనెత్తి యింట్లోకి తీసుకుపోతూ, "అమ్మా, యిక నీవు దుఃఖించవలసిన అవసరం లేదు. భగవంతుడి దయవల్ల నేను అన్ని పరీక్షలకూ నిలబడి, ఎంతో డబ్బుతో యిల్లు చేరాను. నీ కష్టాలూ నా కష్టాలూకూడా యీనాటితో తీరిపోయిన్నై," అంటూ తను వెంట తెచ్చిన సంచీమూత వూడదీసి, అందులో వున్న బంగారం, రత్నాలూ, మణులూ తల్లికి చూపించాడు.

తల్లి ఆనందానికి మేరలేదు. ఆమె రెండు చేతులతో సంచీలో వున్న బంగారాన్నీ; యితర విలువైన వస్తువులనూ తాకి









ఒక్కొక్కటిగా పంచభక్ష్య పరమాన్నాలూ, నూటఒక్క పిండివంటలూ బయటికి లాగి, తల్లిముందున్న విస్తట్లో, దాని చుట్టూ దొంతర్లుగా అమర్చాడు.

తల్లి ఆశ్చర్యానికి అంతులేదు. ఆమె తన ముందున్న తినుబండారాలకేసి కళ్లింత చేసుకు చూస్తూ, "నాయనా, యిది మంత్రమో, మహత్తో నాకు తెలియటంలేదు. అంత చిన్న సంచీలో యిన్ని పదార్థాలు ఎలా దాచగలిగావు?" అని అడిగింది.

పింగళుడు, మంత్రాల సంచిని మడిచి తన పక్కన పెట్టుకుని, ఒక్కొక్క వంట కాన్నే రుచిచూస్తూ, "అమ్మా, అదంతా తరవాత చెపుతాను. ముందు భోజనం ముగించు," అన్నాడు.

కొద్దిసేపట్లో పింగళుడితోపాటు తల్లికూడా తృప్తిగా భుజించింది. పింగళుడు ఖాళీ పళ్లాలన్నిటినీ తిరిగి సంచీలో పెట్టి, దాన్ని తల్లికి అందిస్తూ, "అమ్మా, యీనాటినుంచి నువ్వు వంట చేయనవసరం లేదు. యీ సంచీలో అద్భుతమైన ఒక శక్తి వుంది. దాని ప్రభావంవల్ల మనం ఎలాంటి వస్తువును కోరుకుని, అందులో చెయి పెడ తామో, ఆ వస్తువు వెంటనే లభిస్తుంది. ఆ సమయంలో మనం పఠించవలసిన మంత్రం యిది!" అంటూ తల్లి చెవిలో మంత్రం చెప్పి, "ఈ రహస్యం మాత్రం ఎవరికీ తెలియనివ్వకు!" అన్నాడు.

అంతలో వీధివాకిట్లో ఎవరో పెద్దగా ఏడుస్తూ తల బాదుకుంటున్న ధ్వని అయింది. పింగళుడు అదేమిటో తెలుసుకునేందుకు వీధివాకిలి తెరిచి బయటికి చూచాడు. ఎదురుగా, గుమ్మం పక్కన అన్నలిద్దరూ—దీపదత్తుడూ, లక్షదత్తుడూ చిరిగి మట్టికొట్టుకున్న గుడ్డలతో, చింపిరితలలతో భోరున ఏడుస్తూ అతడికి కనిపించారు.

తన అన్నలిద్దరూ అంత దీనావస్థలో కనబడేసరికి, పింగళుడిలో వారిమీద ఎక్కడ







లేని సోదరప్రేమా వెల్లివిరిసింది. అతడు వారిని సమీపించి, "అన్నల్లారా, ఏడవకండి! దైవకృపవల్ల నేను యింత ధనం సంపాయించి, క్షేమంగా యింటికి తిరిగొచ్చాను. మన కష్టాలన్నీ తీరినై, యిక మనం హాయిగా బతకవచ్చు," అన్నాడు.

పింగళుడు యిలా అనేసరికి జీవదత్తుడూ, లక్షీదత్తుడూ ముఖముఖాలు చూసుకున్నారు. ఆ వెంటనే జీవదత్తుడు మరింత పెద్దగా ఏడుస్తూ తల బాదుకుని, "తమ్ముడూ, పింగళా! ఈ రోజుతో మా జీవితాలు ముగిసినట్టే. మేము అమ్మకు ఎంత అన్యాయం చేశామో, ఆమె నీకు చెప్పేవుంటుంది. ఇక ఏముఖం పెట్టుకుని మేము యీ యింట్లో అడుగుపెట్టగలం! యింత కాలంగా నీ రాకకోసమే ఎదురు చూస్తున్నాం. నిన్నొక్కమారు తుదిసారిగా చూసి, ఆ చిలకసరస్సులో పడి చావదలుచుకున్నాం. అప్పుడుగాని మా పాపాలకు తగిన ప్రాయశ్చిత్తం జరగినట్టు కాదు. అమ్మకు వేయి నమస్కారాలు. మా తప్పుల్ని క్షమించు, యిక సెలవు!" అంటూ వెనుదిరిగాడు. అతడితోపాటే లక్షీదత్తుడు కూడా బయలుదేరాడు.

పింగళుడు చెంగున ఒక్క గంతులో అన్నలిద్దరికీ అడ్డంగా నిలబడి, "అన్నల్లారా,





ఆగండి! యిప్పుడు మీరెక్కడికి వెళుతున్నారు?" అన్నాడు.

"ఎక్కడికా? అహ్హహ్హహ్హ!" అంటూ జీవదత్తుడూ, లకీదత్తుడూ కూడా పిచ్చివాళ్లలా వికటంగా నవ్వి, "తమ్ముడూ, దారి తొలుగు! మా పాపాలకు ప్రాయశ్చిత్తం జరిగితీరవలసిందే! తల్లిని రంపాన రాసిన పాపులకు, ఆ చిలకసరస్సే శరణ్యం!" అంటూ ముందుకు నడవ బోయారు.

ఇంతలో తల్లికూడా వీధివాకిలి దగ్గిరకు వచ్చి, తన పెద్దకొడుకులిద్దర్నీ చూసి ఎంతో జాలిపడింది. ఆమె ఆ క్షణంలో, వాళ్లిద్దరూ తనకు గతంలో చేసిన అన్యాయాన్ని మర్చిపోయి, ఎక్కడలేని పుత్రప్రేమతో వారిని సమీపించి, "నాయనలారా, ఏడవకండి! దేవుడి దయవల్ల మీ చిన్నతమ్ముడు, ఎంతో ధనం సంపాయించి తిరిగివచ్చాడు. జరిగిపోయినదాన్ని మరిచిపోయి, యిక నుంచైనా సుఖంగా కాలక్షేపం చేద్దాం!" అన్నది.

"అయితే మా పాపాలకు ప్రాయశ్చిత్తం మాటేమిటి?" అన్నారు జీవదత్తుడూ, లకీదత్తుడూ, ఏకకంఠంతో.

"పశ్చాత్తాపం అనేది అన్ని పాపాలను హరిస్తుంది. యిక వెనుదిరిగి యింట్లోకి రండి!" అన్నాడు పింగళుడు, జీవదత్తుడి చెయ్యి పట్టుకుంటూ..





తల్లికూడా తన పెద్దకొడుకులకు అడ్డుగా నిలబడి, "నాయనలారా, యిక యింట్లోకి పదండి! చిన్నతనంవల్ల, మీరు తెలిసీతెలి యక నాకేమైనా అన్యాయం చేసివుంటే, తల్లినైన నేను మర్చిపోగలను," అంటూ కొడుకు లిద్దరి చేతులూ పట్టుకున్నది.

ఆ తరవాత అయిష్టంగానే ముక్కుతూ, మూలుగుతూ, జీవదత్తుడూ, లకిదత్తుడూ యింట్లోకి వచ్చారు. తల్లి అప్పటికప్పుడు వాళ్ళిద్దరికీ స్నానానికి నీళ్లుతోడి, కట్టు కునేందుకు పింగళుడు వెంటదెచ్చిన ఖరీదైన పట్టువస్త్రాలు యిచ్చింది. వాళ్ళిద్దరూ స్నానాలుచేసి, ఆ పట్టుదుస్తులు ధరించి, తల్లినీ, పింగళుణ్ణీ ఎంతో అప్యాయంగా కావిలించుకుని, "తినటాని కేమైనా వుంటే పెట్టండి, ఆకలి దహించేస్తున్నది," అన్నారు.

పింగళుడు మంత్రాలసంచీ తీసుకుని వంటగదిలోకి వెళ్ళి, తల్లికి దాన్నియిచ్చి, అన్నలదగ్గిరకు వచ్చి కూచున్నాడు. నాలు గైదు నిమిషాల తరవాత తల్లి రకరకాల భోజనపదార్థాలు పళ్లాల్లో పెట్టుకుని వచ్చి పెద్దకొడుకుల ముందు పెట్టింది.

జీవదత్తుడూ, లకిదత్తుడూ అపురావురు మంటూ కొంతసేపు తిని, "అమ్మా, యిన్ని పదార్థాలు వండావెందుకు? మేమేమీ అతిథులం కాదుగదా! అనవసరంగా డబ్బు ఖర్చు," అన్నారు.

పింగళుడు నవ్వుతూ, "అన్నల్లారా! మనం ప్రతిరోజూ యిలాంటి భోజనమే చేయ వచ్చు. కావాలంటే, యీ పట్టణంలో వున్న బీదసాదలకు కూడా, యింత విలువగల భోజనం పెట్టవచ్చు," అన్నాడు.

పింగళుడి మాటలు వింటూనే జీవ దత్తుడు లకిదత్తుడికి సంజ్ఞచేశాడు. అతడు కూడా ఏదో అర్థమైందన్నట్టు తల వూపి వూరుకున్నాడు.

ఆ రాత్రి భోజనాల తరవాత జీవదత్తుడూ, లకిదత్తుడూ చల్లగాలికి వీధిలోకి వెళ్ళివస్తా







మని బయలుదేరారు. వాళ్ళిద్దరికీ పింగళుడు చాలాధనం వెంటబెట్టుకు వచ్చాడనేది తెలిసిపోయింది. ఆ డబ్బు దొరకపుచ్చుకోవటం ఎట్లా? అన్నది వాళ్ళకు పెద్ద సమస్య. యింకొటి: జీవదత్తుడికి తన తల్లి ఆ ఉదయంగాని, సాయంకాలంగాని, పొయ్యి రాజేసినట్టు కనబడలేదు. అతడు వంటగదిలోకి వెళ్ళి, గదంతా పరీక్షించి వచ్చాడు. వంట చెయ్యకుండానే, యిన్ని పదార్థాలు ఎక్కడనుంచి వస్తున్నవో అతడికి అర్థంకాలేదు.



"పింగళుడు చాలా డబ్బు తెచ్చాడు, అందులో సందేహం లేదు. పోతే, దాన్ని మనం దొరకపుచ్చుకోవాలంటే మరి కొంత కాలం పడుతుంది. మనం పశ్చాత్తాపపడుతున్నామని అమ్మతోపాటు వాడికీ నమ్మకం కుదిరింది. అది అట్లా వుంచుదాం. మనం యీ రెండుపూటలా విందుభోజనాలు చేశాం కదా! వంటింట్లో చూస్తే పొయ్యి రాజేసిన లక్షణాలే లేవు. ఇది వింతగా లేదా?" అన్నాడు జీవదత్తుడు.

లక్షదత్తుడు ఆశ్చర్యపడుతూ తల పంకించి, "అలా అయితే, పింగళుడు ఏదో మంత్రమో తంత్రమో నేర్చుకు వచ్చి, యిదంతా చేస్తూవుండివుండాలి. అందుచేతే వాడు అంత ధీమాగా పట్నంలో వున్న బీదసాదలందరికీ యీ భోజనమే పెట్ట వచ్చని అన్నాడు. సమయం కనిపెట్టి అమ్మ నడిగితే, యీ రహస్యం బయట పెట్టేస్తుంది," అన్నాడు.

అన్నదమ్ములిద్దరూ మర్నాడు పింగళుడు యింట లేని సమయం కనిపెట్టి, తల్లిపక్క చేరి, యీ సంగతి అడిగారు. ఆమె చాలా సేపటి వరకూ పింగళుడు తెచ్చిన మంత్రాల సంచీని గురించి చెప్పలేదు. కాని కొడుకులిద్దరూ బతిమాలేసరికి, మరెవరికీ తెలియకూడని రహస్యం అంటూ, మంత్రాలసంచీ తెచ్చి వాళ్లిద్దరికీ చూపింది.







"అమ్మా, ఆ మంత్రం ఏదో నాకు చెప్పు! నాకు యీ క్షణాన జిలేబీలు తినాలని వుంది," అన్నాడు జీవదత్తుడు.

తల్లి కొడుకులమీది ప్రేమకొద్దీ, వాళ్లు లోగడ తనను పెట్టిన హింసలు మరిచిపోయి, వాళ్లకు ఆ మంత్రం చెప్పి, సంచిలోంచి వాళ్ల చేత, కావలసిన పదార్థాలన్నీ బయటికి తీయించింది. దానితో జీవదత్తుడి, లక్షదత్తుడి ఆనందం హద్దులు దాటిపోయింది.

ఆ రాత్రి వాళ్ళిద్దరూ పింగళుడిమీదా, తల్లిమీదా కుట్ర పన్నారు. ముందు పింగళుణ్ణి యింట్లో లేకుండా చేస్తే, తల్లి తమనేమీ చేయులేదని వాళ్లకు తెలుసు. అయితే, పింగళుణ్ణి వదిలించుకోవటం ఎట్లా?

"మొన్న పెద్దబజారున వస్తూంటే, ఒక ఓడసరంగు కనిపించాడు. అతడికి సముద్రాలమీద పడవలు నడిపేందుకు యువకులైన నావికులు కావాలట! అవసరం అయితే, ఎంత డబ్బయినా యిచ్చి, ఇంటి పెద్దలనుంచి యువకులను కొంటున్నాడు. మనం ఆయనతో మాట్లాడి, పింగళుణ్ణి అతడికి అమ్మేద్దాం! మనం, యీ యింటికి పెద్దవాళ్ళం గదా?" అన్నాడు జీవదత్తుడు.

"మంచి యోచన! ఆ సరంగును కలుసుకుని మాట్లాడదాం పద," అన్నాడు లక్షదత్తుడు. అన్నదమ్ములిద్దరూ కలిసి సరంగు విడిదిచేసిన యింటికి పోయారు. అతడు వీళ్ళకు అన్ని మర్యాదలూ చేసి వచ్చిన పనేమిటని అడిగాడు. అప్పుడు జీవదత్తుడు లేని దుఃఖం తెచ్చిపెట్టుకుని, "అయ్యా, సరంగుగారూ! మా తమ్ముడు పింగళుడనే వాడొకడున్నాడు. వాడు పక్కా గడుగ్గాయిలా తయారై యింటిపట్టున వుండక, అవసరం అయినప్పుడల్లా వృద్ధురాలైన మా అమ్మనూ, మమ్మల్నీ హింసించి డబ్బు గుంజుకు పోతూంటాడు. వాడిని వదిలించుకోవటం ఎలాగో మాకు తెలియకుండా వుంది," అన్నాడు విచారంగా. (ఇంకా వుంది)






## 11

[పింగళుడు తన తల్లిద్వారా అన్నలు ఆమెను పెట్టిన హింసలు తెలుసుకున్నాడు. కాని, అన్నలు దొంగఏడ్పులు ఏడుస్తూ వచ్చేసరికి, సోదరప్రేమకొద్దీ వారిని యింట్లోకి ఆహ్వానించాడు. వాళ్లిద్దరూ పింగళుడు తెచ్చిన ఆస్తికోసం, అతణ్ణి ఒకానొక ఓడ సరంగుకు బానిసగా అమ్మేందుకు కుట్రపన్ని, సరంగును కలుసుకున్నారు. తరవాత—]

జీవదత్తుడు తన తమ్ముణ్ణి గురించి చెప్పినదంతా విని ఓడసరంగు, చేతులు బారచాచి వికటంగా నవ్వాడు. దానిఅంతరార్థమేమిటో తెలీక, జీవదత్తుడూ లక్షదత్తుడూ కళవెళ పడిపోయి ముఖముఖాలు చూసుకున్నారు.

ఓడసరంగు కొంచెంసేపు ఆలోచిస్తూ పూరుకుని, తరవాత జీవదత్తుడి కళ్లల్లోకి గుచ్చిచూస్తూ, "నువు చెప్పేదంతా నిజమేనా? నిజంగా మీ తమ్ముడు పింగళుడు అనేవాడు, మిమ్మల్నీ, మీ తల్లినీ హింసిస్తున్నాడా? నాదగ్గిర అబద్ధాలు పనికి రావు," అన్నాడు.

"నిజం, సరంగుగారూ, నిజం! మా అన్న చెప్పిందాంట్లో ఆవగింజంత అబద్ధంకూడా లేదు. ఇంతకాలంనుంచీ దుష్టుడైన మా తమ్ముడు పెట్టే బాధలను ఎలా భరించుకు వస్తున్నామో ఆ పరమాత్ముడికే ఎరుక!" అన్నాడు లక్షదత్తుడు.

ఓడసరంగు మరోసారి ఆ అన్నదమ్ముల ముఖాలను పరీక్షగా చూసి, తల పూపుతూ,







"అయితే మీ తమ్ముణ్ని కొనేందుకు నాకు ఏమీ అభ్యంతరంలేదు. వాణ్ణి నా పడవల్లో కళాసుగా రెండుమూడేళ్లు వుంచి, వాడి తిక్క కుదిరి దారికి రాగానే, తిరిగి మీ యింటికి పంపేస్తాను, సరా?" అన్నాడు.

"సరంగుగారూ, మీ పుణ్యం ఉంటుంది, ఆ పనిమాత్రం చేయకండి!" అంటూ జీవదత్తుడు అదిరిపడ్డాడు. "అసలే వాడు పరమ దుర్మార్గుడు. అటువంటివాణ్ణి మీరు రెండు మూడుసంవత్సరాల తరవాత తిరిగి యింటికి పంపితే—వాడు తప్పక మా ప్రాణాలూ, మా తల్లిప్రాణాలూ తీస్తాడు. వాడి పగ తాచుపాము పగ అనుకోండి!" అన్నాడు.



"అలా అయితే, వాణ్ణి నాకు బానిసగా అమ్మేందుకు మీతోపాటు, మీ తల్లికూడా ఒప్పుకుంటుందా? తరవాత రాజుగారిదగ్గిర నామీద వ్యాఖ్యంచేస్తే లాభం లేదు. ఆలోచించుకు చెప్పండి," అన్నాడు సరంగు.

జీవదత్తుడూ, లకీదత్తుడూ దూరంగా వెళ్లి ఏదో రహస్యంగా మాట్లాడుకున్నట్టు నటించి, తరవాత సరంగుతో వినయం పుట్టిపడేలా యిలా అన్నారు.

"అయ్యా, సరంగుగారూ! అన్ని సంగతులూ మా అమ్మతో మాట్లాడే వచ్చాం. ఆమె వుద్దేశంకూడా ఏదో విధంగా వాణ్ణి యింట్లోనుంచి బయిటికి పంపమనే. ఎంత కన్నకొడుకైనా వాడి దుర్మార్గాన్ని సహించే ఓర్పు యిక ఆమెకు లేదు. అలా అని ఆమెకై ఆమె తన నోటిమీదుగా వాణ్ణి బానిసగా తీసుకుపొమ్మని మీతో చెప్పలేదు. అందుకే మేంయిద్దరం వచ్చాం!"

"అలాగా, సరే! వాణ్ణి యీ సాయంత్రం సూర్యాస్తమయం వేళకు ఏదో వంక పెట్టి సముద్రతీరానికి తీసుకురండి, తరవాత పని నేను చూసుకుంటాను. ఇదిగో వాడికి నే నివ్వదలుచుకున్న ఖరీదు," అంటూ సరంగు వంద మొహరీలు జీవదత్తుడికి యివ్వబోయాడు.










జీవదత్తుడు, సరంగు యివ్వచూపిన డబ్బు తీసుకోకుండా, "అయ్యా, వాణ్ణి మేము సముద్రతీరానికి తీసుకురాగలగడం సాధ్యమయే పని కాదు. వాడిలో పంద నక్కలకుండే జిత్తులూ, ఎనభై ఎనుబోతుల బలమూ వుంది. కనక, మీరే యీ రాత్రికి మా యింటికి వచ్చి వాణ్ణి ఎలాగో చేజిక్కించుకోండి," అన్నాడు.

జీవదత్తుడి భయం చూసి సరంగు బిగ్గరగా నవ్వాడు. "వాడి జిత్తులూ, ఎనభై ఎనుబోతుల బలమూ నాదగ్గిర ఉప్పుగల్లు కూడా మారవు. ఆఖరికి రాకీసున్నాయినా, కంటికి కనబడి, చేతికి అందితే, కాళ్లకూ మెడకూ ఇనపగొలుసులు తగిలించి, నా ఓడలో కళాసుపని చేయిస్తాను. సరే, రాత్రికి మరిద్దరు కళాసుల్ని వెంటబెట్టుకుని మీ యింటికి వస్తాను. మీ యిద్దరూ సర్వసిద్ధంగా వుండండి," అన్నాడు.

"వెయ్యి నమస్కారాలు. మీ సహాయానికి చాలా కృతజ్ఞులం!" అంటూ జీవదత్తుడూ, లకిదత్తుడూ ఓడసరంగు యిచ్చిన నూరు మొహరీలూ తీసుకుని, పట్టరాని ఆనందంతో యింటికి బయలుదేరారు.

"ఇప్పుడు మనం పింగళుడికి అనుమానం కలక్కుండా వుండే విధంగా ఏదైనా యుక్తి పన్నాలి. సరంగు మరిద్దరు కళాసుల్ని వెంటపెట్టుకుని మనింటికి రాపటం వాడికి అనుమానకారణం కావొచ్చు!" అన్నాడు లకిదత్తుడు.

"ఓ, అలాంటి భయం ఏమీ లేదు. దానికి అవసరంఅయిన వుపాయం ముందే ఆలోచించి వుంచాను," అంటూ జీవదత్తుడు ఓసారి చుట్టూ కలయచూచి, లకిదత్తుడి చెవిలో రహస్యంగా ఏదో చెప్పాడు.

లకిదత్తుడు పెద్దగా నవ్వుతూ చప్పట్లు చరిచి గంతులేస్తూ, "అన్నా, నువ్వు బుద్ధికి బృహస్పతిని మించినవాడివి, నాకు తెలుసు! పింగళుడు తెచ్చిన డబ్బు మన

వయినప్పుడు, భాగాల్లో నాకేమీ అన్యాయం చేయవుగదా ?" అన్నాడు.

"అన్యాయమా. ఛఛ, సోదరున్ని చూస్తూ చూస్తూ ఎలా మోసపుచ్చుతానురా ? అది మన వంశంలోనే లేదుగదా !" అన్నాడు జీవదత్తుడు.

అన్నదమ్ములిద్దరూ నవ్వుతూ, కేరింతలు కొడుతూ యింటిని సమీపించి, వాకిట్లో పింగళుడు కనిపించగానే, ముఖాలమీద ఎక్కలేని విచారాన్ని తెచ్చిపెట్టుకుని అతన్ని సమీపించారు. పింగళుడు వాళ్ల వాలకంచూసి, "అన్నల్లారా, ఎందుకు అంత విచారంగా వున్నారు ? ఏం జరిగింది ?", అని అడిగాడు.

జీవదత్తుడు బొంగురుపోయిన గొంతు పెట్టి, "మరేంలేదు తమ్ముడూ! ఇవ్వాళ దారంట వస్తూంటే మా పాతస్నేహితుడు ఒక ఓడసరంగు కనిపించాడు. అతడు ఈ పట్టణానికి ఏదో వ్యాపారంమీద వచ్చాడట. లోగడ అతడు మా ఇద్దరికీ అనేకసార్లు తన విడిదిలో ఆతిథ్యం యిచ్చి ఎంతో గౌరవించాడు. కాని, బదులుగా అతడికి ఈనాటి వరకూ మేము ఆతిథ్యం ఇవ్వలేకపోయాం. మేము పుట్టుదరిద్రులంగదా ?" అన్నాడు.

"అన్నా, మీ స్నేహితుడు నా స్నేహితుడు కాకుండా పోతాడా ? మనం ఇప్పుడు దరిద్రులం ఏమీ కాదు. కావాలంటే అవంతి



నగరంలో వున్న ప్రతి ఒక్కరికీ మనం రోజూ సంతర్పణ చేయగలం. మీ స్నేహితుడైన పిడసరంగును అనుచరులతోకూడా, ఈ రాత్రి మన యింటికి విందుకు ఆహ్వానించండి! కావాలంటే విడిదికూడా యిక్కడే ఏర్పాటుచేద్దాం," అన్నాడు పింగళుడు.

"నిజమా, తమ్ముడూ నిజమా?" అంటూ జీవదత్తుడూ, లకిదత్తుడూకూడా ఎక్కడలేని సంతోషాన్ని నటిస్తూ పింగళుణ్ణి ప్రశ్నించాడు.

"నిజం, మీ స్నేహితుణ్ణి తప్పక తీసుకురండి. మంచి విందు ఏర్పాటు చేద్దాం!" అన్నాడు పింగళుడు.

"సరే, అయితే ఇప్పుడే ఈ సంగతి మా స్నేహితుడితో చెప్పివస్తాం!" అంటూ జీవదత్తుడూ, లకిదత్తుడూ తిరిగి పట్టణంలోకి బయలుదేరారు.

వాళ్లిద్దరూ సూర్యాస్తమయంవరకూ జూదగృహాల్లోనూ, పానశాలల్లోనూ కాలం గడిపి, చీకటి పడగానే సరంగు విడిదికి వెళ్లి, అతణ్ణి బయలుదేరమన్నారు. సరంగు చాలా సంతోషించి, బలశాలులైన ఇద్దరు కళాసుల్ని వెంటబెట్టుకుని అన్నదమ్ముల వెంట బయలుదేరాడు.

సరంగుకూ, అతడి అనుచరులకూ పింగళుడు హృదయపూర్వమైన స్వాగతం





యిచ్చాడు. వాళ్లందరూ ఒకగదిలో సుఖాసీనులైన తరవాత పింగళుడూ, తల్లి కలిసి మహత్తుగల సంచీనుంచి రకరకాల పదార్థాలూ పానీయాలూ తీసి వాళ్ళకు వడ్డించారు. సరంగుకు మాత్రం సంచీని గురించిన రహస్యం ఏమీ తెలియదు. జీవదత్తుడూ, లకీదత్తుడూ తనకిలాంటి మర్యాదలు చేస్తున్నారని అతడు భావించాడు.

రాత్రి బాగా పొద్దుపోయేవరకూ అందరూ ఖులాసాగా కబుర్లాడుతూ కాలంగడిపాడు. పింగళుడు నిద్రమత్తుతో జోగుతున్నప్పుడు, హఠాత్తుగా మీద పడి అతన్ని బంధించి పట్టుకుపోవాలని సరంగు ఎత్తువేశాడు. కాని, ఎంతకీ పింగళుడు నిద్రమత్తు లక్షణాలు కనబరచక, ఉత్సాహంగా కథలూ, కబుర్లూ చెప్పేస్తున్నాడు.

ఇక యిలా కాలం వృథాపుచ్చటం మంచిది కాదని నిర్ణయించుకుని సరంగు తన అనుచరులకూ, జీవదత్తుడికీ లకీదత్తుడికీ సౌజ్ఞచేశాడు. వెంటనే అందరూ మూకవుమ్మడిగా పింగళుడిమీద పడ్డారు. కొందరు అతడి కాళ్ళూ చేతులూ కదలకుండా పట్టుకున్నారు. జీవదత్తుడూ, లకీదత్తుడూ అతడు కేకలు పెట్టకుండా నోట్లో గుడ్డముక్కలు కుక్కారు.

పింగళుడు మొదట్లో ఆశ్చర్యపడి నిశ్చేష్టుడయినా, ఆ వెంటనే తెప్పరిల్లి, తనను బంధించేవాళ్లనుంచి విడిపించుకునేందుకు గట్టి ప్రయత్నం చేశాడు. కాని తాను ఒకడు, తనను బంధించ చూచేవాళ్ళు అయిదుగురు! వెంటనే అతడికి తన సేవకుడైన భల్లూకకేతుడు గుర్తుకు వచ్చాడు. ఎలాంటి కష్టంలో వున్నాసరే, ఒకానొక మంత్రం ఉచ్చరిస్తే తను మరునిమిషాన సహాయానికి వస్తానని, అతడు పింగళుడికి ఒక మంత్రం చెప్పివున్నాడు. కాని, ఆ కష్టసమయంలో ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా, ఆ మంత్రం పింగళుడికి స్ఫురించలేదు. అతడు నిస్స





హాయుంగా అన్నల కుట్రకు లోనై, ఓడ సరంగుకు బానిసగా చిక్కిపోయాడు.

పక్కగదిలో నిద్రిస్తున్న తల్లికి యివేమీ తెలియవు. పంగళున్ని కాళ్ళూ చేతులూ కట్టింతరవాత కళాసీలు యిద్దరూ కలిసి అతన్ని దుంగలాగా భుజాలమీద వేసుకుని తమ యజమాని సరంగు వెనక బయటికి నడిచారు. జీవదత్తుడూ, లకిదత్తుడూ కూడా వాళ్ళవెనక సముద్రతీరంవరకూ వెళ్ళి, ఓడసరంగుతో, "అయ్యా, మావాణ్ణి మాత్రం ఎట్టిపరిస్థితులలోనూ వదలకండి. వాడు విషసర్పం! ఆ సంగతి మీకు లోగడే మనవిచేసుకున్నాంగదా?" అన్నారు.

"విషసర్పం నోరు బిగించాం. ఇక ఆ కోరలు లేకుండా చేయటం ఎలాగో కూడా నాకు తెలుసు. నా పడవలో ఒక సారి తెడువేసే యినపకమ్మికి అతన్ని గొలుసుతో బిగించానంటే, ఆ పరమేశ్వరుడు కూడా అతన్ని అక్కడనుంచి కదిలించ లేడు," అన్నాడు సరంగు.

జీవదత్తుడూ, లకిదత్తుడూ సరంగుకు ఒకటికి రెండుసార్లు కృతజ్ఞత చెప్పుకుని యింటికి వచ్చారు. అప్పటికి యింకా తెల్ల వారనందున కాసేపు నిద్రపోతున్నట్టు నటించి, తెల్లవారగానే ఆదుర్దాగా తల్లివద్దకు వెళ్ళి, ఆమెను నిద్రలేపి, "అమ్మా, పంగళు డెక్కడ?" అని అడిగారు.

తల్లి వాళ్ళకేసి అమాయకంగా చూసి, "ఏం, ఎందుకంత ఆదుర్దాపడుతున్నారు? వాడి గదిలో నిద్రపోతున్నాడేమో చూడండి," అన్నది.

"గదిలో లేడు. ఇంట్లో మరెక్కడా వున్న జాడకూడా లేదు," అన్నాడు జీవదత్తుడు.

ఆ మాటలతో తల్లికి ఎక్కడలేని భయమూ పట్టుకున్నది. ఆమె హడావిడిగా మంచంలోంచి లేచి యిల్లంతా కలయ వెతకింది. ఆమె ఆదుర్దా గమనించిన జీవదత్తుడు, "అమ్మా, నాకొక అనుమానం







 

కలుగుతున్నది. తమ్ముడు రాత్రి మన యింటికి వచ్చిన ఓడసరంగుతో కలిసి సముద్ర ప్రయాణానికి వెళ్ళివుంటాడేమో!" అన్నాడు అమాయికంగా.

"అంతే జరిగివుండొచ్చు. ఏదో ఒక ద్వీపంలో పెద్ద పాడుబడిన కోటలు వున్నాయనీ, వాటి పునాదుల్లో గొప్పనిధులు వున్నాయనీ సరంగు మనవాడితో చెపుతున్నాడు. అలాటి వాటిని బయటికి లాగటంలో నాది అందెవేసినచేయి, అని పింగళుడు అంటున్నాడు," అన్నాడు లకీపత్తుడు.

అమాయకురాలైన తల్లికి యిందులో కొంత సత్యం వున్నట్టు తోచింది. ఆమె నిస్పృహగా చేతులు జోడించి, "అవును నాయనలారా! పింగళుడు ఎప్పుడూ అదృష్టవంతుడే! వాడి న్యాయబుద్ధీ, సన్మార్గవర్తనే వాణ్ణి అన్ని ఆపదలనుంచీ కాపాడుతుంది. నా తండ్రి త్వరలోనే తిరిగి వస్తాడు!" అంటూ దేవుణ్ణి ప్రార్థించింది.

తల్లి ప్రవర్తన దుష్టులైన కొడుకులిద్దరికీ పట్టరాని ఆగ్రహం తెప్పించింది. వాళ్ళు తల్లికేసి వికటంగా నవ్వి, "వాడు బుద్ధిమంతుడూ, మేము దుష్టులమూ నన్నమాట? మొదటినుంచీ నువ్వు వాడిమీద పక్షపాతం కనబరుస్తున్నావు. మాకు తెలుసు. ఇక యీ యింట్లో మేం క్షణం వుండం. నాన్న వదిలిపోయిన ఆస్తి ఎక్కడ వుందో వెతికి ఎత్తుకుపోతాం," అంటూ బయలుదేరారు.

తల్లి వాళ్ళను వారిస్తూ, "మీనాన్న సంపాయించిన ఆస్తియావత్తూ, మీయిద్దరూ ఎప్పుడో తగలవేశారు. ఈ యింట్లో యిప్పుడున్న డబ్బంతా పింగళుడు కష్టించి సంపాయించుకున్నదే," అన్నది.

ఆ మాటల్తో అన్నదమ్ములిద్దరూ ఉగ్రులైపోయి, తల్లిని నానాతిట్లూ తిట్టి, పింగళుడు మంత్రవేత్త అయిన పద్మపాదుడి నుంచి తెచ్చిన ధనమూ, మహత్తుగల సంచీ వెతికి బయటికి లాగారు. —(ఇంకా వుంది)








## 12

[అన్నలు కోరగా పింగళుడు పిడసరంగుకు తన ఇంటిలో ఆతిథ్యం యివ్వటానికి అంగీకరించాడు. ముందు అనుకున్నప్రకారం, పిడసరంగు తన అనుచరుల సాయంతో పింగళుణ్ణి బంధించి తన పడవమీదికి తీసుకుపోయాడు. అన్నలిద్దరూ ఇంటికి వచ్చి, తల్లినికొట్టి పింగళుడు తెచ్చిన ధనాన్నీ, 'మహత్తు గల సంచీని' చేజిక్కించుకున్నారు. తరవాత—]

జీవదత్తుడూ, లకిదత్తుడూ కలిసి ఎంతో ఆత్రంగా పింగళుడు తెచ్చిన ధనపుసంచి మూతి విప్పి, అందులో గల బంగారాన్నీ, వెల లేని మణిముత్యాలనూ చూసి మూర్ఛ పోయినంత పనిచేశారు. పింగళుడు ఏదో కొంత ధనం సంపాయించుకు వచ్చాడని తప్ప, యింత పెద్ద మొత్తం తెచ్చాడని మాత్రం వాళ్లు కలలోకూడా అనుకోలేదు.

"ఈదెబ్బతో మన దరిద్రమే కాక, అటూ యిటూ ఏడు తరాల దరిద్రంకూడా తీరి పోతుంది," అన్నాడు జీవదత్తుడు.

"అవునా అన్నా, అవును! మనదగ్గిర యింత డబ్బు వున్నదని తెలిస్తే, యీ అవంతీ నగరపు రాజుగారే మనకు పిల్లల్ని యిచ్చేందుకు మంత్రితో సహా బయలుదేరి మన యింటికి వస్తాడు," అన్నాడు లకిదత్తుడు వుత్సాహంగా.

కొడుకులిద్దరూ యీవిధంగా మాట్లాడుకోవటం విన్న తల్లికి, వాళ్లమీద ఎక్కడలేని వాత్సల్యమూ పుట్టుకొచ్చింది. ఆ నిమిషం వరకూ వాళ్లిద్దరూ తనను తిట్టికొట్టిన సంగతి మరిచిపోయి ఆమె, "అయితే నాయనలారా,









ఆస్తిలో పాలుపంచుకోవాలని చూస్తున్నావు, అవునా?" అన్నారు.

"అది మీ తండ్రి గడించిన ఆస్తి కాదు, పింగళుడి కష్టార్జితం. దాన్ని ఎలాగూ మీరు పంచుకోబోతున్నారు గనక నేనేమీ చేయు గలిగిందిలేదు. నేను కోరేదల్లా ఆ మహత్తు గల సంచీ నాకివ్వమని. అది నాదగ్గిర వుంటే మీరు కావలసినప్పుడల్లా, ఇంటికి వచ్చి, యిష్టమొచ్చిన విందుభోజనం చేసి వెళ్ళ వచ్చును. నేనూ లోగడలాగా ఊటికి వాచి అక్కడా యిక్కడా బిచ్చమెత్తవలసిన అవసరం కలగదు," అన్నది తల్లి.

"నువ్వు ముమ్మాటికీ నా తల్లివి కాదు. అలాటప్పుడు నువ్వు బిచ్చమెత్తితే నాకేం!" అన్నాడు జీవదత్తుడు యీసడింపుగా.

"అంతేరా అన్నా, అంతే! మన అయ్య ఆస్తిని దాచి చిన్నకొడుక్కి మూటకట్టి ఒప్ప చెప్పాలని చూస్తున్నమనిషి మనకు తల్లి ఎలా అవుతుంది?" అన్నాడు లక్షదత్తుడు.

ఇక వాళ్లతో వాదించి లాభంలేదని తల్లి నిస్పృహ చెంది, గోడకు చేరగిలబడింది. జీవదత్తుడూ, లక్షదత్తుడూ కలిసి పింగళుడు తెచ్చిన ధనాన్ని భాగాలు వేసుకున్నారు. ఆ పని ముగిసిం తరవాత మహత్తుగల సంచిని గురించి వాదన ప్రారంభమయింది.

మీరిద్దరూ ఒక పనిచెయ్యండి. పూర్వంలాగా వున్న డబ్బంతా దుర్వ్యసనాలకు ఖర్చు పెట్టక, హాయిగా పెళ్లాడి ఒక యింటివాళ్లు కండి! నేను మీ పంచనే వుండి కాలం వెళ్లబుచ్చుతాను," అన్నది.

తల్లి యిలా అనేసరికి కొడుకులిద్దరూ పాముల్లాగా బుసలుకొట్టి చర్రుమంటూ లేచారు. "మేం కావాలంటే పెళ్ళిళ్ళు చేసుకుంటాం, లేకపోతే బైరాగుల్లా తిరుగు తాం, ఆ సంగతి నీకెందుకు? నీకు మామీద ఏమాత్రం పుత్రప్రేమ లేదని మాకు తెలుసు. నీకు సర్వం ఆ పింగళుడే! కల్లబొల్లిమాటల్తో మమ్మల్ని మోసగించి, యీ మా తండ్రి











అన్నదమ్ములిద్దరూకూడా ఆ సంచి నాకు కావాలంటే నాకు కావాలని పోట్లాటకు ఉపక్రమించారు. అది క్రమంగా ముదిరి హద్దులు దాటి ఒకరి గొంతు ఒకరు పట్టుకునే దశకు వచ్చింది. తల్లి వారిద్దరినీ సమీపించి బతిమాలుతూ, "నాయనలారా, మీరు పోట్లాడుకుని ఒకళ్ళకొకళ్లు హానికలిగించుకో కండి. మీరు నన్ను ఎంత యీసడించినా, మీరు నా పుత్రులన్నసంగతి నేనెలా మరిచి పోగలను? సావధానపడి ఆ సంచీ నాదగ్గిర వుంచండి, అప్పుడు మీరు దెబ్బలాడుకో వలసిన అవసరం కలగదు," అన్నది.

"సంచిలో నావంతు నేను పుచ్చుకుం టాను," అంటూ జీవదత్తుడు వంటగదిలోకి పరిగెత్తి కత్తిపీట తీసుకువచ్చి, సంచిని అడ్డంగా కోయబోయాడు. కాని తల్లి అతడికి అడ్డుపడి, "నాయనా, జీవదత్తా! ఆ పని చేయకు. ఒకసారి దాన్ని ముక్కలుచేశావో, దాని మహత్తంతా పోతుంది. దాన్ని ఎవరో ఒకరు మొత్తంగా వాడుకోవలసిందేగాని, ముక్కలుచేసి లాభంలేదు," అన్నది.

"అయితే, ఆ సంచీ నాకే కావాలి!" అన్నాడు లకిదత్తుడు.

"ఛీ వెధవా! నేను యింటికి పెద్దవాణ్ణి, జ్యేష్ఠపుత్రుణ్ణి. యిలాంటి మహత్తుగల వస్తువులన్నీ అలాంటివాడికే చెందుతవని శాస్త్రాలూ, పురాణాలూకూడా ఘోషపెడు తున్నవి," అన్నాడు జీవదత్తుడు.

ఈవిధంగా యింట్లో అన్నదమ్ములమధ్య జరుగుతున్న కలహాన్ని, ఆరాత్రి పట్టణంలో గస్తీ తిరుగుతున్న అవంతీనగర కొత్వాలు ఒకడు విన్నాడు. అతడికి ధనం సంగతీ, మహత్తుగల సంచీ సంగతీ స్పష్టంగా తెలిసి పోయింది. అతడు సూర్యోదయంవేళకే రాజుగారిదగ్గిరకు వెళ్లి, తను విన్నసంగతి యావత్తూ ఆయనకు నివేదించాడు.

అసలే ఆ అవంతీనగరరాజు పరమ పిసినిగొట్టు. అలాంటివాడికి యీ రహస్యం









చెప్పలబడేసరికి ఎక్కడలేని దురాశ పుట్టుకొచ్చింది. ఆయన వెంటనే తన దండనాయకుణ్ణి పిలిపించి ఆ అన్నదమ్ములనూ, ఆ యింట్లో వున్న అన్ని వస్తువులనూ—పూచిక పుల్లతోసహా కదిలించుకుని తన ఆస్థానానికి పట్టించుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

దండనాయకుడు భటులను వెంట వేసుకువెళ్ళి, జీవదత్తుణ్ణి, లకీదత్తుణ్ణీ చెజిక్కించుకున్నాడు. తరవాత యిల్లంతా గాలించి ధనాన్నీ, మహత్తుగల సంచీని దొరకపుచ్చుకోవటమే గాక, యింట్లోవున్న సామానుకూడా వశపరుచుకుని, బళ్ళమీద రాజాస్థానానికి చేరవేశాడు.

జీవదత్తుడూ, లకీదత్తుడూకూడా రాజుతో జరిగిన సంగతేమిటో చెప్పటానికి నిరాకరించారు. కాని, రాజు భటులచేత నాలుగైదు కొరడాదెబ్బలు కొట్టించేసరికి, వాళ్ళిద్దరూ మొదటినుంచీ జరిగిన కథ యావత్తూ ఆయనకు వినిపించారు.

"అయితే యీ ఆస్తి మీది కాదన్నమాట!" అంటూ రాజు సంతోషంగా నవ్వి, "రాజ్యంలో హక్కుదారులంటూ లేకుండా వున్న ఆస్తి యావత్తూ న్యాయశాస్త్రరీత్యా నాకే చెందుతుంది. మీరు మీ తమ్ముడని చెప్పబడే ఆ పింగళుణ్ణి బానిసగా అమ్మేశారు. కనుక అతడికి యిక ఆస్తిహక్కులుగాని, పౌరహక్కులుగానీ, ఏమీ వుండవు. ఇక మీ యిద్దరి సంగతి: మీరు మీదికాని ఆస్తిని రహస్యంగా పంచుకునేందుకు ప్రయత్నించినందుకుగాను, ఇరవైఏళ్ళు కారాగారశిక్ష విధిస్తున్నాను," అన్నాడు.

"మహారాజా! మమ్మల్ని కరుణించి విడిచిపుచ్చండి. ఆ ధనంగాని, మహత్తుగల సంచిగాని మాకు అవసరంలేదు. స్వేచ్ఛగా బతికేందుకు అనుజ్ఞయివ్వండి, అంతే చాలు," అన్నారు జీవదత్తుడూ, లకీదత్తుడూ.

కాని రాజుకు వాళ్ళను స్వేచ్ఛగా వదలటం యిష్టంలేదు. అలా వదిలిస్తే వాళ్ళు











ప్రజలమధ్యకు వెళ్లి, తనుచేసిన అన్యాయం సంగతి ఏకరువుపెడతాను. అప్పుడు ప్రజల్లో కొందరికైనా తనమీద అసంతృప్తి కలగవచ్చు.

"మీకై మీరు చేసిన నేరాలన్నీ ఒప్పుకోవటమే గాక, కన్నతల్లిని హింసించిన సంగతికూడా యదార్థం అని అంగీకరిస్తున్నారు గనక, మీకు కారాగార శిక్ష తప్పదు. పోతే, మీతల్లికి జీవితకాలంపరకూ నెలకు పది మొహరీలు భరణం యిస్తున్నాను," అంటూ రాజు తీర్పుచెప్పి, తన వుద్యానవనంకేసి వెళ్ళిపోయాడు.

రాజభటులు జీవదత్తుడికీ, లక్షదత్తుడికీ కాళ్ళకు యినపగొలుసులు తగిలించి, వాటికి పెద్ద యినపగుండు తాపడంచేసి, చీకటి కోణంగా వున్న ఒకానొక కారాగారపు గదిలోకి వాళ్ళను యీడ్చుకుపోయి వదిలి, బయట తలుపులకు తాళం బిగించారు.

అన్నదమ్ములిద్దరూ తమకు పట్టిన దుర్గతికి ఎంతో వాపోయారు. ఆ నిమిషంలో వాళ్ళకు తమ్ముడికీ, కన్నతల్లికికూడా తీరని ద్రోహం చేశామన్న పశ్చాత్తాపం కలిగింది. అయినా, అంతా మించిపోయిం తరవాత యిప్పుడు తాము చేయగలిగిందేమీ లేదు. చీకటీ, దుర్గంధం, తడి పాడిగా వున్ననేల, నీళ్ళోడుతున్న గోడలూ—అలాంటి నరక కూపంలో వాళ్లిద్దరూ ఎంతోసేపు దుఃఖించి, చివరకు సొమ్మసిల్లి నిద్రపోయారు.

* * *

అన్నలిద్దరూ కలిసి చేసిన ద్రోహం ఫలితంగా పింగళుడు ఓడసరంగుకు బానిసగా దొరికిపోయాడుగదా? ఇక ఆ సరంగు పింగళుణ్ణి తన ఓడలోని మిగతా బానిసలతోపాటు తెడ్లువేసే చోటున వున్న యినప కమ్మీకి గొలుసులతో బంధించాడు. తెల్లవారుతూనే ఓడ లంగరు ఎత్తబడింది. సరంగు ఆజ్ఞ కాగానే దాన్ని బానిసలు తెడ్లువేసి సముద్రంలోపలికి మళ్ళించారు.









ఈ సరంగు పైకి మామూలు పెద్ద మనిషిలాగా కనిపించినా, నిజానికి పేరు మోసిన ఓడదొంగ. వ్యాపారవస్తువులను ఒక రేవునుంచి మరో రేవుకు తీసుకువెళ్లే మిషతో, అతడు ఎక్కడ ఏ రేవులో ఎలాంటి సరుకు ఓడలకు ఎత్తబడుతున్నదీ పసికట్టి — ఆ ఓడలను మహాసముద్రాలమీద అటకాయించి దోచుకుంటూ వుండేవాడు. అలా దోచుకున్న ఓడలలోని వారినందరినీ అతిక్రూరంగా సముద్రం పాలు చేస్తూండేవాడు. ఒకవేళ వారిలో ఎవరినైనా ప్రాణాలతో వదిలితే, వారు తన నిజస్వరూపం నలుగురితోనూ చెపుతారని అతడి భయం.

బానిసలతోపాటు తెడ్డువేస్తున్న పింగళుడు తను మరిచిపోయిన భల్లూకకేతుడి మంత్రం గుర్తుచేసుకునేందుకు ఎంతగానో ప్రయత్నించాడు. కాని అతడికి ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా అది గుర్తుకు రాలేదు. తన అన్నలు తన ఆస్తికోసం తనను యింత కుటిలంగా ఓడసరంగుకు బానిసగా అమ్మారని తెలుసుకుని పింగళుడు మండిపోయాడు. ఇక యిప్పుడు తన అడ్డు లేదు కనక తల్లిని వాళ్ళు పూర్వంలాగే నానా హింసలూ పెడతారని, తను సంపాయించుకు వచ్చిన ధనాన్ని దుబారాఖర్చులకు వినియోగిస్తారని అతడు గ్రహించాడు.





ఈ బానిస జీవితాన్నుంచి తను బయట పడటం ఎలా? పింగళుడికి రేబవళ్లు యిదే ఆలోచన. అనుకోని విధంగా—దైవ సంకల్పమా అన్నట్టు ఒకానొక రోజున సముద్రంమీద పెనుతుఫాను ప్రారంభమయింది. సముద్రంలో ఉవ్వెత్తుగా లేచిన అలలకూ, పెనుగాలి తాకిడికీ ఓడ సుడిగాలిలో ఎండుటాకులా అల్లల్లాడ సాగింది. సరంగు ప్రమాదం గుర్తించి తన అనుచరులకూ, బానిసలకూ హెచ్చరికలూ, ఆజ్ఞలూ యిస్తూ ఓడంతా కలయతిరుగుతున్నాడు. అదే సమయంలో అతడి పాలిట మిత్తి పంపినదా అన్నట్టు, దూరంలో మరొక ఓడ తుఫానులో చిక్కి, సముద్రపు అలల మీద అటూయిటూ దొర్లుతూ కనిపించింది.

సరంగు తనవద్ద గల దుర్భిణీలోంచి ఆ ఓడను పరీక్షించి చూశాడు. అది చాలా పెద్దఓడ. ఖండాంతర వ్యాపారాలకుగాను, పెద్దపెద్ద వర్తకులు వుపయోగించే కోవకు చెందింది. అలాంటి ఓడలో వెలలేని వర్తక సరుకులు వుంటవని సరంగుకు తెలుసు.

సముద్రం మధ్యన రెండు ఓడలు పెను తుఫానులో చిక్కి ప్రమాదావస్థలో వున్నవి. నావికులు ఓడలను రక్షించుకునేందుకు తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నారు. ఇలాంటి అదనులో తను కొంత సాహసించి,







ఆ ఓడను ముట్టడిస్తే, తప్పక అందులోగల అమూల్యమైన వర్తకసామానులన్నీ తనవి అవుతవని సరంగుకు దురాశ కలిగింది. తన అనుచరులా, యిలాంటి గడ్డుపరిస్థితులకు అలవాటు పడినవాళ్ళు. ఇక ఆ వర్తక ఓడలో వున్న నావికులు సముద్రయానానికి అవసరం అయిన నావికాపరిజ్ఞానం వున్న వారే తప్ప. సముద్రయుద్ధానికి అలవాటు పడినవాళ్ళయి వుండరు.

సరంగు యీ విధంగా ఆలోచించి, తన అనుచరులను హెచ్చరించాడు. అంత తుఫానులోనూ అతడి అనుచరులు కత్తులూ, విల్లమ్ములూ ధరించి ఆ వర్తక ఓడను వశ పరుచుకునేందుకు సన్నద్ధమయారు.

పింగళుడు, మిగతా బానిసలతోపాటు వున్న శక్తినంతా వినియోగించి తెడ్డు వేస్తున్నాడు. క్రమంగా ఓడ ఆ వర్తకపు ఓడను సమీపిస్తోంది. సరంగు తన ముఖ్యాను చరులతో తెరచాపకొయ్యకు ఆనుకునిలబడి. దుర్భిణిలోంచి వర్తకపు ఓడకేసి చూస్తు న్నాడు. హఠాత్తుగా అతడు భయకంపిత మైన స్వరంతో కీచుమంటూ అరిచాడు.

"అందరూ విల్లంబులు ఎక్కుపెట్టి వద లండి! ఓడను వెనక్కు నడపండి! అవి వర్తకపు ఓడలా లేదు. వాళ్ళు మండు తున్న గుడ్డలను బాణాలకు చుట్టి మన ఓడ మీదికి వదలబోతున్నారు!"

సరంగు మాట ముగించీ ముగించక ముందే, ఆవతలి ఓడలోంచి మండుతూన్న బాణాలు తారాజువ్వల్లా ఎగిరివచ్చి, పింగళు డున్న ఓడమీద పడసాగినై. వాటిలో కొన్ని తెరచాపస్తంభానికి ఆనుకు నిలబడిన సరంగు అనుచరులమీద పడి, వాళ్ల గుడ్డలు భగ్గుమని మండినై. వెంటనే సరంగు పిచ్చి వాడిలా గంతులేస్తూ "బానిస లందర్నీ వదలండి. వాళ్లు తెడ్లు వదిలి, కత్తులు పట్టి ఓడను రక్షించవలసిన సమయం వచ్చింది," అంటూ కేకలుపెట్టాడు. —(ఇంకావుంది)








## 13

[పింగళుడి అన్నలు ఇంట్లోవున్న డబ్బును పంచుకుని, మహత్తుగల నంచి ఎవరిభాగానికి రావాలనే దగ్గిర పేచిపడి కొట్లాడుకోసాగారు. ఈ సంగతి రాజుకు తెలిసి వాళ్ళిద్దర్నీ జైలులో పెట్టించాడు. ఇక పింగళుడున్న ఓడకూ, మరో ఓడకూ మహాసముద్రం మీద యుద్ధం ప్రారంభమయింది. సరంగు, బానిసలను విడిపించి, వాళ్లకు ఆయుధాలిచ్చాడు. తరవాత—]

సరంగు ఆజ్ఞకాగానే గొలుసులకు బంధింపబడివున్న బానిసలందరూ విడిపించబడ్డారు. వారిలో ప్రతిఒక్కరికీ కత్తీ, విల్లమ్మూ యివ్వబడింది. ఆ సమయంలో సరంగు వాళ్లమీద ఎక్కడ లేని ఆప్యాయతా కనబరుస్తూ, "మీరు యీ క్షణంనుంచీ బానిసలు కారు; యోధులు! మన ఓడ పెద్ద అపాయంలో చిక్కుకున్నది. మన ఓడను వశపరుచుకో చూస్తున్న ఆ శత్రుఓడకు మనం లొంగిపోయామంటే, ఆ తరవాత బతికివున్నన్నాళ్లూ వాళ్లకు మనం బానిస వృత్తి చేస్తూ జీవించవలసి వస్తుంది. అలా కాక మనం జయిస్తే అందరం స్వేచ్ఛగా కాలం గడపవచ్చు. కనక, ప్రాణరక్షకు కోసం, స్వతంత్రం కోసం తెగించి పోట్లాడండి," అన్నాడు.

సరంగు మాటల్లో బానిసలకు నమ్మకం కుదరలేదు. అతడు తమనెంత క్రూరంగా హింసించాడో వాళ్లల్లో ప్రతి ఒక్కరూ గుర్తు పెట్టుకునే వున్నారు. అయినా యీ తరు







ణంలో చేయవలసిందేమిటి? శత్రుఓడలోంచి ఎడతెరిపి లేకుండా బాణాలూ, అగ్నిగోళాలూ వచ్చి తమ ఓడమీద పడుతున్నవి. ఓడ నిప్పంటుకుని కాలి మునిగిపోతే, దానితో పాటు తామూ సర్వనాశం కాకతప్పదు.

బానిసల మనసుల్లో కదులుతున్న యీ అనుమానాలూ, సంశయాలూ పింగళుణ్ణి కూడా బాధించినై. కాని, అతడు వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాడు. తాము వున్న ఓడ నీట మునగకుండా రక్షించవలసిన అవసరం వుంది. కాని, అతి క్రూరుడైన సరంగుమాత్రం బతికివుండటం ప్రమాదకరం. ముందు అతణ్ణి తుదముట్టించాలి. తరవాత వీలుచూసుకుని శత్రుఓడలోని వారితో రాజీపడి తమ దారిన తాము పోవాలి.

పింగళుడు యిలా ఆలోచించి, తన తోటి బానిసలకు కర్తవ్యం ఏమిటో తెలియబరిచాడు. ప్రస్తుతానికి ఆ శత్రుఓడ సంగతి మరిచిపోయి, ముందు తమ ఓడ సరంగునూ, అతడి అనుచరులనూ తుదముట్టించటం క్షేమమని చెప్పాడు. బానిసలందరూ యిందుకు ఒప్పుకున్నారు. యువకుడూ, తెలివిగలవాడూ, సాహసీ అయిన పింగళుడి నాయకత్వాన్ని వాళ్లు అంగీకరించారు.

పింగళుడు వెంటనే సముద్రం మారుమోగేలా అరుస్తూ, "సరంగునూ, వాడి అనుచరులనూ హతమార్చండి, రండి!" అంటూ ముందుకు దూకాడు.

బానిసలందరూ ఒకేసారి సింహాల్లా గర్జిస్తూ తమను హింసలపాలు చేసిన సరంగు మీదా, అతడి అనుచరులమీదా కత్తులు దూసి దూకారు. పరిస్థితి యిలా విషమంగా పరిణమిస్తుందని సరంగు వూహించలేదు. ఒకవైపునుంచి శత్రుఓడ నిప్పులు చెరుగుతూ వస్తున్నది. అదే సమయంలో తన ఓడలోని బానిసలు తనమీద కత్తులు దూకారు.

సరంగుకు ఆలోచించేందుకు వ్యవధి లేదు. అతడు తన అనుచరులకు ఆజ్ఞలు







యిచ్చేలోపలే బానిసలు వారిమీద పడి కత్తులతో వాళ్లను ముక్కలుగా నరికేస్తున్నారు. "ద్రోహం, మోసం! ముందు యీ బానిసలను యమపురికి పంపండి!" అంటూ సరంగు భీకరంగా అరిచి వాళ్లమీద పడ్డాడు. బలశాలీ, జిత్తులమారీ అయిన సరంగు కత్తిదెబ్బకు కనుమూసి తెరిచేంతలో అయిదారుగురు బానిసలు ఆహుతి అయారు. అది చూసిన కొందరు బానిసలు భయకంపితులై వెనక్కు పారిపోసాగారు.

పింగళుడు ప్రమాదం గుర్తించాడు. వెంటనే అతడు కత్తి పైకెత్తి సరంగుకేసి లంఘిస్తూ, పారిపోతున్న బానిసలను హెచ్చరించాడు. "సరంగును ఒక్క క్షణంలో నా కత్తికి ఎరచేస్తాను. మీరు ప్రాణభయంతో పారిపోయినా, మిమ్మల్ని సముద్రం పొట్టను పెట్టుకోక మానదు. మీ స్వేచ్ఛకొరకు తెగించి పోరాడండి!"

పింగళుడి మాటలు పారిపోతున్న బానిసలలో తిరిగీ ధైర్యోత్సాహాలను కలిగించినై. యీలోపల పింగళుడు కొదమసింహంలా గర్జిస్తూ, సరంగును ఎదుర్కొన్నాడు. అతడు తొలిసారిగా విసిరిన కత్తిదెబ్బ, సరంగు గుండెలను రాచుకుంటూ పోయింది. సరంగు "హా, భైరవీ!" అంటూ గుండెమీద చేయి నొక్కిపట్టి, నిప్పులు చెంగే కళ్లతో పింగళుడిమీదికి కత్తి ఝళిపిస్తూ వురికాడు.

సరంగు దేహబలం, కత్తియుద్ధంలో అతడి నేర్పూ చూసిన పింగళుడు, చప్పున పక్కకు తప్పుకున్నాడు. సరంగు ఆ ఆవేశంలో పింగళుడు తన కత్తిదెబ్బకు అందక పోగా, ముందుకు తూలి ఒక తాడు కాలికి చుట్టుకునేసరికి బోర్లాపడిపోయాడు. పింగళుడికి యిది మంచి అవకాశం యిచ్చింది. అతడు భీకరంగా అరుస్తూ, సరంగు వీపుమీద కత్తిని గుచ్చబోయాడు. కాని, సరంగు తనకు రానున్న ప్రమాదాన్ని గ్రహించి చటుక్కున పక్కకు దొర్లాడు.

పింగళుడి కత్తి అక్కడ వున్న కొయ్యలో బలంగా గుచ్చుకుని ఠపీమని మధ్యకు విరిగిపోయింది.

సరంగు వికటాట్టహాసం చేశాడు. "ఓహో, నువ్వు బానిసల నాయకుడివి గామోలు! నాయకుడు ఎంత ప్రమాదంలో చిక్కుకుపోయాడు! యీ కత్తితో నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి సముద్రం పాలు చేస్తాను. తరవాత నీ అనుచరు లందర్నీ..."

సరంగు ఒళ్ళుతెలియని ఆవేశంలో వుండి, పింగళుడు ఏమి చేస్తున్నదీ గమనించలేదు. తన కత్తి విరిగిపోగానే పింగళుడు రానున్న ప్రమాదాన్ని వెంటనే గ్రహించాడు. మరో కత్తి దొరకపుచ్చుకునేందుకు అందు బాటులో ఎక్కడా లేదు. తన అనుచరు లైన యితర బానిసలు సరంగు అనుచరు లతో పోరాడుతున్నారు.

పింగళుడు మెరుపులా పక్కన పడివున్న తాడు నొకదానిని 'చేతికి తీసుకుని, దాని కొసను వుచ్చులా బిగించి, సరంగుకోసం సర్వసిద్ధంగా వున్నాడు. ఒళ్ళుమరిచిన ఆవే శంలో సరంగు అరుస్తూ కత్తితో ముందుకు దూకబోయేంతలో, పింగళుడి చేతనున్న తాడు గిర్రున తిరుగుతూ పోయి, సరంగు గొంతుకు వుచ్చు బిగుసుకున్నది. వెంటనే



పింగళుడు తన చేత గల తాడును గట్టిగా గుంజుతూ వెనక్కు పరిగెత్తాడు.

సరంగు పెద్దగా ఓంగ్రపెట్టి, మానులా దభీమని ముందుకు పడిపోయాడు. కాని, అతడు తన చేతి కత్తితో తాడును కోసందుకు ప్రయత్నించాడు. అది గమనించిన పింగళుడు వెనక్కు తిరిగి తన అనుచరులను కేకవేశాడు. వెంటనే యిద్దరు బానిసలు పరిగెత్తుతూ వచ్చి, సరంగు కింద పడి వుండటం చూస్తూనే అతడిమీదికి వురికి, తమ కత్తులతో తూట్లుపడేలా పొడిచారు.

సరంగు మరణంతోగాని పింగళుడికి తన చుట్టూ ఏమి జరుగుతున్నదీ చూసే అవకాశం కలగలేదు. అతడు ఒక బానిసవద్ద నుంచి కత్తి తీసుకుని, ఓడలో ఒకమూల జరుగుతున్న పోరాటంకేసి పరిగెత్తాడు. అతడు ఆ ప్రాంతానికి చేరేసరికి, కొద్దిగా మిగిలివున్న సరంగు అనుచరులుకూడా చంపబడటమో, గాయపడి ఖైదీలుగా దొరకటమో జరిగిపోయింది.

ఈ లోపల శత్రుఓడలోని సైనికులు కోలాహలంగా అరుస్తూ, పింగళుడున్న ఓడను సమీపిస్తున్నారు. వాళ్ళు విధీ విరామం లేకుండా ఓడమీదికి బాణాలు వదలటం మాత్రం మానలేదు. తమ శత్రుఓడలో ఏదో కలహం ప్రారంభమయిందనీ, యిదే అద





నుగా తాము దాన్ని వశపరుచుకోవచ్చునని వాళ్లు భావించారు.

పింగళుడికి ఏమి చేసేందుకూ పాలుపోలేదు. ఆ శత్రుఓడతో పోరాడటం తన వెంటవున్న కొద్దిమంది అనుచరులవల్లా సాధ్యమయేది కాదు. అలా కాదని దానికి లొంగిపోతే, వాళ్ళు తిరిగి తమను బంధించి, తమచేత బానిసవృత్తి చేయించవచ్చు. అసలు శత్రుఓడలో వున్న నావికులెందరు?

పింగళుడు, సరంగునుంచి లాక్కున్న దుర్భిణిలోంచి శత్రుఓడకేసి చూశాడు. ఓడ అంతా నావికులతో కిటకిటలాడిపోతున్నది. ఇక వాళ్ళతో పోరాడి లాభం



లేదని పింగళుడు గ్రహించాడు. ముందు తన ఓడమీద తెల్లజెండా ఎత్తి, తమ పరిస్థితిని ఆ ఓడలోనివారికి తెలియపరిచి, రాజీమార్గంగా ఎవరిదారిన వాళ్ళు పోవటం ఒక్కటే మంచిమార్గంగా అతడికి తోచింది. కాని, వాళ్లు అందుకు అంగీకరిస్తారా?

తమ ఓడమీదికి శత్రునావికులను రానీయకుండా, ఆ ఓడను అంతదూరాన వుంచి రాజీరాయబారాలు నడపటం క్షేమమని పింగళుడు నిర్ణయించుకున్నాడు. వెంటనే అతడి ఆజ్ఞప్రకారం ఓడకొయ్యకు తెల్లజెండా ఎత్తబడింది. మరుక్షణం శత్రుఓడలోంచి విజయధ్వానాలు వినబడినై.

పింగళుడు పెద్దబూరలాంటి సాధనంలోంచి, శత్రుఓడలోనివారితో, తన ఓడలో జరిగినదానిని గురించి చెప్పాడు. "మీ ఓడను ఆటకాయించి, వశపరుచుకోవాలని చేసిన ప్రయత్నంతో మాకెవరికీ సంబంధంలేదు. బానిసలమైన మేమందరమూ, క్రూరుడైన మా యజమాని సరంగునూ, అతడి అనుచరులనూ హతమార్చాము. ఇక యిప్పుడు మేము కోరేదల్లా మా ఓడను ఏదో ఒక రేవుకు నడిపి, అక్కడినుంచి ఎవరెవరి దేశాలకు వాళ్లం వెళ్లిపోవటం. కనక, మీరు రాజీపడి మా జోలికి రాక, సముద్రంమీద







మీ దారిన మీరు వెళ్ళవలసిందిగా కోరుతున్నాము," అన్నాడు పింగళుడు.

ఈ మాటలు వింటూనే శత్రుఓడలో గందరగోళం బయలుదేరింది. కొంచెంసేపు తరవాత అది సద్దుమణిగ్గానే, భీకరమైన ఒక గొంతు యిలా అరిచింది.

"బానిసలైన మీకు స్వేచ్ఛగా మహాసముద్రాలమీద ఓడను నడిపే హక్కు లేదు. పైగా యజమానినీ అతడి అనుచరులనూ చంపటంద్వారా మీరు క్షమించరాని నేరం చేశారు. అందుకు మీరు శిక్ష అనుభవించవలసిందే. లేకపోతే, మీనుంచి పాఠం నేర్చుకుని, మా ఓడలోని బానిసలుకూడా ఒకానొక రోజున మమ్మల్నందర్నీ తుదముట్టించవచ్చు. ఓడకు లంగరు దించి, కిమ్మనకుండా మాకు లొంగిపోండి!"



ఈ మాటలు వింటూనే పింగళుడు నిర్విణ్ణుడయిపోయాడు. అది వర్తకపు ఓడ ముసుగులో దాగివున్న సముద్రపు దొంగల ఓడ అని అతడికి అర్థమైపోయింది. అలాంటి ఓడలోని వారికి తనూ, అనుచరులూ లొంగటమంటే, తిరిగి తామందరూ బానిసలుగా అమ్ముడుపోవటమే నన్నమాట.

ఒకటి రెండు మాటల్లో పరిస్థితి నంతా పింగళుడు తన అనుచరులకు చెప్పాడు. వారిలో ప్రతిఒక్కరూ పోరాడటానికే సిద్ధమన్నారు. లొంగిపోయి జీవితమంతా బానిసలుగా బతకటంకన్న, పోరాడుతూ మరణించి సముద్రంపాలు కావటం ఉత్తమం అని వాళ్ళు ఏకకఠంగా జవాబిచ్చారు.

వెంటనే ఓడ స్తంభంమీంచి తెల్లజెండా దించబడింది. ఓడలోంచి జయజయధ్వానాలు మిన్ను ముట్టినై. సంఖ్యాబలంలో అధికులైన శత్రు సైనికులు, ఒకసారి తన ఓడలోకి ఎక్కగలిగితే, యిక తను చేయగలిగిందేమీ లేదు. కనుక, సాధ్యమైనంతవరకూ శత్రుఓడకు దూరంగా వుండి బాణాలతో యుద్ధం చేస్తూ, యిక తప్పనిసరి







అయితే, తన ఓడతో శత్రుఓడను ఢీకొట్టా లని పింగళుడు నిర్ణయించుకున్నాడు:

తిరిగి యుద్ధం ప్రారంభమయింది. పింగళుడి అనుచరులు బాణాలు ఎక్కుపెట్టి శత్రుఓడమీదికి వదులుతున్నారు. పింగళుడు ఓడను వెనక్కు నడపమన్నాడు. సాధ్యమైతే, పోరాడుతూనే తనఓడను శత్రుఓడకు అందకుండా నడిపించుకు పారిపోవాలని కూడా పింగళుడు నిర్ణయించుకున్నాడు. కాని, శత్రుఓడనుంచి పారిపోవటం సాధ్యమయే పని కాదని కొద్దిసేపట్లోనే తేలిపోయింది. చూస్తూండగానే ఆ ఓడ బహు వేగంగా ముందుకు రాసాగింది.

పింగళుడు చటుక్కున ఒక నిర్ణయానికి వచ్చాడు. విజయమో, వీరస్వర్గమో—అంతకన్న మార్గం లేదు. ఓడను వేగంగా ముందుకు నడిపి, శత్రుఓడను ఢీ కొట్టవలసిందిగా అతడు తన అనుచరులను ఆజ్ఞాపించాడు. వెంటనే ఓడ ముందుకు కదలసాగింది. మొదట ఆశ్చర్యపడి, అంతలోనే పింగళుడు తలపెట్టిన దేమిటో గ్రహించిన శత్రుసైనికులు భయంతో కంపించిపోయి, ఒక్కసారిగా హాహాకారాలు చేశారు.

ఓడను వెనక్కు నడపటంద్వారా ప్రమాదాన్నుంచి బయటపడేందుకు శత్రుసైనికులు చేసిన ప్రయత్నం ఫలించలేదు. పింగళుడు కత్తి ఝళిపిస్తూ, తన అనుచరులకు ఓడను వేగంగా ముందుకు నడిపి శత్రుఓడను ఢీకొట్టవలసిందిగా హెచ్చరిస్తున్నాడు. చూస్తూండగానే ఓడ మహా వేగంతో ముందుకు కదిలి, శత్రుఓడను తాకింది. ఆ మరుక్షణంలో వేయి గొంతులు కలిసికట్టుగా చేసిన ఆర్తనాదం సముద్రం మీద మారుమోగింది. రెండు ఓడలూ ఢీకొనటంలో కలిగిన తాకిడికి, పింగళుడు తను వున్న చోటునుంచి గాలిలోకి ఎగిరి, గిరవాటు వేసినట్టు దూరంగా సముద్రంలో పడిపోయాడు. —(ఇంకా వుంది)






## 14

[క్రూరుడైన ఓడసరంగువల్ల అనేక యిక్కట్లు పొందిన బానిసలు, పింగళుడి నాయకత్వం కింద తిరుగుబాటు చేసి, అతణ్ణి హతమార్చారు. అదే సమయంలో శత్రుఓడ, వారున్న ఓడను సమీపించింది. పింగళుడు తన ఓడతో, శత్రుఓడను ఢీకొట్టాడు. ఆ తాకిడికి పింగళుడు ఓడమీదినుంచి ఎగిరి దూరంగా సముద్రంలో పడిపోయాడు. తరవాత—]

పింగళుడు ఒక బుడక వేసి నీటిమీదికి తేలి చుట్టూ కలయచూశాడు. రెండు ఓడలూ ఒకదానినొకటి ఢీకొనడంతో, ఆ తాకిడికి బద్దలై, కొయ్యముక్కలూ, చెక్కలూ, తెర చాపలూ చెల్లాచెదురుగా—నలుమూలలకూ ఎండుటాకుల్లా ఎగిరిపోతున్నయి. మునిగిపోతున్న నావికులు చేసే హాహాకారాలు, తుఫాను ఘోషలో అణగారిపోయినై.

ఉవ్వెత్తున లేచి పడుతున్న సముద్రపు టలలో చిక్కి పింగళుడు ఉక్కిరిబిక్కిరై పోయాడు. తను సురక్షితంగా భూప్రదేశం చేరేందుకు యిప్పుడు ఓడ అంటూ ఏమీ లేదు. రెక్కల బలాన్ని నమ్ముకుని యీదేందుకు, తీరం ఎటువైపున వున్నదో తెలియదు. యీ దుర్దశ తన ఒక్కడికే కాక, తన శత్రువులకూ, మిత్రులకుకూడా కలిగిందని గ్రహించినప్పుడు పింగళుడికి ఆనందంతో పాటు బాధకూడా కలిగింది.

తన ప్రాణాన్ని కాపాడుకునేందుకు, తను ఎటు యీదుకుపోవాలో పింగళుడికి అర్థంకాలేదు. కనుచూపు మేరలో ఎక్కడా భూమిఅంటూ కనిపించనప్పుడు, తను వున్న









న్నది. పింగళుడి చేతులకు దొరికిన వస్తువు, ఓడ పగలగా విడిపోయిన ఒకానొక కొయ్య పలక. పింగళుడు మనసులోనే దేవుడికి వెయ్యినమస్కారాలు పెట్టుకుని, ఆ కొయ్య పలకను బలంగా రెండుచేతుల మధ్యకూ తీసుకుని, దానిమీద బోర్లా పడుకున్నాడు. తుఫానూ సముద్రపుటలలూ కలిసి, తనను ఏదో ఒకనాడు, ఏదో ఒక తీరానికి తప్పక చేర్చగలవని అతడికి ఆశ కలిగింది. ఆ సమయంలో ఆకలీ, చలీ—వాటినిగురించి అతడు ఆలోచించ దలపలేదు.

కొయ్యపలక నీటి అలలవెంట తేలుతూ, మునుగుతూ కొట్టుకుపోతున్నది. పింగళుడు రెండుకళ్లూ గట్టిగా మూసుకుని, కొయ్యపలక తన పట్టునుంచి జారిపోకుండా చూసుకుంటూ తనచుట్టూ ఏమి జరుగుతున్నదీ గమనించేందుకైనా ప్రయత్నించలేదు. కారణం, అందువల్ల తనకు జరిగే మేలు లేకపోగా, పైపెచ్చు తనలో వున్న ధైర్యం కాస్తా నీళ్లుకారిపోయేందుకు అవకాశం యిస్తుందని అతడు భయపడ్డాడు.

కొన్ని గంటలకాలం గడిచిపోయింది. సూర్యుడు ఎక్కడో సముద్రాల అవతల అస్తమించాడు. చీకటి పడింది. కాని, పింగళుడికి యివేమీ తెలియవు. అతడి కళ్లు

చోటునుంచి కదిలేందుకు ప్రయాసపడటం వృథా అని అతడు నిశ్చయించుకున్నాడు. కాని, అల్లకల్లోలంగా వున్న సముద్రం అతణ్ణి ప్రతిక్షణం అటూయిటూ విసరివేస్తున్నది.

దాదాపు ఓ పావుగంటకాలం పింగళుడు అలలవెంట, అవి విసిరినవైపుకు పోతూ, మునుగుతూ తేలుతూ నానాయాతనా పడ్డాడు. ఇక తన చావు ఎంతో దూరంలో లేదని అతడు నిశ్చయించుకున్న మరుక్షణం అతడి చేతికి ఏదో వస్తువు తగిలింది. పింగళుడు చటుక్కున దాన్ని పట్టుకున్నాడు.

ఇంతకూ పింగళుడి తల్లి అన్నట్టు, అతణ్ణి ఎప్పుడూ అదృష్టదేవత వెన్నంటే వుంటు









గట్టిగా మూతలు పడేవున్నవి. సముద్రపు హెూరూ, తన శరీరం చలికి కొయ్యబారుతూ వుండటం తప్ప, అతడికి మరేమీ గుర్తులేదు. మరి కొంతసేపటికి దప్పికతో నాలుక పిడచ కట్టుకుపోతున్నట్టు అతడు గ్రహించాడు. అప్రయత్నంగా పింగళుడు యింత సముద్రపు నీటిని గుటకవేసి, వికారంతో కొయ్య పలకమీద మెలికలు తిరిగాడు. ఆ తరవాత భగ్గుమనే ఆకలి, నిద్రమత్తు. క్రమంగా పింగళుడు తను పట్టుకున్న కొయ్యపలకా, హెూరుపెడుతున్న సముద్రం, తను ప్రాణాపాయస్థితిలో వున్న సంగతీ—అన్నీ మరిచిపోయి గాఢనిద్రలోకి జారుకున్నాడు.

పింగళుడు తిరిగి కళ్లు తెరిచేసరికి, మబ్బులు లేని ప్రశాంతమైన నీలాకాశం అతడి కళ్ళబడింది. శరీరం నడుమునుంచి పైభాగం పొయ్యిలో పెట్టి కాల్చుతున్నట్టు చిటపటమంటున్నది. కాళ్లు చలితో కొయ్యబారిపోతున్నవి.

ఈ పరిస్థితి పింగళుడికి చాలా వింతగా తోచింది. తను ఎక్కడ వున్నట్టు? అతడు నీరసంగా తల పక్కకు తిప్పి చూశాడు. కనుచూపుమేర అంతా ఇసుక ఎడారి. పింగళుడు గతుక్కుమన్నాడు. ఆ నిమిషంలో అతడికి ప్రాణభయంతో పాటు,



ఎక్కడలేని సత్తువా వచ్చినట్టయింది. చప్పున రెండుచేతులు భూమికి ఆనించి లేచేందుకు ప్రయత్నించాడు. కాళ్ళు రెండూ నీళ్ళలో నానుతున్నవి. ఎదురుగా మహాసముద్రం ఏ అలలూ లేకుండా ప్రశాంతమైన సరస్సులా నిర్మలంగా కనిపించింది.

తన పరిసరాలు ఎటువంటివో, తను ఎలాంటి భూప్రదేశాన్ని చేరాడో పింగళుడు వెంటనే గ్రహించాడు. ఒకవైపున మహాసముద్రం, రెండవవైపున మచ్చుకైనా చెట్టూ చేమా లేని పెద్ద ఇసుకఎడారి!

పింగళుడు తూలుతూ రెండడుగులు ముందుకువేసి, సూర్యకాంతి కళ్ళమీద పడ





వేయిస్తాను. నువు యిప్పుడున్నది ఆఫ్రికా సముద్రతీరాన గల అరేబియాదేశప్రాంతం. నేను నవాబుగారి ఒంటెలపటాలం నాయకుణ్ణి. ఇక, నీ ఓడ సముద్రంమీద భగ్నం అవడం అదీ....అంతా నిజం చెప్పాలి, తెలిసిందా ?" అన్నాడు.

ఆ వచ్చినవాళ్లు దొంగలు కాదని, నవాబు సైనికులని తెలియగానే పింగళుడికి ఎక్కడలేని ఆనందమూ కలిగింది. ఆ ఎడారి ప్రాంతాన్ని పాలించే నవాబూ, అతడి ఒంటెలపటాలం నాయకుణ్ణని చెప్పే యితడూ, ఎలాంటి వారైనా ప్రస్తుతానికి మాత్రం తనకు ప్రాణభయం లేదు. తరవాత పరిస్థితులనుబట్టి, అందుకు అనుగుణంగా ప్రవర్తించవచ్చు. కనక, పూర్వగాథ అంతా వదిలి, తను బానిసగా ఓడలో చేరినప్పటి నుంచీ, జరిగిన వృత్తాంతం, అతడికి చెప్ప వచ్చునుకున్నాడు పింగళుడు.

ఆ ప్రకారమే, పింగళుడు పటాలం నాయకుడికి తను చేరిన ఓడసరంగును గురించీ, మహాసముద్రంమీద తారసపడిన మరొక ఓడకూ దానికీ జరిగిన యుద్ధం గురించీ సవిస్తరంగా చెప్పాడు. అంతా విన్న పటాలంనాయకుడు తృప్తిగా ఓ మారు నవ్వి, "అయితే, మీ ఓడను ఎదిరించిన



ఓడలోకూడా బానిసలున్నారనేవాంట్లో అనుమానం ఏమీ లేదుకదా ?" అని అడిగాడు.

"అవును, అందులో సందేహం లేదు. ఆ ఓడసరంగుతో నేను రాజీరాయబారం నడపాలని ప్రయత్నించినప్పుడు, అతడిచ్చిన జవాబునుబట్టి, అతడూ బానిసలను కొని అమ్మే వ్యాపారేనని తెలుస్తున్నదిగదా ?" అన్నాడు పింగళుడు.

పటాలం నాయకుడు అవునన్నట్టు తల వూపి, "నాపేరు హసన్‌గోరీ. నాలాగే నువ్వు, యుద్ధంలో చాలామందికి నాయకత్వం వహించావు గనక, నువ్వు నాతో సమానుడివే. కనక, నన్ను ఆ పేపలో నువ్వు








కుండా చేతిని అడ్డంగా పెట్టుకుని, దూరంగా గమనించి చూశాడు. అల్లంత దూరాన ఆకాశంలో ఎగురుతున్న కొన్ని రాబందులు అతడి కంటబడినై. అవి ఎక్కడికో ఎగిరి పోవటంకాక, ఒకేప్రదేశాన చుట్టూ వలయాకారంగా ఎగురుతూ, కిందికి దిగివస్తున్నవి.

పింగళుడిలో ఆశ్చర్యంతోపాటు, ఆశ కూడా మొలకలెత్తింది. రాబందులు ఎగురుతున్న ప్రదేశంలో ఏదో జలాశయంగాని, పల్లెపట్టుగాని తప్పక వుండివుంటుందని అతడు భావించాడు. ఈ తలపు కలగగానే, అతడిలో ఎక్కడలేని శక్తి పెల్లుబికింది. దృష్టిని ఆ రాబందులు ఎగురుతున్న ప్రదేశం



మీదే లగ్నంచేసి, అతడు భగ్గుమని కాలుతున్న ఇసుకలో ఊపికకొందికి నడవసాగాడు.

కొద్దిసేపటికల్లా పింగళుడు ఆ ప్రదేశాన్ని సమీపించాడు. అసరికి కొన్ని రాబందులు కిందికి దిగి, అక్కడ పడివున్న ఏదో వస్తువును చుట్టుముట్టుతున్నవి. ఆ దృశ్యం చూస్తూనే పింగళుడు నివ్వెరపోయాడు.

ఒకవ్యక్తి కాళ్లూ చేతులూ, తాడుతో వెనక్కు విరిచికట్టబడి, ఒక రాతికి ఆనించబడివున్నాడు. అతడిలో ఏమాత్రం చలనం వున్నట్టులేదు. రాబందులు, అతణ్ణి పీక్కు తినేందుకు చుట్టూ మూగుతున్నవి. పింగళుడు, ఓ తృటికాలం ఆ నిర్భాగ్యుడికేసి చూసి, చప్పున వంగి అక్కడ దొరికిన చిన్న రాతిముక్కను తీసుకుని, రాబందులకేసి విసిరాడు. వెంటనే కొన్ని రాబందులు రెక్కలు టపటపలాడించి ఆకాశంలోకి లేచినై. మరికొన్ని అంతదూరం పరిగెత్తి, అక్కడ నిలబడి ఆశగా తమకు కానున్న ఆహారంకేసి చూస్తున్నవి.

పింగళుడు ఆ వ్యక్తిని సమీపించాడు. అతడి కళ్లు మూతలుపడి వున్నవి. ఏమాత్రమైనా ప్రాణం వున్న సూచన కనబడుతుందేమో అని, పింగళుడు అతడి గుండెలమీద చేయివేసి పరీక్షించాడు. చలనం లేదు.









ఈ ఇసుక ఎడారిలో ఎవరు, ఏ కారణం వల్ల ఈ మనిషిని ఇటువంటి ఘోరమరణం పాలుచేశారో పింగళుడి ఊహకు అందలేదు. కాని, అతడికి ఆ నిమిషంలో ఒక కొత్త విషయం అర్థమైంది. భయంకరంగా, నిర్జనంగా కనిపించే, యీ ఎడారిలో ఎక్కడో ఒకచోట జననివాసాలు వున్నవి. వాళ్లు ఎటువంటివారో వూహించటంకూడా ఏమంత కష్టంకాదు. ఒక మనిషిని నిస్సహాయుణ్ణిగా చేసి, రాబందులకు ఆహారంగా వదిలిపోవటాన్నిబట్టి, వాళ్లు చాలా క్రూరులై వుంటారని పింగళుడు భావించాడు.

ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి? ముందు దాహం తీర్చుకునేందుకు తనకు యింత మంచినీరు కావాలి. తరవాత ఆహారం. ఇవి తనకు ఎక్కడ లభిస్తవి?

పింగళుడు యిలాంటి సమస్యలతో సతమతమవుతూండగా, దూరంగా, ఎడారిలో తిరుగుతున్న ఒకానొక ఒంటెల పటాలం నాయకుడు, తన దుర్భిణీలోంచి అతణ్ణీ, పక్కన వున్న చనిపోయిన వ్యక్తినీ, చుట్టూ ఎగురుతున్న రాబందుల సమూహాన్నీ చూశాడు. మరుక్షణం అతడి ఆజ్ఞ కాగానే ఒంటెల పటాలం అమిత వేగంగా, ఆ ప్రదేశం వైపుకు పరిగెత్తిరాసాగింది.

దూరంగా ఎడారిలో దుమ్ము లేస్తూండటాన్ని గమనించి మొదట ఆశ్చర్యపడిన పింగళుడికి, అంతలోనే దానికి కారణం అయిన ఒంటెల పటాలం స్పష్టంగా కనబడగానే వుత్సాహంతోపాటు భయంకూడా కలిగింది. ఒకవేళ ఆ వచ్చేవాళ్లు ఎడారి దొంగలైతే, ఆ నిమిషంతో తన బ్రతుకు అవసాన దశకు వచ్చినట్లే అని అతడు భయపడ్డాడు. కాని, పారిపోయి ఎక్కడైనా దాక్కునేందుకు స్థలంగాని, అందుకు అవసరమైన దేహబలంగాని తనదగ్గిర లేదు. అసలు తను యిప్పుడున్న దీనస్థితిలో కాలుతీసి కాలు పెట్టటమే అంతంతమాత్రంగా వుంది.





వాడు మనవాడే! మిగతా కోట కావలా దళం ఏమయినట్టు? బహుశా, కోట రాబందు వశం కాలేదుగదా?" అంటూ విస్తుపోయాడు.

ఈలోపల పటాలంలోని ఒకడు పింగళుడి వీపుమీద తన యీటెను ఆనించి, "నిజం చెప్పు, మీ నాయకుడు రాబందు ఎక్కడ?" అంటూ గద్దించి అడిగాడు.

పింగళుడికి ఆ ప్రశ్న ఏమీ అర్థంకాలేదు. బహుశా ఆ రాబందు అనబడేవాడు ఏదో దొంగల ముఠాకు నాయకుడై వుంటాడు. అలా అయితే, వీళ్లు ఎవరు?

"నేను ఎవరి అనుచరుణ్ణీ కాదు. మహా సముద్రంమీద తుఫానులో చిక్కి నేనున్న ఓడ భగ్నంకాగా, దేవుడి కృపవలన ప్రాణాలతో యీ తీరం చేరాను. ఇక్కడ, ఈ మృతుణ్ణి రాబందులు పీక్కుతినబోవటం చూసి యిక్కడికి వచ్చాను. ఇది ఏ దేశమో, యీ ఎడారి పేరేమిటోకూడా నాకు తెలియదు," అన్నాడు పింగళుడు. ఒంటెల పటాలం నాయకుడు, పింగళుడికేసి మరో సారి పరిశీలనగా చూసి, "నువ్వు చెప్పేది నిజమయితే, నీకు వచ్చిన భయమేమీలేదు. కాని, ఒకవేళ అబద్ధం అయితేమాత్రం నిన్ను ముక్కలుముక్కలుగా నరికించి, ఆ ఎగురుతున్న రాబందులకు ఆహారంగా

పింగళుడు యిలాంటి వూహలతో, అనుమానాలతో పుక్కిరిబిక్కిరవుతూండగా ఒంటెల పటాలం అక్కడికి రానేవచ్చింది. గంభీరమైన పెద్ద గొంతుతో నాయకుడు ఆజ్ఞాపించగానే, పటాలంలోని ప్రతిఒక్కరూ తమతమ వాహనాలను దిగి, పింగళుణ్ణి చుట్టుముట్టారు. నివ్వెరపోయి, నోట మాట రాక తడబడుతున్న పింగళుణ్ణి, వాళ్ళ నాయకుడు కొంచెంసేపు నిలువెల్లా పరీక్షగా చూసి, "నువ్వు రాబందు అనుచరవర్గం లోనివాడివా?" అని ప్రశ్నిస్తూ, చనిపోయిన వ్యక్తిదగ్గిర వంగి, పరీక్షగా చూసి, చప్పున తన అనుచరులకేసి తిరిగి, "ఈ చనిపోయిన







పిలవవచ్చు. మేము, 'రాబందు' అని పిలవబడే ఒకానొక ఎడారిదొంగను హత మార్చేందుకు, యీ ఎడారిలో గస్తీ తిరుగు తున్నాం. యీ కాళ్ళూ చేతులూ బంధింప బడి, మరణించిన వ్యక్తి సవాబుసైన్యంలోని వాడే! ఇతడు ఎడారిలో వున్న ఇఫీఖిల్లాను రక్షిస్తున్నవాళ్ళల్లో ఒకడు. ఇతణ్ణి ఏ విధంగా ఆ రాబందు పట్టుకోగలిగాడో నాకు అర్థం కావడం లేదు. నా భయం ఏమిటంటే, దురదృష్టవశాత్తూ ఆ ఖిల్లా రాబందు వశం అయిపోయిందేమోనని," అంటూ అతడు సైనికులకేసి తిరిగి, "ఈ క్షణంనుంచి యితణ్ణి కూడా పటాలంలో ఒకడుగా భావించండి. పాపం, ఆకలికి అలమటిస్తున్నట్టున్నాడు, ఆహారం, నీరూ యివ్వండి," అన్నాడు.

హసన్‌గోరీ అలా అనేసరికి, పింగళుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. సైనికులిచ్చిన రొట్టెలు తిని, చల్లని నీరు యింత తాగి, అతడు తృప్తిగా లేచి నిలుచున్నాడు. వెంటనే హసన్‌గోరీ పింగళుడికి ఒక ఒంటెను చూపిస్తూ, "ఈ ఒంటె యిక నుంచి నీ వాహనం. మనం యిప్పుడే బయలు దేరుతున్నాం. ఇఫీఖిల్లాను రాబందు ఆక్ర మించుకున్నాడేమో అని నాకు అనుమా నంగా వుంది," అంటూ ఒక సైనికుడికేసి తిరిగి, "ఆ శవాన్ని ఒక ఒంటెమీద వేయండి. ఖిల్లాదగ్గిర సమాధి చేద్దాం. ఈ రాబందులకు ఆహారంగా అతణ్ణి వదలటం మహాపాపం," అన్నాడు.

కొద్దిసేపట్లోనే పటాలం బయలుదేరింది. ఎడారిలో రేగుతున్న ఎడతెగని యిసుక తుఫా నుల్లో ప్రయాణిస్తూ, సూర్యుడు పశ్చిమానికి దిగుతూండగా, పటాలం ఇఫీఖిల్లాకు కను చూపుమేరలో చేరింది. ఖిల్లా పరిసరాలు నిర్మానుష్యంగా వున్నవి.

హసన్‌గోరీ, పింగళుడికేసి తిరిగి ఆశ్చ ర్యంగా కనుబొమలు ముడివేసి, ఖిల్లావైపుకు చేయిచూపాడు. —(ఇంకా వుంది)








## 15

[ఓడ ముక్కలు చెక్కలై నీట మునగగా, పింగళుడు ఒక కొయ్యను ఆధారంగా చేసుకుని సముద్రంలో యీదుకుపోయి ఒక ఎడారిప్రాంతాన్ని చేరాడు. ఆతడికి నవాబుగారి సేనానాయకుడు హసన్‌గోరీ అనేవాడితో పరిచయం అయింది. ఇద్దరూ కలిసి ఎడారి దొంగలను పట్టుకునేందుకు 'ఇఫీఖిల్లా' అనే కోటవైపుకు బయలుదేరారు. తరవాత—]

నవాబుగారి ఒంటెలపటాలం నాయకుడైన హసన్‌గోరీ చేయి చూపినవైపుకు పింగళుడు దృష్టి సారించాడు. ఎదురుగా కనిపించుతున్నది; ఎడారిలో వున్న ఒక పురాతనమైన కోట. కోటపక్కనుంచి, చిన్న కొండవాగు ఒకటి ప్రవహిస్తున్నది. దానికి రెండు అంచులమీదా ఎత్తయిన ఖర్జూరచెట్లు గాలి తాకిడికి తలలు ఆడిస్తున్నవి. కోట బురుజులమీదగానీ, గోడలమీదగానీ మనుష్య సంచారమే లేదు. "ఇదేనా మీరనే ఇఫీ ఖిల్లా ?" అని అడిగాడు పింగళుడు.

"అవును, పింగళా! ఆ దూరంగా కొండలకేసి పోతున్న సన్నని రాజమార్గం నీ కంటికి కనుపించుతున్నదిగదా! అదే, బిడారువర్తకులు, టెహరాన్‌నుంచి కైరోకు వెళ్ళే మార్గం. దారిలో వున్న యీ కోట ప్రాంతం వారికి మజిలీగా వుపయోగిస్తున్నది. వారికి మార్గమధ్యంలో ఎడారిదొంగలనుంచి అపాయం కలగకుండా రక్షణయిచ్చేందుకు, యిక్కడ యీ ఇఫీఖిల్లా కట్టబడింది. దీన్ని కాపాడేందుకు రెండువందలమంది సైనికులు కూడా నియోగించబడ్డారు. వారంతా







ఏమయినట్టు? అంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వున్నది," అన్నాడు హసన్‌గోరీ.

"మనం ఖిల్లా లోపలకి వెళితే తప్ప, అక్కడ ఏమి జరిగిందీ తెలియదుగదా? బహుశా మీరు లోగడ అనుమానించినట్టు, ఆ ఎడారిదొంగ రాబందు తన అనుచరులతో, ఖిల్లామీద దాడిచేసి, సైనికులను హతమార్చివుంటాడు," అన్నాడు పింగళుడు.

"అంతే అయివుంటుంది. కాని, ఆ రాబందు అనుచరులైనా ఒక్కడూ కనిపించడే!" అన్నాడు హసన్‌గోరీ.

పింగళుడు తను వున్న ఒంటెను ముందుకు నడుపుతూ, "గోరీసాహెబ్!



మనం యిక్కడ నిలబడి, ఆ లోపల ఏం జరిగిందో వూహించ ప్రయత్నించటం వృధా శ్రమ. ఖిల్లాద్వారాన్ని చేరితేగాని—ఆ ప్రాంతాల ఎంతటి భీకరసంగ్రామం జరిగిందో తెలియదు. బహుశా ఎడారిదొంగలు ఖిల్లా ముఖద్వారాన్ని కాల్చి నుసి చేసి, తరవాత లోపలకు జొరబడి, సైనికులను హతమార్చి వుంటారు," అన్నాడు.

"నిజం, నిజం! పెద్ద పోరు జరగందే, మా సైనికులు లొంగే రకం కాదు. బహుశా ఎడారిదొంగలు వందల సంఖ్యలో వచ్చి ఖిల్లాను ముట్టడించి వుంటారు," అన్నాడు హసన్‌గోరీ.

క్రమక్రమంగా పింగళుడూ, హసన్‌గోరీ ఎక్కిన ఒంటెలు, ఖిల్లా గోడవెంట కొంత దూరం నడిచి ముఖద్వారం వున్న దిక్కుకు వచ్చినై. కొంచెం వెనకగా, హసన్‌గోరీ అనుచరులుకూడా అక్కడికి చేరారు.

ఖిల్లా ముఖద్వారం చెక్కుచెదరకుండా వున్నది. దాన్ని మామూలుగానే లోపలవున్న వాళ్ళు మూసినవిధంగా, తలుపులు రెండూ ఒకదానికొకటి అనుకునివున్నవి. ద్వారాల ముందు పోరు జరిగిన చిహ్నాలేమీ లేవు.

ఎంతో ప్రశాంతంగా కనిపించే యీ దృశ్యాన్ని చూస్తూనే హసన్‌గోరీ పొట్ట చెక్క







లయేలా బిగ్గరగా నవ్వాడు. తరవాత ఒంటె మీదినుంచి ఒక్క ఉరుకున కిందకు దూకి, "పింగళా! మనం అనవసర భయాలకు లోనయ్యాం. ఎంత జిత్తులమారీ, పొగరుబోతూ అయినా, ఆ రాబందు సాహసించి మా సైన్యాలను ముఖాముఖి ఎదుర్కోవటానికి తెగించలేడు. పోతే, యీ ఖిల్లా ప్రాంతం యింత నిర్మానుష్యంగా వుండటానికి కారణం యిప్పుడిప్పుడే నాకు అర్థమవుతున్నది," అంటూ చిరునవ్వునవ్వాడు.

పింగళుడు, హసన్‌గోరీకేసి ప్రశ్నార్థకంగా చూశాడు. హసన్‌గోరీ పింగళుడికి మరింత దగ్గిరగా వచ్చి, "మావాళ్లంతా గొంతుల వరకూ తాగి, ఆకైపులో మైమరచి నిద్రపోతూండివుంటారు!" అన్నాడు.

పింగళుడు అనంగీకారంగా తలవూపి, "అలా అనుకున్నా....ఆ ఎడారిలో వున్న సైనికుడు అక్కడ రాబందుల పాల ఎలా పడినట్టు? అతడుకూడా యీ ఖిల్లారక్షకులలో ఒకడుగదా?" అని అడిగాడు.

"ఆ పొగరుబోతు బహుశా ఖిల్లానుంచి ఒంటరిగా బయటికి వచ్చి, తాగిన మైకంలో ఏ ఖర్జూరచెట్టుకిందనో పడుకునివుంటే— ఆ రాబందు అతణ్ణి చేజిక్కించుకుని వుంటాడు," అన్నాడు హసన్‌గోరీ.



పింగళుడు ఓ క్షణకాలం వూరుకుని, తరవాత ఖిల్లాద్వారంకేసి నడుస్తూ, "మీరు చెప్పినవాటిల్లో ఏవొకటైనా నిజంకావొచ్చు, లేక మనం వూహించని ఏ దారుణ ప్రమాదమైనా జరిగిపోయినా పోవచ్చు. ముందు, ద్వారం తలుపులకు లోపల గడి వేసివున్నదో లేదో చూస్తాను!" అంటూ జాగ్రత్తగా వాటిని సమీపించి, ఎత్తుగా, దృఢంగా వున్న ఆ దేవదారు చెక్కలను రెండు చేతులతోనూ బలంగా వెనక్కు తోశాడు.

తానంత బలం వుపయోగించటం వృథా అని పింగళుడు వెంటనే గ్రహించాడు. లోపల గడి వేయబడని ఆ తలుపులు కిర్రు







మని శబ్దంచేస్తూ, చేయి పట్టేంతగా వెనక్కు జరిగినై. అది చూస్తూనే పింగళుడు ఒక పెద్ద కేకపెట్టి చెంగున గోడపక్కకు పరిగెత్తాడు. మరుక్షణంలో భూమ్యాకాశాలు బద్దలయినవా అన్నంత భయంకర ధ్వనితో, తలుపుల వెనక మాటుగా దట్టించబడిన తుపాకీమందు పేలి, తలుపు దర్వాజాలనూ, కోటగోడలోని ముందుభాగాన్ని చెల్లాచెదరుగా గాలిలోకి ఎగరకొట్టింది.

ఆ ధ్వనీ, దానితోపాటు లేచిన మంటలూ పొగా అక్కడ వున్న అందర్నీ నిశ్చేష్టులను చేసింది. తలుపు దర్వాజాల చెక్కలూ, కోటగోడ రాళ్లూ తగిలిన కొందరు బాధతో



హాహాకారాలు చేశారు. గాయపడిన ఒంటెలు కొన్ని చెవులు చిల్లులుపడేలా అరుస్తూ, రౌతులను పడదోసి ఎడారిలో అన్నివైపులకూ చెల్లాచెదురుగా పారిపోయినై.

ఆ ప్రదేశాన్నంతా అలుముకున్న పొగ, గాలితాకిడికి విచ్చిపోగానే పింగళుడు, తన చుట్టూ జరిగిన భీభత్సాన్ని చూశాడు. ఒంటెల పటాలంలో కొందరు మరణించారు, కొందరు గాయపడి బాధతో మూలుగుతున్నారు. ఆ దృశ్యాన్ని చూస్తూనే కంపించిపోయిన పింగళుడు, త్వరలోనే తెప్పరిల్లి, హసన్‌గోరీ కోసం గాలించసాగాడు. అతడు అక్కడికి అనతిదూరంలో వున్న ఒక ఖర్జూరపుచెట్టు దగ్గరకు గాలితాకుడువల్ల ఎగిరిపోయి, పింగళుణ్ణి చూస్తూనే లేచి కూర్చునేందుకు ప్రయత్నించాడు.

పింగళుడు, హసన్‌గోరీని సమీపించి, తన చేతిని అతడికి ఆసరాగా యిస్తూ, "పెద్ద గాయాలేమీ తగలలేదుగదా?" అని ప్రశ్నించాడు.

"అటువంటి ప్రమాదం ఏమీ జరగలేదు. మందు పేలినప్పుడు పుట్టిన గాలి తాకుడుకు ఎగిరి యింత దూరాన పడ్డాను. ఉదయం లేచిన వేళావిశేషం! ఎంతో అదృష్టవంతుణ్ణి!" అన్నాడు హసన్‌గోరీ.










"ఆమాట మెల్లిగా అంటావేం, హసన్! తలుపులు తేలిగ్గా వెనక్కు కదిలేసరికే, ఆ వెనక ఏదో మాటు పెట్టబడివుంటుందని నేను గ్రహించాను. అందుకే నేను పెద్దగా కేకపెట్టి ఖిల్లా గోడపక్కకు పరిగెత్తటం జరిగింది. అయినా, దురదృష్టం కొందికీ, నా హెచ్చరికతోపాటే, ఆ దట్టించబడిన తుపాకీ మందు పేలింది!" అంటూ పింగళుడు వెనుదిరిగి చూసి, "దాదాపు సర్వనాశం జరిగిపోయింది. సైనికులు మూడువంతులు మరణించివుంటారు," అన్నాడు.

హసన్‌గోరీ బాధగా లేచి నిలబడి, దుస్తులకు పట్టిన దుమ్మూ యిసకా దులుపుకుంటూ, "ఇది ఆ రాబందు మనను హతమార్చేందుకు వేసిన ఎత్తు. కోటలోవున్న సైనికులందరినీ తుదముట్టించింతరవాత మనను నాశనం చేయటానికి యీ కపటోపాయం ప్రయోగించాడు. ఇక, యిప్పుడు మనం చేయవలసింది, చావగా మిగిలిన సైనికులతో, ఆ క్రూరకర్ముణ్ణి వెతికి వెంటాడి చిత్రహింసలు పెట్టి యమపురికి పంపటం," అన్నాడు ఎంతో ఉద్రేకంగా.

ఆ తరవాత పింగళుడూ, హసన్‌గోరీ కలిసి గాయపడిన సైనికులందరనూ ఖిల్లా గోడ నీడకు చేర్చి, వాళ్ళ గాయాలకు కట్లుకట్టేందుకు కొందరిని నియోగించి, మిగిలిన వారితో ఖిల్లాలోపలకు వెళ్ళారు.

ఖిల్లాలో వారికి ఎదురైన భయంకర దృశ్యం, యిద్దరినీ స్థాణువుల్లా చేసింది. అక్కడ వున్న ప్రతి భవనం, గుడారాలతో సహా నిలువెల్లా కాల్చబడి, ఒట్టి మొండి గోడలుమాత్రం బోసిగా కనిపించినై. ఎక్కడ చూసినా చెల్లాచెదురు చేయబడిన దుస్తులూ, ఆయుధసామగ్రి కంటబడింది. ఇక, మరణించిన సైనికుల శవాలు అడుగడుగునా ఎదురౌతున్నవి.

"పింగళా! ఒక్కగానొక్క సైనికుడైనా బ్రతికి వున్న సూచనలు లేవు. ఇక్కడ









అతడి ఆజ్ఞ కాగానే అయిదారుగురు సైనికులు ఎడారి అన్నివైపులకూ కొంతదూరం వెళ్లి, కొద్దిసేపట్లోనే తిరిగి వచ్చారు.

ఇసుకలో వున్న ఒంటెల కాలిగుర్తుల ద్వారా, ఆ సైనికులు రాబందు ముఠా ఎటు వెళ్లినదీ, తమ నాయకుడికి చెప్పారు. హసన్‌గోరీ, పింగళుడికి రెండుమూడు క్రోసుల దూరంలో వున్న చిన్న చిన్న పర్వతాలను చూపుతూ, "రాబందు సరాసరి ఆ కొండగుహల ప్రాంతానికి వెళ్ళాడు. తను సాధించిన విజయానికి గర్వించి, వాడిప్పుడు బహుశా తన కాలాన్ని వేడుకలలో గడుపుతూండవచ్చు. వాడి వూహ ప్రకారం, ఆ ఖిల్లాతలుపుల పక్కన వుంచి పోయిన మాటుకు మనంకూడా ఆహుతి కావలసినవాళ్లమేగదా?" అన్నాడు. పింగళుడు అవునన్నట్టు తల వూపాడు.

కొద్దిసేపట్లో, చావగా మిగిలిన సైనికులను వెంటవేసుకుని, హసన్‌గోరీతోపాటు, పింగళుడుకూడా ఆ పర్వతప్రాంతాలకు బయలుదేరాడు.

ఒక గంటకాలం తరవాత వాళ్ళు ఒకానొక పర్వత కనుమను సమీపించారు. పింగళుడు యిరుప్రక్కలా నిటారుగా లేచిన కొండరాళ్ళకేసి ఓమారు చూచి, "హసన్!

నిజంగా ఏం జరిగిందో, ఆ రాబందుకు తప్ప మరెవరికీ తెలియదు. ఇంతపెద్ద సైన్యాన్ని వాడు సర్వనాశనం చేయగలిగాడంటే, ఖిల్లాలోనే వాడికెవడో మిత్రుడొకడుండి వుండాలి," అన్నాడు హసన్‌గోరీ.

"కావచ్చు," అంటూ పింగళుడు చుట్టూ ఓసారి పరీక్షగా చూసి, "ఇక మనం కాలం వృథాచేయటం ఎందుకు! ఆ రాబందును వెంబడిద్దామా? అతడు యీ ఎడారిలో ఎటు పోయాడో...ఆ జాడలు తెలుసుకోవటం ఎలా?" అన్నాడు.

"అదేమంత కష్టంకాదు," అంటూ హసన్‌గోరీ బయటికి దారితీశాడు. తరవాత











మనం యిక్కడ రెండు ముఠాలుగా చీలటం మంచిదనుకుంటాను. మన వాహనాలను యిక్కడే వదిలి, యీ రాళ్ళగుట్టల్లో, కొండ గుహల్లో వాడెక్కడ దాగివున్నదీ వెతుకుదాం. కనబడితే, ఏదో సంకేతం ద్వారా యిరు పురమూ ఏకమై వాడి అంతు తేల్చు కుందాం," అన్నాడు.

హసన్‌గోరీ అంగీకరించాడు. పింగళుడు కొంతమంది సైనికులను వెంటదీసుకుని, కొండరాళ్లను ఎక్కుతూ దిగుతూ, రాబందు కోసం గాలించసాగాడు. క్రమంగా వెలుగు తగ్గి చీకటి వ్యాపిస్తున్నది.

అలాంటి సమయంలో హఠాత్తుగా పింగళుడికి, తను వున్న చోటుకు దిగువగా ఏదో అలికిడీ, ఆ వెంటనే కోలాహలం వినిపించింది. పింగళుడు తన సైనికులను హెచ్చరించి, ఒక ఎత్తయిన రాతిచాటున నక్కి కిందికి చూశాడు.

సమతలంగా వున్న ఒకచోట చాలామంది గుంపుగా చేరి పాటలు పాడుతూ, నాట్యాలు చేస్తున్నారు. వాళ్లు ధరించిన దుస్తులూ, చేసే రణగొణధ్వని వింటూనే, వాళ్లు ఎడారి దొంగలని పింగళుడు గ్రహించాడు. వెంటనే ముందనుకున్న ప్రకారం సంకేత సూచనగా, పింగళుడు కొమ్ముబూర వూదాడు.

కింద జరుగుతున్న నాట్యాలూ, పాటలూ, ఆ కోలాహలం అంతా ఒక్కసారిగా ఆగిపోయింది. తను వూదిన కొమ్ముబూర ధ్వని దొంగలుకూడా విన్నారని పింగళుడికి అర్థమైపోయింది. ఇక ఆలసించి లాభంలేదు. వెంటనే పింగళుడు ఒక పెద్ద కొండరాయిని, దిగువ వున్న దొంగల మీదికి దొర్లిస్తూ, తన సైనికులనుకూడా ఆజ్ఞాపించాడు.

పింగళుడు తోసిన రాయి భూమిని తాకీ తాకకముందే 'జుమ్'మంటూ కొన్ని అంబులు అతడున్నచోట రాళ్ళను తాకినై. పింగళుడు చప్పున ఒకరాతి వెనకకు తప్పుకుని, కిందికి తొంగిచూశాడు. కొందరు







దొంగలు యీటెలు చేబూని బిగ్గరగా అరుస్తూ, కొండ ఎక్కుతున్నారు. అదే సమయంలో, మరొక దిక్కునుంచి కొన్ని బండ రాళ్లు దొర్లుతూ వాళ్ళమీద పడి, అందరినీ చెల్లాచెదురుచేసినై.

తన సంకేతం హసన్‌గోరీ అందుకున్నాడని పింగళుడు చాలా సంతోషించాడు. వెంటనే అతడు వున్న బలాన్నంతా కూడగట్టుకుని, దొంగలమీదికి కొండరాళ్ళను తోస్తూ కిందికి దిగసాగాడు. హసన్‌గోరీతో వున్న సైనికులు సింహనాదాలు చేసి, కొండరాళ్ల మీదుగా కుప్పించి దూకుతూ, దొంగలముఠా వున్న చోటుకు పరిగెత్తుతున్నారు.

పింగళుడుకూడా తన సైనికులను వెంట పెట్టుకుని, దొంగలువదిలే బాణాలను తప్పుకుంటూ ముందుకు పరిగెత్తసాగాడు.

రెండు ముఠాలూ కొండ దిగువనున్న సమతల ప్రదేశాన్ని చేరేసరికి, ఎక్కడి దొంగలక్కడ చెల్లాచెదురుగా పరిగెత్తారు. కాని, వెనకబడిన కొందరు దొంగలను తమ చేత గల యీటెలతో హసన్‌గోరీ సైనికులు పొడిచి చంపారు.

"పింగళా! కమ్ముకొస్తున్న యీ చీకటిలో మనం వాళ్ళను వెన్నాడలేము. ఈ రాత్రికి యిక్కడే మజిలీచేసి, సూర్యోదయం కాగానే వాళ్ళ అంతు తేల్చుకుందాం," అన్నాడు హసన్‌గోరీ. పింగళుడికిక్కూడా అదే మంచిమార్గంగా తోచింది. అతడు అంగీకార సూచకంగా తలాడించి, అక్కడ బల్లపరుపుగా వున్న ఒకరాతి మీద కూర్చోబోయేంతలో, "ఎవరా పింగళుడు? అవంతీ నగర జాలరి కాదుగదా?" అన్నమాటలు ఆ కొండగుట్టల మీద ప్రతిధ్వనించినై.

"ఎవరు? పద్మపాదుడా?" అంటూ పింగళుడు ఆ ప్రశ్న వచ్చిన వైపుకు తిరిగాడు. నిలువెత్తున వున్న ఒకరాతి చాటునుంచి పద్మపాదుడు నవ్వుతూ ముందుకు వస్తున్నాడు. —(ఇంకా వుంది)






## 16

[హసన్‌గోరీతో కలిసి, పింగళుడు అఫీల్లా కోటతలుపులు తెరవబోయేసరికి, ఎడారిదొంగలు వాటి వెనక పెట్టిన మాటు పేలి, కొందరు సైనికులు గాయపడ్డారు. తరవాత ఎడారి దొంగ రాబందు, కొండలలో కనిపించాడు. అక్కడ పోరు జరిగింది. అదేసమయంలో పింగళుడికి హఠాత్తుగా, మాంత్రికుడైన పద్మపాదుడు కనిపించాడు. తరవాత—]

మహామాంత్రికుడైన పద్మపాదుణ్ణి, తిరిగి తను జన్మలో చూడగలనని పింగళుడు ఏనాడూ భావించలేదు. అలాంటి స్థితిలో పద్మపాదుడు, హఠాత్తుగా కనిపించటమే గాక, అదీ.... అవంతీనగర రాజ్యభూములకు ఎడంగా ఎక్కడో వేలమైళ్ళదూరాన వున్న ఎడారికొండలలో అవటం, పింగళుణ్ణి ఎంతో ఆశ్చర్యపరిచింది. కాని, మరుక్షణంలోనే అతడి ఆశ్చర్యం అనుమానంగా మారటంతో, అతడు తన పక్కనే వున్న హసన్ గోరీకేసి చూశాడు.

హసన్‌గోరీ ముఖంలోకూడా అనుమానం, సంశయం తొణికిసలాడుతున్నవి. అతడు పింగళుడి భుజం పట్టుకుని దగ్గిరకు లాగుతూ, "పింగళా! ఎవరీ పద్మపాదుడు? ఎడారిదొంగ రాబందు యితడే కాదుగదా ?" అన్నాడు రహస్యంగా.

పింగళుడు ఏదో చెప్పబోయేంతలో పద్మపాదుడు వారిని సమీపించాడు. అతడు హసన్‌గోరీకేసి వేలు చూపుతూ, "పింగళా! ఎవరీతడు?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నతో పింగళుడు మరీ తికమక పడిపోయాడు.







అతడి తడబాటును గుర్తించిన పద్మపాదుడు, అందుకు కారణం ఏమిటో గ్రహించినట్లు చిరునవ్వునవ్వుతూ, "పింగళా! నీవు నన్నుగురించి ఏదో అనుమానిస్తున్నట్టున్నది, అవునా?" అని ప్రశ్నించాడు.

పింగళుడికి ఏమని జవాబు చెప్పాలో తెలియలేదు. అతడి దృష్టి, పద్మపాదుడిమీదినుంచి హసన్‌గోరీకేసి తిరిగింది; దానితో హసన్‌గోరీ పద్మపాదుడికేసి ఒక అడుగు ముందుకు వేసి, "అయ్యా, మీరెవరో నాకు తెలియదు. కాని...." అంటూ ఆగాడు. హసన్‌గోరీ మాటలకు పద్మపాదుడు బిగ్గరగా నవ్వాడు.



అతడు పింగళుడిని సమీపించి, అతడి భుజాన్ని ఆప్యాయంగా తడుతూ, "పింగళా! ఇప్పుడు, యీ కొండప్రాంతాలనుంచి పారిపోయిన ఎడారిదొంగలకు నాయకుణ్ణి నేనే అని మీయిద్దరూ అనుమానించటం లేదు గదా?" అని అడిగాడు.

"లేదు, పద్మపాదా!" అంటూ పింగళుడు, హసన్‌గోరీని చూపుతూ, "ఈయన నవాబుగారి ఒంటెల పటాలం నాయకుడు, పేరు హసన్‌గోరీ. రాబందు అనబడే ఎడారి దొంగకోసం, యీయన యీ ప్రాంతాలన్నీ గాలిస్తున్నాడు," అన్నాడు.

పద్మపాదుడు ఆ మాటలు వింటూనే, హసన్‌గోరీకేసి తిరిగి, "అయ్యా! మీరు ఎడారి రక్షకభటనాయకులైతే, మీరు కాపాడవలసిన కొందరు వర్తకులు, ఆ కనబడే గుహలో బంధింపబడి వున్నారు. వారికి సాయంచేయండి," అన్నాడు.

హసన్‌గోరీకి పద్మపాదుడిమీద యింకా నమ్మకం కలగలేదు. అది గ్రహించిన పింగళుడు అతడితో, "హసన్, మీరు యీ పద్మపాదుణ్ణి నావద్దగ్గిర వదలండి. మీరేమీ భయపడవలసిందిలేదు. ఈయన్నుంచి సర్వం నేను తెలుసుకుంటాను. ఒకవేళ యీయనే దొంగల నాయకుడైన రాబందు అయితే.









మీకు కాళ్ళూ చేతులూ కట్టి ఒప్పగించ గలను," అన్నాడు.

పింగళుడి మాటలు, హసన్‌గోరీలో వున్న అనుమానాలనన్నిటినీ పటాపంచలుచేసినై. అతడు కొందరు సైనికులను వెంటబెట్టుకుని, పద్మపాదుడు చూపిన కొండగుహకేసి బయలుదేరి వెళ్ళాడు.

"పింగళా! యీ దేశంకాని దేశంలోని ఎడారిప్రాంతపు కొండల్లో నిన్ను యీవిధంగా కలుసుకోవటం, నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది. అవంతీనగరంలోని నీ స్వగృహాన్ని వదిలి, యింతదూరం ఏకారణం చేత నీవు రావటం సంభవించింది?" అని ప్రశ్నించాడు పద్మపాదుడు.

"పద్మపాదా! నాది చాలా దీనాతిదీనమైన కథ. మీరిచ్చిన మహత్తు గల సంచీనీ, ధనరాసులనూ, ఆఖరికి అన్నిటా సహాయపడుతూండే భల్లూకకేతుణ్ణికూడా కోల్పోయాను. ఈ బాధలన్నిటికీ మూలకారణం, దుర్మార్గులూ, కుచ్ఛితులూ అయిన నా అన్నలు. మీనుంచి సెలవుతీసుకుని, నా స్వగృహం చేరినప్పటినుంచి యీనాటి వరకూ, నేను అనుభవించిన యాతనలను గురించి చెప్పాలంటే—చాలాకాలం పడుతుంది. ముందుగా మీరీప్రాంతాలకు ఏ కారణంవల్ల వచ్చారో చెప్పండి. మరో మాంత్రికుణ్ణి జయించటానికి వచ్చివుంటే, నేను మరోసారి మీకు సాయపడగలను," అన్నాడు పింగళుడు.

పింగళుడు అన్న ఆఖరి మాటలు పద్మపాదుడికి సంతోషం కలిగించినా, ప్రారంభంలో అతడు తన ధనాన్ని, మహత్తు గల సంచీని పోగొట్టుకున్నట్టు చెప్పిన విషయం మాత్రం అతడికి చాలా విచారం కలిగించింది. భల్లూక పర్వతాలదగ్గిర మహామాయుణ్ణి జయించటంలో పింగళుడు తనకుచేసిన గొప్ప సహాయాన్ని, పద్మపాదుడు యీనాటివరకూ మరిచిపోలేదు.








"పింగళా! నేను మరే మాంత్రికుణ్ణి జయించేందుకూ యీ ప్రాంతాలకు రాలేదు. మహామాయుడి సమాధినుంచి మనం సంపాయించిన అపూర్వ శక్తులుగల వస్తువులు నాదగ్గిర వున్నంతకాలం, నేను యీ లోకంలో ఎవరిని చూచి భయపడ నవసరం లేదు. నేను కేవలం దేశాలు చూచేందుకూ, యాత్రాస్థలాలను సందర్శించేందుకూ బయలుదేరాను. ఆ కారణంవల్ల, నేను మామూలు యాత్రికుడి వేషంలో, ఒకానొక ఒడారు వర్తకులతో కలిసి యీ ప్రాంతాలకు చేరాను. ఈ సాయంకాలమే ఆ ఒడారుమీద కొందరు దొంగలు దాడిచేసి, విలువగల సామానులన్నీ దొంగిలించి, వర్తకుల నందరినీ, ఆ కనబడే గుహలో బంధించారు. వారిలో కొందరు అవంతీనగరవాసులు వున్నారు," అన్నాడు పద్మపాదుడు. ఆ మాటలు వింటూనే పింగళుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

అతడు పద్మపాదుడి ముఖంలోకి అనుమానంగా చూస్తూ, "పద్మపాదా! మహ మాంత్రికులైన మీరుండికూడా, క్రూరులైన ఆ ఎడారి దొంగలు వర్తకులను దోచుకుంటూ వుంటే చూస్తూ ఎలా వూరుకోగలిగారు?" అని అడిగాడు.

పద్మపాదుడు చిరునవ్వు నవ్వాడు. "పింగళా! నేను ఆ ఒడారువర్తకుల గుంపు వెంట బయలుదేరినప్పుడు, యాత్రికుణ్ణని మాత్రమే చెప్పాను. అలా కాక, నేను ఫలానా మాంత్రికుణ్ణని చెప్పివుంటే, వాళ్ళెవరూ నన్ను ఒడారువెంట రానిచ్చేవారు కారు. ఆ కారణంవల్లనే ఎడారిదొంగలు వారిని దోచుకుంటున్నా, నేనెవరో బయట పడకుండా వుండేందుకుగాను, నా మంత్ర తంత్రాలను, ఆ దొంగలమీద ప్రయోగించకుండా, యీ రాళ్ళ చాటున తప్పుకున్నాను," అన్నాడు పద్మపాదుడు.

"మీ ప్రవర్తన నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది పద్మపాదా!" అన్నాడు పింగ







శుడు. "మీవద్ద వున్న అద్భుతవస్తువులైన భూగోళం, ఉంగరం, వజ్రాలు తాపిన పిడి గల కత్తి—వీటిలో ఏ ఒక్కదాని సాయంతో అయినా, మీరు చూడవలసిన స్థలాలన్నీ ఇట్టె చూసిరావచ్చునుగదా? అలాంటప్పుడు మార్గశ్రమలకన్నిటికీ ఓర్చి, యీ వర్తకుల వెంట బయలుదేరటమెందుకు?" అన్నాడు.

"ఓహో, పింగళా! నేనా దొంగల నాయకుడైన రాబందుననీ, యింకా నీవు అనుమానించటం లేదుగదా?" అంటూ పద్మపాదుడు పింగళుడి ముఖంలోకి ఆశ్చర్యంగా చూసి, "దేశదేశాలు తిరుగుతూ, ఆయా చోటుల వున్న పుణ్యక్షేత్రాలను దర్శించి, ఆ ఫలం అనుభవించాలంటే, అందరితోపాటు నేనూ పాదచారిగానే వెళ్ళవలిసి ఉంటుంది. అంతేకాని నాదగ్గిర వున్న అద్భుత శక్తుల సాయంతో, అనుకున్న చోటుకు మరుక్షణాన చేరటంవల్ల యాత్రా ఫలం దక్కదు" అన్నాడు.

వీళ్లిలా మాట్లాడుతుండగా, అల్లంత దూరాన హసన్‌గోరీ సైనికుల కేకలతోపాటు బిడారువర్తకుల ఏడుపులూ, పెడబొబ్బలూ, కలిసి చెవులు చిల్లులు పడేలా—రణగొణ ధ్వని సాగటంతో ఆ ప్రాంతమంతా గందరగోళంగా తయారైంది. పింగళుడూ, పద్మపాదుడూ తమ సంభాషణ ఆపి, అటుకేసి తలలు తిప్పారు. అదే సమయంలో ఒక సైనికుడు పరిగెత్తుతూ పింగళుడి దగ్గిరకు వచ్చి, "రాబందును వెంటబడి పట్టుకునేందుకు, హసన్‌గోరీ సర్దార్, మీ సాయం కావాలంటున్నారు!" అని చెప్పాడు.

పింగళుడు, పద్మపాదుడికేసి బ్రతిమాలుతున్నట్టు చూసి, "పద్మపాదా! యీ హసన్ గోరీ నన్ను, యీ ఎడారిలో దాహానికీ, ఆకలికీ మాడి చావకుండా రక్షించాడు. నేను యిందుకు ప్రతిగా అయనకు ఏదైనా సహాయం చేయాలనుకుంటున్నాను. ఈ చీకట్లో, ఆ ఎడారిదొంగలను పట్టుకోవటం





మానవమాత్రుడివల్ల అయేపని గాదు. ఆ ఎడారిదొంగలూ, వారి నాయకుడైన రాబందూ బహు క్రూరులు. ఈ దగ్గిరలో వున్న ఒక ఖిల్లాలోని సైనికులందరినీ హత్యచేసి, కపటోపాయంతో మమ్మల్నికూడా చంపేందుకు వాళ్ళు ప్రయత్నించారు. కనుక, యీ ఎడారిదొంగలను పట్టుకునే ప్రయత్నంలో మీరు మీ అద్భుతశక్తులను ప్రయోగించి మాకు సాయపడండి. ఆ విధంగా, యీ ప్రాంతాల ప్రయాణించే వర్తకులకూ, యాత్రికులకూ ఆ ఎడారిదొంగల నుంచి రక్షణ కల్పించండి! మీమేలు వారెన్నటికీ మరిచిపోరు," అన్నాడు.

"పింగళా! నీవు కోరుతున్నావు గనక సాయం చేస్తాను. కాని, అందువల్ల నేను మాంత్రికుణ్ణని, ఆ వర్తకులందరూ గ్రహిస్తారు. ఆ తరవాత వారితో నేను ప్రయాణించటం అసంభవం. సరే, యాత్రాస్థలాలు దర్శించేందుకు ఎన్ని మార్గాలు లేవు!" అంటూ పద్మపాదుడు, ఒక రాయిని తీసుకుని, దానిని తన కత్తితో చిన్నచిన్న ముక్కలుగా నరకసాగాడు.

పద్మపాదుడు చేస్తున్న పని చూసి పింగళుడు చాలా ఆబ్బురపాటు చెందాడు. అతడు పద్మపాదుడి భుజంపట్టుకుంటూ, "పద్మపాదా, మీరు చేస్తున్న పని ఏమిటి?





అవతల ఎడారిదొంగలు, వర్తకుల సొమ్ము దోచుకుని పారిపోతున్నారుగదా! ముందు, వాళ్లను హతమార్చే ఉపాయం ఆలోచించండి!" అన్నాడు.

పద్మపాదుడు నవ్వుతూ, తన గుప్పెట లోకి కొన్ని రాతిముక్కలను తీసుకుని, వాటిని పింగళుడికి చూపుతూ, "ఈ చీకటిలో, ఆ దొంగలను వెన్నాడటం మానవమాత్రుడికి సాధ్యంకాదని నువ్వే చెపుతున్నావుగదా? అందుకని, చీకటిలో చూడగలిగిన తోడేళ్లనూ, పెద్దపులులనూ ఆ దొంగలను మళ్లించుకువచ్చేందుకు పంపుతున్నాను. యీ అరచేతిలో వున్న పెద్ద రాతిముక్కలు పులులు, చిన్నవి తోడేళ్లు!" అంటూ ఆ రాతిముక్కలను మంత్రించి, బలంకొండికీ వాటిని ఆ చీకట్లో అన్నివైపులకూ వెదజల్లాడు.

చూస్తూండగానే ఆ కొండరాళ్లల్లోనుంచి భీకరంగా అరుస్తున్న తోడేళ్లూ, పెద్దపులులూ బయటికివచ్చి, రాతిబండలమీదినుంచి ఉప్పొంచి దూకుతూ, అన్ని వైపులకూ పరుగులు దీసినై.

ఈ అద్భుతదృశ్యం చూసి పింగళుడు నిశ్చేష్టుడయ్యాడు. అతడు చూస్తూండగానే, కొండగుహనుంచి హసన్‌గోరీ విడిపించిన వర్తకులందరూ గుంపుగా బయలుదేరి పద్మ





పాదుడు వున్నచోటుకు వచ్చారు. వారివెంట వున్న హసన్‌గోరీ చేతులను గాలిలో ఊల్లాడిస్తూ, "పింగళా! ఏమిటీ వింత? ఈ కొండప్రాంతాల నేనెన్నడూ ఒక్క తోడేలును గాని, ఒక్కగానొక్క పెద్దపులినిగాని చూసినది లేదు. కాని, యిప్పుడు...." అంటూ కళ్లింత చేసుకుని పింగళుడికేసి చూస్తూ ఆగిపోయాడు.

"పద్మపాదా! ఇక మీగురించిన రహస్యం దాచి లాభంలేదు గనక, వీరందరికీ నిజం చెప్పమంటారా?" అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు అంగీకారసూచకంగా తల వూపి, తన దుస్తుల్లో దాచివుంచిన మహామాయుడి వేలి వుంగరాన్ని బయటికి తీసి, అక్కడ ఎత్తుగా వున్న ఒక కొండ రాతిమీద పెట్టాడు. మరుక్షణమే ఆ ప్రదేశమంతా కండ్లు మిరుమిట్లు కొలిపే కాంతితో, పట్ట పగటిలా అయిపోయింది.

పింగళుడు ఒకటి రెండు మాటల్లో పద్మపాదుడు మహామంత్రవేత్త అని అక్కడ చేరినవారందరికీ చెప్పి, హసన్‌గోరీకేసి తిరిగి "హసన్! ఆ ఎడారిదొంగ రాబందును గురించి నీవేమీ ఆదుర్దాపడ నవసరంలేదు. పద్మపాదుడు పంపిన తోడేళ్లూ, పెద్దపులులూ అతణ్ణి, అనుచరులతోపాటు, యిక్కడికి మందవేసుకు రాగలవు," అన్నాడు.

పింగళుడు మాట పూర్తిచేయకముందే, ఆ కొండలోయల్లో హాహాకారాలు బయలు దేరినై. వాటితోపాటు తోడేళ్ల అరుపులూ, పెద్దపులుల రంకెలూకూడా వినిపించినై. చూస్తూండగానే పందల సంఖ్యలో వున్న ఎడారిదొంగలు, అన్నివైపులా చుట్టుముట్టుతున్న క్రూరమృగాలనుంచి పారిపోయేందుకు ప్రయత్నిస్తూ, ఎటూ దారి కానక, పద్మపాదుడూ, పింగళుడూ వున్న చోటుకు భీతితో అరుస్తూ రాసాగారు.

—(ఇంకా వుంది)








## 17

[పద్మపాదుడు పింగళుడికి ఎడారిదొంగలు సిరాపు వర్తకులను బంధించిన గుహ చూపించాడు. హసన్‌గోరి సైనికులతో వెళ్ళి, వర్తకులను విడిపించాడు. తరవాత, పింగళుడు కోరగా పద్మపాదుడు తన మంత్రశక్తివల్ల, తోడేళ్లనూ, పెద్దపులులనూ సృష్టించి, వాటితో ఎడారి దొంగలను చుట్టుముట్టించి, తాను వున్నచోటుకు వాళ్ళను రప్పించాడు. తరవాత—]

ప్రాణభీతితో గగ్గోలుపెడుతూ తాము వున్న చోటుకు వచ్చిన ఎడారిదొంగలను చూసి, హసన్‌గోరి విజయసూచకంగా నవ్వాడు. ఎన్నో ఏళ్లనుంచి ఎడారిప్రాంతాల్లో ప్రయాణించే వర్తకులను దోచుకు బతుకుతున్న యీ దొంగలు, యింత తేలికగా తన చేత చిక్కుతారని అతడెన్నడూ వూహించలేదు.

ఈ విజయానికి కారణం పద్మపాదుడైనా, సహాబు తనను తప్పక బహూకరిస్తాడని అతడు భావించాడు. ఆ కారణంవల్ల హసన్‌గోరి పద్మపాదుడితో, "పద్మపాదా, మీశక్తి సాటిలేనిది. ఈ క్రూరకర్ములను పట్టుకునేందుకు చాలా సంవత్సరాలనుంచి నేను ప్రయత్నిస్తున్నాను. ఈనాటికి మీ సహాయం వల్ల అది సాధ్యమయింది. ఇక, ఈ ఎడారి ప్రాంతం వర్తకులకూ, యాత్రికులకూ ప్రయాణయోగ్యం అవుతుంది. మీ దయకు చాలా కృతజ్ఞుణ్ణి!" అన్నాడు.

పద్మపాదుడు చిరునవ్వు నవ్వుతూ, "హసన్! నేను చేయవలసిన సహాయమేదో చేశాను. ఇక యీ దొంగలను విచారించి శిక్షించవలసిన వాడివి నీవు. నా పెద్దపులు

లనూ, తోడేళ్లనూ ఉపసంహరించుకుంటున్నాను," అంటూ చేతులు రెండూ పైకెత్తి, ఏదో మంత్రం పఠించాడు. మరుక్షణంలోనే తోడేళ్ళు, పెద్దపులులూ మాయమయినై. పద్మపాదుడు తన గుప్పెళ్లలోకి వచ్చిన రాతిముక్కలను హసన్‌గారికీ, పింగళుడికీ చూపి, "ఇవే తోడేళ్ళు, పెద్దపులులూ!" అంటూ వాటిని దూరంగా విసిరివేశాడు.

హసన్‌గారి ఆజ్ఞాపించగానే, ఆతడి సైనికులు ముందుగా దొంగలనాయకుడైన రాబందుకు సంకెళ్లు తగిలించి, తరవాత అతడి అనుచరులందరినీ, ఒకటిగా మోకులతో బంధించారు. ఈలోపల పద్మపాదుడు, పింగళుణ్ణి ఎడంగా తీసుకుపోయి, "పింగళా! నీవు తిరిగి వెంటనే అవంతీనగరం వెళ్ళాలనుకుంటున్నావా?" అని అడిగాడు.

"అవును, పద్మపాదా! దుర్మార్గులైన నా అన్నలు నన్ను ఓడసరంగుకు అమ్మిన తరవాత, మా అమ్మనుకూడా నానాహింసలూ పెడుతూండి వుంటారు. లోగడ వాళ్లు ఇలాగే చేశారు. వాళ్లకు కన్నతల్లిమీదకూడా ప్రేమ లేదు," అన్నాడు పింగళుడు.

"నీ బాధలన్నిటికీ కారణం నీవు భల్లూకకేతుణ్ణి ఆవాహన చేసుకునే మంత్రం మరిచిపోవటం. ఇదుగో ఆ మంత్రం మళ్ళీ చెప్తున్నాను. ఈసారి అయినా బాగా జ్ఞాపకం



పెట్టుకోవటం క్షేమం," అంటూ పద్మపాదుడు పింగళుడికి ఆ మంత్రం జ్ఞాపకంచేసి, తన చేతి చిటికెనవేలికి వున్న వుంగరాన్ని తీసి పింగళుడికి యిస్తూ, "ఇదిగో, యీ వుంగరాన్ని జాగ్రత్తగా కాపాడుకో. నీకు ఏనాడైనాసరే, నన్ను చూడాలని వుంటే, నీ మనసులో నన్ను తలుచుకుని, వుంగరాన్ని తాకితేచాలు, మరుక్షణం నేను నీ దగ్గిరకు వచ్చి వాలతాను," అన్నాడు.

"పద్మపాదా! మీ మేలు ఎన్నటికీ మరవరానిది. మీ సహాయంవల్ల తిరిగి నేను నా కన్నతల్లిని చూడగలుగుతున్నాను. మీరు కూడా నావెంట అవంతీనగరం రాగలరా? మిమ్మల్ని చూస్తే, మా అమ్మ ఎంతో సంతోషించగలదు," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు పింగళుడికేసి వాత్సల్యం వుట్టిపడేలాచూస్తూ, "పింగళా! నీవు చేసిన మేలుమాత్రం నేనెలా మరిచిపోగలను? నీ సహాయంవల్లనేగదా నేను మహామాయుణ్ణి జయించగలిగింది! కనుక, ఏదో ఒకనాడు నేను మీయింటికి అతిథిగా వచ్చి, మీతల్లి దర్శనంకూడా చేసుకుంటాను. సరే, ప్రస్తుతానికి నేను యీ బిడారువర్తకులను వదిలి, ఒంటరిగానే తీర్థయాత్రలకు బయలుదేరవలసివుంటుంది. ఇక వెళతాను," అంటూ చూస్తూండగానే మాయమయాడు.





పింగళుడు, హసన్‌గారి దగ్గరకు వెళ్ళి, తాను తన దేశం బయలుదేరి పోతున్నట్టు చెప్పాడు. ఆ మాటలు వింటూనే, హసన్‌గారి ఆశ్చర్యపడి, "పింగళా! యివేమి మాటలు? ఏదో పక్కన వున్న వూరుకు బయలుదేరి పోతున్నంత తేలికగా చెపుతున్నావు! నీ దేశానికి యీ దేశానికి ఎన్నివేల మైళ్ళదూరమో తెలుసా ?" అని అడిగాడు.

పింగళుడు చిరునవ్వు నవ్వి, "హసన్! నా శక్తిసామర్థ్యాలు నీకు తెలియవు. నావెంట ఆ కనబడే రాయిచాటుకు వచ్చావంటే, నీకు ఒక అద్భుతవ్యక్తి దర్శనం కలిగేలా చేస్తాను. నీ సైనికులూ, ఆ ఎడారిదొంగలూ చూడటం మంచిదికాదు," అంటూ అక్కడికి దాపులనే వున్న ఒక పెద్ద రాతిచాటుకు దారితీశాడు.

పింగళుడు మనసులో మంత్రం జపించగానే, భల్లూకకేతుడు ప్రత్యక్షమై, అతడి ముందు మోకరించి, "ప్రభో, ఏమి సెలవు? చాలా కాలంగా యీ సేవకుణ్ణి మరిచిపోయారే!" అన్నాడు.

భల్లూకకేతుడి భయంకరాకారాన్ని చూస్తూనే, హసన్‌గారి పెద్దగా అరిచి అక్కడి నుంచి పారిపోబోయేంతలో, పింగళుడు అతడి చేయి పట్టుకుని ఆపుతూ, "హసన్! నీకు వచ్చిన భయం ఏమీలేదు. ఈ భల్లూక కేతుడు నా సేవకుడు!" అన్నాడు.

"ఈ రాక్షసుడు నీకు సేవకుడా!" అంటూ హసన్‌గారి మరింత ఆశ్చర్యపడ్డాడు.

"అవును," అంటూ పింగళుడు భల్లూకకేతుడి భుజాలమీదికి యెక్కి, "హసన్, యిక నేను నాదేశం పోతున్నాను. ఆకలి దప్పులతో అలమటించే నన్ను రక్షించావు. సర్వదా కృతజ్ఞుణ్ణి," అని, భల్లూకకేతుడితో, "భల్లూకా, నన్ను అవంతినగరంలోని నా గృహానికి చేర్చు," అన్నాడు.

భల్లూకకేతుడు పెద్దగా హుంకరించి ఆకాశంలోకి లేచి, సముద్రాలూ, నదులూ,







కొండలూ దాటి సూర్యోదయానికల్లా పింగళుణ్ణి, అవంతీనగర పరిసరాలలోని అతడి యింటిదగ్గిర దించారు.

శిథిలావస్థలో వున్న యింటిని చూస్తూనే పింగళుడు నిశ్చేష్టుడయాడు. అతడు యింటి తలవాకిటిని సమీపిస్తూండగానే, బక్కచిక్కిపోయి, నీరసస్థితిలో వున్న తల్లి కనబడింది. ఉబికివస్తున్న దుఃఖాన్ని అపుకుంటూ పింగళుడు, "అమ్మా!" అంటూ తల్లిని కావిలించుకున్నాడు.

తల్లి ఒక్క క్షణకాలం నివ్వెరపోయి, అంతలో తన కుమారుణ్ణి గుర్తించి, "నాయనా, పింగళా! జీవించేవున్నావా? ఎంత అదృష్టవంతురాలిని!" అంటూ ఏడవసాగింది. పింగళుడు తల్లిని ఓదారుస్తూ, "అమ్మా, యిక మనకు వచ్చిన భయం లేదు. దుర్మార్గులైన నా అన్నలు యెక్కడ వున్నారు?" అని అడిగాడు.

"నాయనా, వాళ్లు నీకు చేసిన ద్రోహానికి శిక్ష అనుభవిస్తున్నారు. వాళ్లిద్దర్నీ రాజు కారాగారంలో బంధించాడు," అన్నది తల్లి.

"అలా అయితే నీవింత దీనస్థితిలో వున్నావేం? నేను వదిలిపోయిన ధనం, మహత్తుగల సంచీ వున్నవిగదా?" అని అడిగాడు పింగళుడు.



తల్లి పొంగివస్తున్న దుఃఖాన్ని దిగమింగుతూ, "నాయనా, వాటికోసమే రాజు వాళ్లను కారాగారంలో పడవేశాడు," అంటూ పింగళుడు ఓడసరంగుకు బానిసగా చిక్కిం తరవాత జరిగినదంతా వివరంగా చెప్పింది.

తల్లి చెప్పిందంతా విని పింగళుడు కోపాద్రేకంతో వణికిపోయాడు. "అమ్మా! యీ అవంతీనగర రాజుకు తగిన ప్రతీకారం నేను చేస్తాను," అంటూ అతడు భల్లూకకేతుణ్ణి ఆవాహనచేశాడు.

"ప్రభో, ఏమిసెలవు!" అంటూ భల్లూకకేతుడు ప్రత్యక్షమయాడు. "భల్లూకా! అవంతీనగర రాజు నా అన్నలిద్దరిని కారా











గారంలో బంధించారు. వారిని తక్షణం యిక్కడికి తేవాలి. అంతేకాదు. అతడి కోశాగారంలో వున్న ధనాన్నికూడా యిక్కడకు తీసుకురావాలి. మహత్తు గల సంచీ కూడా అతడివగ్గిరే వున్నది. దాన్నికూడా వెతికి తేవాలి," అన్నాడు పింగళుడు.

"చిత్తం ప్రభో!" అంటూ భల్లూకకేతుడు మాయమై, పాతాళంలోంచి రాజభవనంలోకి ప్రవేశించి, ధనాగారంలో వున్న మొత్తం ధనాన్ని, మహత్తు గల సంచీని తీసుకుని, కారాగారంలోకి వెళ్ళాడు.

భల్లూకకేతుస్ని చూస్తూనే, పింగళుడి అన్నలు జీవదత్తుడూ, లక్షదత్తుడూ కెవ్వున కేకవేసి మూర్ఛపోయారు. భల్లూకకేతుడు క్షణంలో వారినిద్దరినీ భుజాలమీద వేసుకుని, పింగళుడి దగ్గిరికి వచ్చి, "ప్రభో! యిదుగో మహత్తు గల సంచి! యీ మూటలో రాజు ధనాగారంలో వున్న డబ్బంతా వుంది! వీరు మీ అన్నలు!" అంటూ అన్నలని పింగళుడి ముందు వుంచాడు.

మూర్ఛపోయిన కుమారులను చూడగానే తల్లికి వాళ్లమీద ఎంతో వాత్సల్యం కలిగింది. ఆమె వాళ్ల ముఖాలమీద నీళ్ళు చల్లి, "నాయనలారా, నాయనలారా!" అంటూ ప్రేమగా పలకరించింది.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ కళ్లు తెరిచారు. ఎదురుగా వాళ్లకు తల్లీ, పింగళుడూ కనిపించేసరికి ఒక్కసారిగా పైప్రాణాలు పైనే పోయినట్టయింది. వాళ్ళిద్దరూ పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, "అమ్మా, పింగళా! మమ్మల్ని క్షమించాలి. మాకు బుద్ధి వచ్చింది, మా పాపాలకు ఆ చీకటికొట్లలో ప్రాయశ్చిత్తం అనుభవించాం," అన్నారు.

ఆ మాటలతో పింగళుడికికూడా వాళ్ళ మీద జాలి కలిగింది. అయినా అతడు వాళ్లిద్దరికేసి కోపంగా చూస్తూ, "మీ యిద్దరికన్న పరమనీచులూ, ద్రోహులూ లోకంలో యెక్కడా వుండరు. కావాలంటే, ఈక్షణాన





మీ యిద్దరినీ భల్లూకకేతుడిచేత పాతాళంలో పూడ్చిపెట్టించగలను. కాని, సహోదరు లన్న గౌరవంతో ఈ ఒక్కసారికి మిమ్మల్ని క్షమిస్తున్నాను. ఒకవేళ తిరిగి మీరు ఏనాడైనా నాకుగాని, అమ్మకుగాని ద్రోహం తలపెట్టారో... మిమ్ములను ముక్కలు ముక్కలుగా నరికిస్తాను!" అన్నాడు.

"క్షమించు తమ్ముడూ, మాకు బుద్ధి వచ్చింది!" అన్నారు జీవదత్తుడూ, లక్షదత్తుడూ ఏకకంఠంగా.

పింగళుడు మహత్తు గల సంచీని తల్లికి యిస్తూ, "అమ్మా, వెంటనే భోజనం సంగతి చూడు," అని చెప్పి, భల్లూకకేతుణ్ణి దగ్గిరకు పిలిచి, "భల్లూకా! నదీతీరాన కనబడుతున్న ఆ చెట్లగుంపులో యీ రాత్రి గడిచి, సూర్యోదయం అయ్యేలోగా, నాకు చక్కని భవనం కట్టించాలి. ఆ భవనం అన్నిటా అవంతీనగర రాజప్రాసాదాన్ని మించిపోవాలి. తెలిసిందా?" అన్నాడు.

"చిత్తం, ప్రభో! భల్లూకపర్వతాల్లో వున్న నా అనుచరుల్లో గొప్ప గొప్ప శిల్పులున్నారు. కో అంటే వాళ్లంతా క్షణాలమీద వచ్చి దిగుతారు. ఆ గుంపును పిలుచుకు వచ్చి, యిప్పుడే పని ప్రారంభించమని సెలవా?" అన్నాడు భల్లూకకేతుడు.

"పగటివేళలో నీ రాక్షసగణమంతా యిక్కడికి రావటం ప్రమాదకరం. మిమ్మల్ని చూచిన తరవాత, యీ అవంతీనగరంలో పిట్టకూడా వుండేందుకు భయపడుతుంది. ప్రజలందరూ నగరం వదిలి పారిపోవటం, నా కిష్టం లేదు. కనుక, సూర్యాస్తమానం అయిన తరవాత పని ప్రారంభించు!" అన్నాడు పింగళుడు.

"చిత్తం, ప్రభో! భల్లూకపర్వతాలకు వెళ్లి, నా అనుచరులకు యీసంగతి చెప్పి, పొద్దుగూకేసరికల్లా పని ప్రారంభిస్తాను," అంటూ భల్లూకకేతుడు మాయమయాడు.

—(వచ్చే సంచికలో ముగింపు)








## 18

[పింగళుడు అవంతీనగరం చేరేసరికి, తల్లిద్వారా అక్కడ తన అన్నల దుస్థితి తెలిసింది. వెంటనే భల్లూకకేతుణ్ణి పంపి, రాజుగారి ధనాగారంలోని డబ్బు, మహత్తు గల నంచితో పాటు, అన్నలనుకూడా తన యింటికి తెప్పించాడు. తరవాత అతడి ఆజ్ఞ కాగానే, భల్లూకకేతుడు ఒక అపూర్వ భవనం కట్టేందుకు పూనుకున్నాడు. —తరవాత]

భల్లూకకేతుడు తన అనుచరులతో చీకటి పడేసరికల్లా అవంతీనగరం తిరిగివచ్చాడు. అతడి నాయకత్వంకింద, నదీతీరంలో భవన నిర్మాణం ప్రారంభించబడింది. వందల వేల సంఖ్యలో వున్న పిశాచశిల్పులూ, కూలీలూ కలిసి, పునాదులు తవ్వి, రాళ్లు చెక్కి ఒక అపూర్వభవనం కట్టసాగారు.

నదీతీరంలో చెలరేగిన యీ కోలాహలం, అవంతీనగర కావలివాళ్లు విని, అక్కడేమి జరుగుతున్నదో చూడబోయారు. యిలా వచ్చినవారిని చాలామందిని, భల్లూకకేతుడి అనుచరులు పట్టుకుని, భవననిర్మాణపు పనిలో కూలీలుగా వుపయోగించుకున్నారు. కత్తులూ, కటార్లూ తీసుకువచ్చి ఎదుక తిరిగిన రాజభటులను మెత్తగా తన్ని తగిలేశారు.

సూర్యోదయం అయేసరికల్లా భవనం తయారయింది. పింగళుడు, తల్లిని అన్నలనూ వెంటబెట్టుకుపోయి అందులో ప్రవేశించాడు. బాలసూర్యుని లేతకిరణకాంతిలో ఆ భవనం బంగారునీరు అద్దినట్టు తళతళ లాడిపోయింది. పింగళుడు భల్లూకకేతుడ







అనుచరులలో ఓ యాభైమందినిమాత్రం తనకు కాపలావాళ్లుగా వుంచుకుని తతిమ్మా వారిని భల్లూకపర్వతాలకు పంపేశాడు. భల్లూకకేతుడు ప్రహరీగోడకు వున్న ఇనప చువ్వల తలుపులను బార్లా తెరిచి, వాటి పక్కగా ఒక పెద్ద రాతికుర్చీమీద కాపలివాడిలా కూర్చున్నాడు.

ఆసరికే అవంతీనగర రాజప్రాసాదంలో కలకలం బయలుదేరింది. రాత్రి భల్లూకకేతుడి అనుచరులు కడుతున్న వింత భవనం చూడబోయి, వాళ్లవల్ల చావుదెబ్బలు తినివచ్చిన రక్షకభటనాయకుడొకడు మంత్రి దగ్గరకు వెళ్లి మొరపెట్టుకున్నాడు.



ఆ భవనం, అక్కడ పనిచేస్తున్న శిల్పులూ, కూలీలూ పిశాచాలని విన్నప్పుడు మంత్రికి మొదట యిది నమ్మదగినదిలా తోచలేదు.

"ఏమోయ్, యిది నమ్మశక్యంగా లేదు. నీవు తాగిన మత్తులో ఏవేవో పిచ్చికలలు కని వుంటావు. ఇక యింటికి పోయి విశ్రాంతి తీసుకో. రాజుగారికి తెలిస్తే నీకు కారాగారం తప్పదు," అన్నాడు మంత్రి.

"లేదు, మహామంత్రి! ఇంకా మన భటులు కొందరు వాళ్లకు ఖైదీలుగా వున్నారు. ఆ పిశాచాలచేత చావుదెబ్బలు తిని పారిపోయి వచ్చింది నేనొక్కణ్ణే కాదు. ఇంతెందుకు, మీరు కోటబురుజు ఎక్కి చూడండి, నదీతీరాన వున్న ఆ భవనం కనబడుతుంది!" అన్నాడు రక్షకభట నాయకుడు.

మంత్రి బురుజు ఎక్కి చూశాడు. ఎదురుగా నదీతీరాన సూర్యకాంతిలో మిలమిల లాడుతున్న వింతభవనం అతడి కంట బడింది. అతడి ఆశ్చర్యానికి అంతులేదు. "ఏమిటీ అద్భుతం!" అనుకుంటూ అతడు బురుజు దిగి వచ్చేంతలో, కోశాగారాధిపతి పెద్దగా కేకలుపెడుతూ, "మహామంత్రి! కొంపలంటుకున్నై. కోశాగారంలో చిల్లిగవ్వ లేకుండా దొంగిలించబడింది!" అన్నాడు.









"కోశాగారం కొల్లబోయిందా? కావలి వాళ్లేమయారు? వాళ్లను వెంటనే యిక్కడికి పిలిపించు!" అన్నాడు మంత్రి పణికిపోతూ.

"కావలివాళ్ల లోపం ఏమీలేదు, మహామంత్రి! కోశాగారం తలుపులు వేసినవి వేసినట్టే వున్నవి. వాటి బీగాలు చెక్కు చెదరలేదు. అంతా మాయ!" అన్నాడు కోశాగారాధిపతి ఆకాశంకేసి చూస్తూ.

"అంతా మాయ! అలాగా?" అంటూ మంత్రి, కోశాగారాధిపతికేసి. నిప్పులు చెరిగే కళ్లతో చూస్తూ, "ఈ మాయకు నీ వనుభవించబోయేది వురిశిక్ష, తెలుసా? రాజుగారి దగ్గిరకు పద!" అంటూ హుంకరించాడు.

మంత్రీ, కోశాగారాధిపతీ రాజుగారి గదిని సమీపించబోయేంతలో, కారాగారాధిపతి బొబ్బలుపెడుతూ అక్కడికి పరిగెత్తుకు వచ్చి, "మహామంత్రీ! మహావిపత్తు జరిగిపోయింది! ఆ జీవదత్తుడూ, లక్షదత్తుడూ మాయమయారు!" అన్నాడు.

ఈ మాటలతో మంత్రికి మతిపోయినట్టయింది. అతడు కారాగారాధిపతికేసి గుడ్లురుముతూ, "ఆ జీవదత్తుడూ, లక్షదత్తుడూ దేవతలా ఏం? ఎలా మాయమయారు?" అన్నాడు గద్దిస్తూ.



"వాళ్లుండే కొట్లో ఒక గొయ్యిమాత్రం వున్నది. అంత పెద్ద గొయ్యి మానవమాత్రు లెవరూ చేయలేరు. ఏ దేవతలో, రాక్షసులో చేసివుండాలి!" అన్నాడు కారాగారాధిపతి.

మంత్రి ఆలోచనలో పడ్డాడు. నదీతీరాన ఒక్క రాత్రిలో నిర్మింపబడిన భవనం, రక్షక భటనాయకుడు చెప్పే మాటలూ, రాజభవనంలో జరిగిన వింతలూ చూస్తూంటే, యిదంతా మానవమాత్రుల పనికాదని అతడికి అర్థమైంది. ఖైదు కొట్లలోనుంచి విడిపింపబడిన జీవదత్తుడికీ, లక్షదత్తుడికీ మంత్రవేత్త అయిన పింగళు డనే ఒక తమ్ముడు వున్నాడని మంత్రి లోగడ విని









వున్నాడు. "ఈ జరిగినదంతా రాజుగారికి విన్నవించటమే మంచిది. మంత్రవేత్త అయిన పింగళుడు యీ నగరానికి తిరిగి వచ్చివుండాలి!" అన్నాడు మంత్రి.

కాని, రాజుగారి గదిని సమీపించేసరికి, అక్కడా కల్లోలంగానే వున్నది. "నిజం చెప్పండి! మిమ్మల్నందర్నీ కొరతవేయించుతాను. నా అద్భుతాల సంచీ ఎక్కడ?" అంటున్నాడు రాజుగారు. ఆయనకెదురుగా, రాజుగారి వంటగదిలో పనిచేసే నౌకర్లంతా చేతులు కట్టుకుని నిలబడి వున్నారు.

మంత్రి రావటం చూస్తూనే, రాజుగారు అతడికేసి తిరిగి, "మంత్రీ, వీళ్లనందరినీ



కట్టకట్టి ఏనుగులచేత తొక్కించు. దుర్మార్గులు! నా మహత్తు గల సంచీని దొంగిలించారు!" అన్నారు వుద్రేకంగా.

"మహారాజా! యింకా చాలా ఘోరాలు జరిగిపోయినై," అంటూ మంత్రి అన్ని సంగతులూ రాజుగారికి నివేదించాడు. అంతా విని రాజు మండిపోతూ, "వెంటనే ప్రాసాదరక్షకుణ్ణి పిలిచి, యాభైమంది భటులను వెంటబెట్టుకుపోయి, ఆ భవనంలో వున్నవారందరినీ పెడరెక్కలు విరిచికట్టి యిక్కడికి లాక్కు రమ్మను!" అని ఆజ్ఞాపించాడు.

"మహారాజా, సావధానంగా ఆలోచించండి!" అంటూ మంత్రి యింకా ఏమో చెప్పబోయేంతలో, రాజు కస్సుమని లేచి, "నువ్వు ఆ జాలరివాడికి రాజ్యం కట్టబెట్టి, మంత్రిత్వం వెలిగిద్దామని చూస్తున్నావా ఏం?" అన్నాడు తీవ్రంగా.

మంత్రి మారు మాటాడలేకపోయాడు. అప్పుడే అక్కడికి వచ్చిన రాజప్రాసాద రక్షకుడు రాజుతో, "మహారాజా! ఆ పింగళుణ్ణి గుర్రానికి కట్టి యీడ్చుకురమ్మని సెలవా?" అని అడిగాడు.

"వాణ్ణి గుర్రానికి కట్టి యీడ్చుకు వచ్చినా, గాడిదకు కట్టి యీడ్చుకు వచ్చినా










నాకొకటే. నాకు కావలసింది మహత్తు గల సంచీ, ధనాగారంనుంచి వాడు దోచుకుపోయిన డబ్బూ! తెలిసిందా? యిక పో," అన్నాడు రాజు కోపంగా.

ప్రాసాదరక్షకుడు సాయుధులైన యాభై మంది భటులను తీసుకుని పింగళుడి భవనాన్ని సమీపించాడు. ప్రహరీద్వారం దగ్గిర పెద్ద రాతికుర్చీలో కూర్చుని, నీరెండలో జోగుతూన్న భల్లూకకేతుణ్ణి చూస్తూనే భటులు అదిరిపడి, "అయ్యో! వీడెవడో రాక్షసుడిలా వున్నాడు. ఆ ఏనుగుచెవులు చూడండి! అడవిపంది కోరల్లా వున్న వాడి దంతాలు చిత్తగించండి!" అన్నారు వెనకడుగు వేస్తూ.

ప్రాసాదరక్షకుడు పకపకమంటూ నవ్వి, "ఓరి అమాయకుల్లారా, భయపడకండి! వీడెవడో మనను భయపెట్టేందుకు, పగటివేషగాడిలా అవన్నీ తగిలించుకున్నాడు!" అంటూ గుర్రాన్ని అదిలించి, భల్లూకకేతుణ్ణి సమీపించి, తన చేతగల యీటెతో అతడి భుజాన్ని పొడుస్తూ, "అరే పొగరుబోతూ, కళ్ళు తెరు! రాజప్రాసాదరక్షకుడు ఏతెంచాడు!" అన్నాడు కోపంగా.

భల్లూకకేతుడు కళ్ళు తెరుస్తూనే తన భుజానికి ఆనివున్న యీటెను ఒక చేత్తో గుంజుకుని, దానిని తిరగవేసి, ప్రాసాదరక్షకుణ్ణి డొక్కలో రెండు పోట్లు పొడిచి, కుయ్యోమంటున్న అతగాడి రెండు కాళ్ళూ పట్టుకుని గిరగిరా తిప్పి, దూరంగా నదిలో విసిరివేశాడు.

ఈ దృశ్యం చూస్తూనే తతిమ్మా రాజభటులు, 'అయ్యో, బాబో!' అని అరుస్తూ అక్కడినించి పిక్కబలంకొందికి పారిపోసాగారు. భల్లూకకేతుడు వారికేసి ఓ త్రుటికాలం చూసి చిరునవ్వు నవ్వి తిరిగి తన రాతికుర్చీలో కూర్చుని తృప్తిగా కళ్ళు మూసుకున్నాడు.

పారిపోయిన భటులు హాహాకారాలు చేస్తూ రాజుగారిదగ్గిరకు వెళ్లి జరిగిన సంగతి







చెప్పారు. అది విన్న రాజుకు ఆగ్రహం ముంచుకు వచ్చింది. "ఓరి చవటల్లారా! ఒక్క అడివిజాతి మనిషిని పట్టుకురావటం మీవల్ల కాలేదన్న మాట, ఛీ!" అన్నాడు ఆయన. వెంటనే మంత్రి ముందుకు వచ్చి, "మహారాజా! తొందరపడకండి! వాడు అడివిజాతి మనిషో లేక రాక్షసుడో మనకు తెలియదు. ఆ జాలరి పింగళుడు మంత్రవేత్త అని మీకు తెలియంది కాదుగదా?" అన్నాడు వినయంగా.

"వాడెంత మంత్రవేత్త అయితేమాత్రం— ఆ జాలరి, అవంతీనగర రాజునే ధిక్కరిస్తాడా? వాడి తల నరికించి కోటకొమ్ముకు



కట్టిస్తాను!" అంటూ, "సేనానీ, సేనానీ!" అని చప్పట్లు చరిచాడు రాజు.

"మహారాజా!" అంటూ సేనానాయకుడు ముందుకు వచ్చాడు. పింగళుడు కట్టిన భవనాన్ని నేలమట్టం చేసి, అక్కడ దొరికిన వారి నందరినీ బంధించి తేవలసిందిగా రాజు అతడికి ఆజ్ఞ యిచ్చాడు.

సేనానాయకుడి ఉత్సాహానికి అంతు లేదు. యీమధ్య కొన్ని సంవత్సరాలుగా యుద్ధాలు లేకపోవడంతో అతడికి మతి పోయినట్టుగా వున్నది. యీ దెబ్బతో నదీ తీరంలో వున్న భవనాన్ని నేలమట్టం చేసి, అక్కడ దొరికినవారినందరినీ మనసారా చిత్రహింస చేయవచ్చుననుకున్నాడు. "ఈ పింగళు డనేవాడికి చిన్న సైన్యం వుంటే ఎంత బాగుండును! బాహాబాహి ముష్టాముష్టి భీకర భయంకర ఘోర సంగ్రామం చేద్దునే!" అనుకున్నాడతడు.

రెండువందలమంది అశ్వికులూ, మూడు వందలమంది కాలిభటులూ వెంట రాగా సేనానాయకుడు ఎంతో పటాటోపంతో బయలుదేరి పింగళుడి భవనాన్ని సమీపించాడు. భల్లూకకేతుడు నిద్రపోతున్నట్టు నటిస్తూనే, ఒక కన్ను సగం తెరిచి సేనానాయకుడి రాకను గమనిస్తున్నాడు. సేనా











నాయకుడు ప్రహరీగోడ ద్వారాన్ని సమీపించి, చేతనున్న యీటెను, భల్లూకకేతుడికేసి గురిపెట్టి, "ఏయ్, అడవిమనిషీ! మీ యజమాని ఎక్కడ? లే, లేచి నిలబడు!" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

భల్లూకకేతుడు అప్పుడే మెలుకువ వచ్చినవాడిలా, ఒళ్ళు విరుచుకుంటూ లేచి నిలబడి సేనానాయకుడికేసి దృష్టి సారించి, "ఎవడురా పిలిచిన మానవాధముడు, నువ్వేనా?" అన్నాడు కోపంగా.

ఆ ప్రశ్నతో సేనానాయకుడు నిలువెల్లా భగ్గుమన్నాడు. అతడు యీటెను భల్లూకకేతుడి గుండెలకు బారుచేసి, గుర్రాన్ని ముందుకు దూకించాడు. భల్లూకకేతుడు తీరా యీటెమొన గుండెల్ని తాకబోయే సమయానికి పక్కకు అడుగు వేసి, గుర్రం మీద వున్న సేనానాయకుణ్ణి రెండు చేతులతోనూ ఒడిసి పట్టుకుని, రాతికుర్చీలో పడవేసి పైనకూర్చుంటూ, చప్పట్లుచరిచాడు.

వెంటనే బిలబిలమంటూ అతడి అనుచరులు వివిధ రకాల రాతిఆయుధాలతో అక్కడికి పరిగెత్తుకువచ్చారు. వారికి పారిపో జూస్తున్న రాజభటులను చూపిస్తూ, "ఈ పొగరుబోతులను దూదికింద ఏకి తాళ్ళు పేనండి!" అన్నాడు భల్లూకకేతుడు.

భల్లూకకేతుడి అనుచరులు రాజుగారి అశ్వికులమీదా, కాలిభటులమీదా పడి తమ చేత గల రాతిఆయుధాలతో వాళ్ళను గొడ్లను బాదినట్టు బాదసాగారు. ఈ దృశ్యాన్ని చూసి భవనంలోని రెండో అంతస్తులో వున్న పింగళుడూ, తల్లీ, అన్నలూ పొట్టలు చెక్కలయేలా నవ్వుకున్నారు.

ఐతికి బయటపడిన కొద్దిమంది రాజభటులు కోటలోకి పరిగెత్తి, గోడుగోడుమంటూ జరిగినదంతా రాజుగారికి చెప్పారు. ఆ సరికి రాజుగారికి పింగళుడు మామూలు జాలరికాడని అర్థమైపోయింది. ఆయన కోపాన్ని తొక్కిపట్టుకుంటూ లేచి, తన





మంత్రితో, "మంత్రీ! ఇది చాలా అవమాన కరం అయిన సంగతి. చావో బ్రతుకో నేనే స్వయంగా సైన్యాన్ని నడిపి ఆ పింగళుడితో పోరాడుతాను. నేను ఒకవేళ యుద్ధంలో మరణించటమే జరిగితే...నా ఒక్కగానొక్క కుమార్తె పకుళను నువ్వే అన్నివిధాలా కాపాడి, ఆమెకు తగిన వరుణ్ణి చూసి వివాహం జరిపించాలి," అన్నాడు.

మంత్రి ఓ క్షణకాలం ఆలోచించి, "మహరాజా! తమరు ఆగ్రహించక నే చెప్ప బోయేదాన్ని శాంతంగా వినాలని కోరు తున్నాను," అన్నాడు.

"ఏమిటది?" అన్నాడు రాజు.

"పింగళుడు యువకుడు, అవివాహి తుడు. అతన్ని ఎరిగివున్న వారిద్వారా నాకు తెలిసినదేమిటంటే, అందచందాలలో ఏ రాజకుమారుడూ అతడికి సరిరాడని. ఐశ్వ ర్యంలో, శౌర్య సాహసాల్లోకూడా అతడికి అతడే సాటి. రాజకుమార్తెతో అతడికి వివాహం జరిపించటంద్వారా, మీకూ రాజ్యా నికీ్కూడా పెద్ద ఉపద్రవం తప్పుతుంది!" అన్నాడు మంత్రి.

రాజు కొంచెంసేపు ఆలోచించి, "ఇది నాకు సమ్మతమే, మంత్రీ!" అన్నాడు సంతోషంగా.

మంత్రి సర్వలాంఛనాలతో వెళ్ళి పింగ ళుడినీ, తల్లినీ కలుసుకుని రాజుగారి కోర్కె గురించి చెప్పాడు. రాజకుమార్తె సౌంద ర్యాన్నిగురించి లోగడే వినివున్న పింగళుడు వివాహనికి అంగీకరించాడు.

తరవాత కొద్దిరోజులకే రాజకుమార్తె పకు ళకూ పింగళుడికీ వైభవంగా వివాహం జరి గింది. మహామాంత్రికుడైన పద్మపాదుడు వివాహనికి వచ్చి వధూవరులను ఆశీర్వ దించాడు. కొంతకాలానికి రాజు మరణిం చగా, పింగళుడే అవంతీనగరానికి రాజై, చాలా సంవత్సరాలు ప్రజలకు యిష్టుడుగా రాజ్యపాలనచేశాడు. —(అయిపోయింది)



